THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




# ఐక్య ఉపాధ్యాయ

జూన్, 2001 రూ.5/-

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక



## విద్యా విషయక ప్రత్యేక సంచిక



భావి భారత పౌరులు వీరు - బలికారాదు జ్యోతిష్యానికి వీరి భవిష్యత్తు

బాలకార్మిక వ్యవస్థ నేటి విపత్తు - వున్నవారికి, కొన్నవారికేనా విద్వత్తు ?



నెల్లూరు జిల్లా కౌన్సిల్ ప్రారంభ సభలో ఉపన్యసిస్తున్న శ్రీ డి. రామిరెడ్డి



జిల్లా కౌన్సిల్ సందర్భంగా కావలి బహిరంగ సభలో ప్రసంగిస్తున్న అనాలసిస్ ఎడిటర్ డా॥ కె. నాగేశ్వర్






ప్రకాశం జిల్లా శాఖ కౌన్సిల్ ప్రారంభ సభలో ప్రసంగిస్తున్న శ్రీ కె. జోజయ్య, పాల్గొన్న ప్రతినిధులు



ఖమ్మం డి.ఇ.ఓ. ఆఫీసు ఎదుట రిలే నిరాహారదీక్షా శిబిరాన్ని ప్రారంభిస్తున్న శ్రీ వి.యల్. నరసింహారావు



ఖమ్మం డి.ఇ.ఓ. ఆఫీసు ఎదుట రిలే నిరాహార దీక్షలను మద్దతుగా ప్రదర్శన



నల్గొండ జిల్లా దేవరకొండలో యు.టి.యఫ్. చలివేంద్ర ప్రారంభ దృశ్యం



యం.నగర్ జిల్లా వెల్దండలో యు.టి.యఫ్. చలివేంద్రం ప్రారంభ దృశ్యం

IUV01A 396


# ఐక్య ఉపాధ్యాయ

విద్యా విషయక మాసపత్రిక

మే, జూన్ 2001

సంపుటి : 27 సంచిక : 5, 6



## సంపాదక వర్గం

దాచూరి రామిరెడ్డి

ప్రధాన సంపాదకులు

కొండవీటి జోజయ్య

నాగటి నారాయణ

ఎస్. ఆనందనాయుడు

చావా రవి


ఈ సంచికలో...




సంవత్సర చందా : రూ. 60-00

విడిప్రతి : రూ. 5-00



ఐక్య ఉపాధ్యాయ

గగన్ మహల్ రోడ్ నెం. 7, దోమల్‌గూడ,

హైదరాబాద్ - 29.

ఫోన్ : 7636840; ఫ్యాక్స్ : 7650366




పాదకీయం

# నూతన విద్యా సంవత్సరానికి స్వాగతం కర్తవ్యాలకు అంకితమవుదాం

సందడి, సందడిగ ఈ విద్యా సంవత్సరం ప్రారంభమయింది. 10వ తరగతి, 7వ తరగతి పబ్లిక్ పరీక్షా ఫలితాలలో విశేష ప్రగతి సాధించబడింది. విద్యా సంవత్సరం ప్రారంభం నుండే కొత్త పాఠశాలలు ప్రారంభిస్తున్నారు. ప్రాథమిక పాఠశాలలు - 4352, అప్పర్ ప్రైమరీ పాఠశాలలు - 7351 ప్రారంభమవుతున్నాయి. 1130 అప్‌గ్రేడెడ్ ఉన్నత పాఠశాలలకు గ్రాంటు-ఇన్-ఎయిడ్ లభిస్తుంది. డి.యస్.సి. నోటిఫికేషన్ రాబోతుంది. దాదాపు 30 వేలమంది ఉపాధ్యాయులు నియామకం కాబోతున్నారు. యివన్నీ ఆహ్వానించదగిన, హర్షించదగిన పరిణామాలు. అయితే, ఉపాధ్యాయులను వేధిస్తున్న సమస్యలు అపరిష్కృతంగానే ఉండిపోయాయి. దానికి నిరంతర పోరాటమే శరణ్యం.

ఇక రాజ్యాంగ బాధ్యతలలో దశాబ్దాల నుండి మిగిలిపోయిన అంశం అందరికి విద్య.

## అందరికి విద్య ఎవరి బాధ్యత ?

అందరికీ చదువు చెప్పించే బాధ్యత ప్రభుత్వానిది. ఇది రాజ్యాంగంలో విస్పష్టంగా పేర్కొనబడింది. ప్రభుత్వం యొక్క బాధ్యతను నెరవేర్చటానికి ఉపాధ్యాయులు, ఉద్యోగులు ప్రజానీకం తోడ్పడాలి. ఇది వారి కర్తవ్యం. ప్రజల అజ్ఞానం, దారిద్ర్యాల పునాదిపై ఆధారపడి గత 5 1/2 దశాబ్దాలుగా పాలిస్తూ వచ్చిన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కావాలనే అవలంభించిన నిర్లక్ష్య వైఖరి కారణంగా మన రాష్ట్రంలో నేటికి అక్షరాస్యతా శాతం 61.11 దాటలేదు. పురుషులలో అక్షరాస్యతా శాతం 70.85 కాగా స్త్రీలలో 51.17 మాత్రమే. జనాభాలో సగభాగంగా వున్న స్త్రీలు అక్షరాస్యతలో పురుషులు కంటె 19.88 శాతం వెనుకబడి వున్నారు.

1991, 2001 జనాభా లెక్కల ప్రకారం గత 10 సంవత్సరాలలో పురుషుల విద్య కంటె స్త్రీ విద్యలో కొంత పెరుగుదల వున్నది. స్త్రీలలో అక్షరాస్యత శాతం పెరుగుదల 18.45% కాగా పురుషులలో అక్షరాస్యతా శాతం పెరుగుదల 15.73%. గత 10 సంవత్సరాలలో జనాభా పెరుగుదల 13.86% కాగా నికర అక్షరాస్యతా పెరుగుదల 3% మాత్రమే. ఈ రేటున సంపూర్ణ అక్షరాస్యత సాధించాలంటే 30సం॥లు పడుతుంది. కాని ప్రభుత్వం 2005 నాటికి అందరికీ చదువు లక్ష్యాన్ని నెరవేరుస్తానని ప్రకటనలు చేస్తున్నది. లక్ష్యాన్ని సాధించేందుకు ప్రకటనలు, ప్రతినలు చాలవు. నిర్దుష్టమైన కార్యాచరణ అవసరం.

పరిస్థితులను నిర్దిష్టంగా అధ్యయనం చేయకుండా చేపట్టే చర్యలు రోగ నిర్ధారణ చేయకుండా వైద్యం చేయడం లాంటిదే.

'అందరికీ విద్య' లక్ష్యం నెరవేరాలంటే మన ఇరుగు పొరుగు రాష్ట్రాల, దేశాల నుండి పాఠాలు నేర్చుకోవాలి. అందుకు తగిన అధ్యయనం జరగాలి. ఉపాధ్యాయులు కూడ బిల్లు - టిల్లు పద్ధతిలో కాకుండా ఉపాధ్యాయుల మైనందుకు జాతి రుణం తీర్చుకొనే విధంగా అంకితభావంతో పనిచేయాలి. ప్రభుత్వం, గ్రామ కమిటీలు ఉపాధ్యాయులకు వెన్నుదన్నుగా నిలిచి వారిలో పనిచేసే భావాన్ని పెంచాలి. గ్రామాలలో ఉపాధ్యాయులు నివసించే విధంగా వాతావరణ పరిస్థితి కల్పించాలి. 9వ ప్రణాళిక కాలంలో పాఠశాలల్లో మంచినీరు, మరుగుదొడ్ల అభివృద్ధికి కేటాయించబడిన నిధులలో 10% కూడా ఖర్చు చేయలేదని కాగ్ నివేదికలో పేర్కొన్న విషయం గమనంలో వుంచుకోవాలి.

బాల కార్మిక వ్యవస్థ నిర్మూలించకుండా అందరికీ - విద్య అసాధ్యం. ఆర్భాటాలతో ప్రచారానికి మాత్రమే పనికొచ్చే పథకాలతో బాల కార్మిక వ్యవస్థ నిర్మూలం కాదు. అనువైన చట్టాలు చెయ్యాలి. కఠినంగా అమలు జరుపాలి. పేదలకు పనిదినాలు పెంచి ఉపాధి పెంచాలి. హాస్టళ్ల సంఖ్య పెరగాలి. ఉపాధ్యాయుల బోధనా పద్ధతులు మారాలి.

"అందరికి" విద్య అందరి లక్ష్యం కావాలి. అందుకు అంకిత భావంతో కృషి చేద్దాం.

# వార్తా ప్రపంచం

## భారీ సంఖ్యలో ఉపాధ్యాయ పోస్టులు మంజూరు

రాష్ట్ర వ్యాప్తంగా పాఠశాలలకు భారీ సంఖ్యలో ఉపాధ్యాయ పోస్టులను ప్రభుత్వం మంజూరు చేసింది. 7351 ప్రాథమిక పాఠశాలలను నూతనంగా ఏర్పాటు చేయనున్నారు. 4352 ప్రాథమిక పాఠశాలలను ప్రాథమికోన్నత పాఠశాలలుగా అప్‌గ్రేడ్ చేస్తున్నారు. అదేవిధంగా 1130 అప్‌గ్రేడెడ్ హైస్కూళ్ళకు 5650 పోస్టులు మంజూరు చేశారు. నూతనంగా ప్రారంభించే ప్రాథమిక పాఠశాలల్లో 1 S.G.T. పోస్టును, ప్రాథమికోన్నత పాఠశాలల్లో 1 స్కూల్ అసిస్టెంట్, 1 గ్రేడ్-II పండిట్ పోస్టు చొప్పున మంజూరు చేశారు. ఈ విద్యా సంవత్సరంలో నూతనంగా మంజూరైన హెడ్మాష్టర్ పోస్టులు మొత్తంగాను స్కూల్ అసిస్టెంట్లు, గ్రేడ్-1 పండిట్ పోస్టులలో 70% ఇన్‌సర్వీస్ టీచర్లకు ప్రమోషన్ కల్పించడం ద్వారా భర్తీ చేస్తారు. మిగిలిన 30% పోస్టులను, ప్రమోషన్ల ఫలితంగా ఏర్పడిన ఖాళీలను డి.ఎస్.సి. ద్వారా నింపుతారు.

## డి.యస్.సి. - 2001 కై షెడ్యూలు ప్రకటన

ఇప్పటికే రాష్ట్ర వ్యాప్తంగా ఖాళీగా వున్న 10,424 పోస్టులతోపాటు కొత్తగా మంజూరు చేసిన 21,705 పోస్టులకు D.S.C. 2001 ద్వారా నియామకాలు జరపడానికి రాష్ట్ర ప్రభుత్వం షెడ్యూల్‌ను ప్రకటించింది.

జూన్ 15న నోటిఫికేషన్ జారీ చేస్తామని, జులై 27 వరకు దరఖాస్తులు స్వీకరణ, ఆగస్టు 26న D.S.C. పరీక్ష సెప్టెంబర్ 20న ఫలితాల ప్రకటన, సెప్టెంబర్ 30 నాటికి నియామకాలు పూర్తి చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది.

## 5 రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల్లో N.D.A. కు ఎదురుదెబ్బ

మే 10వ తేదీన అస్సాం, కేరళ, పశ్చిమబెంగాల్, తమిళనాడు, పాండిచ్చేరి రాష్ట్రాల అసెంబ్లీలకు ఎన్నికలు జరిగాయి. అన్ని రాష్ట్రాలలోను కేంద్రంలో అధికారంలో ఉన్న N.D.A. కూటమి పక్షాలు ఓటమి పాలయ్యాయి.

**బెంగాల్ :** బెంగాల్‌లో గత 24 ఏళ్ళుగా అధికారంలో ఉన్న వామపక్ష కూటమి 6వ సారి కూడా ఘనవిజయం సాధించింది. మొత్తం 294 స్థానాలలో 200 స్థానాలను గెలుపొందింది. తృణమూల్, కాంగ్రెస్ కూటమికి 87 స్థానాలు దక్కగా, ఇతరులకు 7 స్థానాలు లభించాయి. తిరిగి బుద్ధదేవ్ భట్టాచార్య ముఖ్యమంత్రిగా మరొక 47 మంది మంత్రులతో నూతన ప్రభుత్వం ఏర్పాటైంది.

**అస్సాం :** అస్సాం అసెంబ్లీ ఎన్నికలలో పాలక అస్సాంగణ పరిషత్- బి.జె.పి. కూటమిని ఓడించి కాంగ్రెస్ పార్టీ అధికారాన్ని కైవసం చేసుకున్నది. మొత్తం 126 స్థానాలలో 125 స్థానాలకు ఎన్నికలు జరుగగా 71 స్థానాలను కాంగ్రెస్, 39 స్థానాలను A.G.P.–B.J.P. కూటమి, ఇతరులు 15 స్థానాలను గెలుపొందారు.

ఆ రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు తరుణ్ గగొయ్ ముఖ్యమంత్రిగా 16 మంది మంత్రులతో నూతన ప్రభుత్వం ఏర్పాటైంది.

**కేరళ :** కేరళలో యు.డి.యఫ్. ఘనవిజయం సాధించింది. 140 స్థానాలకుగాను U.D.F. 99 స్థానాలను గెలుచుకోగా అధికార L.D.F.కు 40 స్థానాలు ఇతరులకు ఒక స్థానం దక్కాయి. కేరళ ఓటర్లు ఏ పార్టీకీ వరుసగా 2వ సారి అధికారం అప్పగించరనే నానుడి ఈసారీ నిజమైంది. A.K. ఆంటోనీ ముఖ్యమంత్రిగా నూతన ప్రభుత్వం ఏర్పాటైంది.

**తమిళనాడు :** తమిళనాడు అసెంబ్లీ ఎన్నికలలో అన్నా డి.ఎమ్.కె. కూటమి ఘనవిజయం సాధించింది. మొత్తం 234 స్థానాలకుగాను A.I.A.D.M.K. కూటమి 196 స్థానాలను గెలుచుకోగా, అధికార డి.ఎం.కె. కూటమి 36 స్థానాలతో సరిపెట్టుకుంది. ఇతరులకు ఒక స్థానం దక్కింది.

అవినీతి కేసుల్లో శిక్ష పడిందని ఎన్నికలలో పోటీకి అనర్హురాలిగా ప్రకటించబడిన A.I.A.D.M.K. నేత కుమారి జయలలితనే ఆ పార్టీ ఎం.ఎల్.ఎ.లు తమ నాయకురాలిగా ఎన్నుకోవడంతో ఆ రాష్ట్ర గవర్నర్ ముఖ్యమంత్రిగా ఆమె చేత ప్రమాణ స్వీకరం చేయించక తప్పలేదు.

**పాండిచ్చేరి :** పాండిచ్చేరి అసెంబ్లీ ఎన్నికలలో మొత్తం 30 స్థానాలకు గాను కాంగ్రెస్ - టి.ఎం.సి. కూటమికి 13 సీట్లు, డి.ఎం.కె. ఫ్రంట్‌కు 12 సీట్లు, అన్నా డి.ఎం.కె.కు 3 స్థానాలు, బి.జె.పి., ఇండిపెండెంట్లకు ఒక్కో స్థానం లభించాయి. పి. షణ్ముగం నూతన ముఖ్యమంత్రిగా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

## ఆర్.కె. నారాయణ్ అస్తమయం

"మాల్గుడి డేస్", "గైడ్" చిత్రాల ద్వారా సామాన్యులకు కూడా చేరువైన ప్రఖ్యాత ఆంగ్ల నవలా రచయిత పద్మభూషణ్ రాశీపురం కృష్ణస్వామి అయ్యర్ నారాయణ స్వామి (ఆర్.కె. నారాయణ్) (94) మే 13న చెన్నైలో మరణించారు.

బాలల విద్యావిధానాన్ని సంస్కరించాలని, చదువుల పేరుతో వారి నెత్తిన గుదిబండలు ఎత్తిరాదని ఆయన అభిప్రాయపడేవారు.

బాలల్లో ఆంగ్ల పఠనాశక్తిని పెంపొందించే రచనలెన్నో చేశారు. శ్రీ నారాయణ్ మృతిపట్ల యు.టి.యఫ్. ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నది.

## నేపాల్‌లో రాజమేధం

నేపాల్ రాజు బీరేంద్ర, కుటుంబ సభ్యులందరినీ అతని పెద్ద కుమారుడు యువరాజు దీపేంద్ర జూన్ 1 రాత్రి కాల్చి చంపి, తనూ కాల్చుకుని కోమాలోకి వెళ్ళాడు. ఐనా సాంప్రదాయం ప్రకారం దీపేంద్రనే నేపాల్ రాజుగా ప్రకటించారు. 4వ తేదీ ఆయన కూడా మరణించారు. అనంతరం బీరేంద్ర సోదరుడు జ్ఞానేంద్రవీర్ విక్రంషా దేవ్ రాజుగా బాధ్యతలు స్వీకరించారు. జ్ఞానేంద్రను రాజుగా అంగీకరించలేని నేపాల్ ప్రజలు నిరసన తెలుపుతున్నారు. రాజకుటుంబం హత్య వెనుక కుటుంబ కలహాలా? లేక రాజకీయ కుట్రమైనా ఉందా? అన్న విషయం చర్చనీయాంశంగా వున్నది.

## భారత జనాభా 102 కోట్ల 70 లక్షల 15 వేల 247

2001 సెన్సెస్ పూర్తయిన పిదప మనదేశంలోని 28 రాష్ట్రాలు, 7 కేంద్రపాలిత ప్రాంతాలలోని జనాభా వివరాలను సెన్సెస్ కమిషనర్ ప్రకటించారు. మనదేశ జనాభా 102,70,15,247 కాగా పురుషులు 53,12,71,078; స్త్రీలు 49,57,38,169. జాతీయ సగటు అక్షరాస్యత 65.38% కాగా పురుషుల్లో 75.85% గాను స్త్రీలలో 54.16% గా వుంది.

**ఆంధ్రప్రదేశ్ జనాభా :** ఆంధ్రప్రదేశ్ మొత్తం 7 కోట్ల 57 లక్షల 27 వేల 541 కాగా పురుషులు 3 కోట్ల 82 లక్షల 86 వేల 811. స్త్రీలు 3 కోట్ల, 74 లక్షల 40 వేల 730. సగటు అక్షరాస్యత 61.11% కాగా పురుషులలో 70.85% గాను స్త్రీలలో 51.17% గాను వుంది.

# అమరజీవికి అక్షరాంజలి

## నిజ నివాళి

- బుద్ధిపూడి శీనయ్య, కొలనుకుదురు

మాటల్లో ఆప్యాయత
మాటకందని ఆత్మీయత
చెన్నుపాటి సేవా తత్పరత
చలించని కార్యదక్షత
వెరసి వెంకటస్వామి
అభ్యుదయ పథగామి
స్వామిగారొక సంస్థ
మేధావి, సాహితీవేత్త
యు.టి.ఎఫ్. నిర్మాత
అయ్యవార్ల అగ్రనేత
అలుపెరుగని అధినేత
కులమత సంకుచితాలకు
అతీతుడు ఆ నేత
వారిక లేరను వార్త
ఉద్యమానికే కొరత
వారి ఆశయ సిద్ధి కోసం
పనిచేస్తే మనమంతా
అదే కదా అప్పారికి అర్పించే నిజనివాళి

## ఉద్యమ జ్యోతి వెంకటస్వామి

- ఎలమర్తి రమణయ్య, కర్నూలు నగరశాఖ

మరపురాని మనిషి
మా వెంకటస్వామి
ఎఱుపు జెండ మెరుపులోన
వెలిగిన ఉద్యమజ్యోతి
మీకివే ఉద్యమాభివందనాలు
నీకివే అరుణారుణ జోహార్లు ॥ మరపురాని
ముసి ముసి నవ్వులతో
స్నేహసుధల జల్లి
పదునైన వాదనతో
మత్తు మందు జల్లి
కొరకరాని సమస్యలను
కొలికికి తెచ్చిన నేత
మృతి లేదునీకెన్నడు
మాస్మృతిలో అమరుడవు ॥మరపురాని॥
ఉవ్వెత్తూరే తీరున
ఉద్యమ చరితను చెప్పి
ఉత్తేజం నింపావు
ఉపాధ్యాయులందున
మీ ఛలోక్తి మాకు స్ఫూర్తి
యు.టి.ఎఫ్. ఉద్యమ స్ఫూర్తి
ఉద్యమమే జీవితమై
ధన్య జీవి వయ్యావు ॥మరపురాని॥

## అప్పారికి జోహార్

- కె.వి. లక్ష్మీకాంతమ్, మహబూబ్‌కాలేజి హైస్కూల్, సికింద్రాబాదు

యు.టి.ఎఫ్. ఉద్యమాన
స్వయం జ్యోతి 'అప్పారి'
ఉపాధ్యాయ వర్గానికి
పరంజ్యోతి 'అప్పారి' !!
ప్రగతిశీల ప్రజాస్వామ్య
భావాలకు పెన్నిధి
వామపక్ష సూత్రాలకు
అప్పారియె సన్నిధి !!
'సామాజిక స్పృహ' లేనిచో
'కోమా'లోన మనిషి
'ఐక్యఉపాధ్యాయ'కు అది
కొలలేనిది - నగిషీ !!
విప్లవాల గుర్తు ఎఱుపు
ఉద్యమాల గుర్తు ఎఱుపు
రక్తానికి గుర్తు ఎఱుపు
అపాయాల గుర్తు ఎఱుపు
పేదల వాదాలు ఎఱుపు
వెంకటస్వామి ఎఱుపు;
అతనిలోన, భావాలో !
తెగ ఎఱుపూ తెగ ఎఱుపూ !!
నిరాడంబర అప్పారికి
జోహార్ జోహార్
నిష్కళంక అప్పారికి
జోహార్ జోహార్
స్థిత ప్రజ్ఞ అప్పారికి
జోహార్ జోహార్
అమరుడైన అప్పారికి
జోహార్ జోహార్ !!

## ఆదర్శమూర్తి "అప్పారి"కి అశృతర్పణ నీరాజనాలు

- యస్.ఆర్.కె. డవి, తూ॥గో॥

"అప్పారి వెంకటస్వామి"
మరి... ఇక లేరన్న వార్త
విని... విస్మయం చెందాను !
విచారం... పొందాను !!
చరితార్థమై... తమరు చేసిన...
యు.టి.ఎఫ్. నిర్మాణం....
చరితార్థమైనది ఉపాధ్యాయ
ఉద్యమచరిత్రలో సువర్ణలిఖితమైనది !!!
అహర్నిశం శ్రమించి...
జీవితాన్ని పణంగా పెట్టి...
మీరు నిర్మించిన యు.టి.ఎఫ్.
అంతా ఆదర్శమయం !
మీ జీవితమే నిదర్శనం !!
మరపురాని మధురమూర్తీ...
ఆదర్శమూర్తీ... "అప్పారి"మీకివే...
అశృతర్పణ నిరాజనాలు !!!

# సంపాదకుని లేఖ

"ఐక్య ఉపాధ్యాయ" పత్రిక గత 26 సం॥లుగా మన రాష్ట్రంలో ఉపాధ్యాయ ఉద్యమానికి చోదకశక్తిగా పని చేయడమే కాక ఉపాధ్యాయులను, విద్యార్థులను జ్ఞాన జ్యోతిగా కూడ పనిచేసింది. దీర్ఘకాలం దీని ప్రధాన బాధ్యత నిర్వహించిన మన ప్రియతమ నాయకులు శ్రీ అప్పారి వెంకటస్వామి మరణించడం పత్రిక నిర్వహణకు తీరని లోటు.

అయినా నూతనంగా నియమింపబడిన సంపాదక వర్గం పత్రిక గత ప్రతిష్ఠను కొనసాగించడమే కాక, కాలానికనుగుణమైన మార్పులతో ఎంత ఆకర్షణీయంగా, ప్రతిభావంతంగా తీసుకరావాలని నిర్ణయించింది.

దీని కొరకు ఈ పత్రికలో అనేక శీర్షికల నిర్వహణలో తోడ్పడిన వారందరితో త్వరలో సమావేశం జరపడంతోపాటు, ప్రతిభ పాటవాలుగల మేధావులను, కార్యకర్తలను గుర్తించి వారికి బాధ్యత విభజన చేసి అన్ని శీర్షికలను పదునుగా నిర్వహించదలిచాము.

అనేక నెలలుగా మరుగునపడిన "గుసగుసలు" శీర్షిక అవినీతిపై అంకుశం అనే పేరుతో పునఃప్రారంభిస్తున్నము. ఈ శీర్షిక నిర్వహణలో మీ సహకారం అర్థిస్తున్నాం. అవినీతి సర్వవ్యాపితమైనదని భావించి దానితో సర్దుకుపోవడానికి సిద్ధపడుతున్న నేటి తరుణంలో మన ఆశయాలలో కీలకమైన అవినీతి వ్యతిరేక పోరాటం అడుగంటకుండా చూడాలి.

మన కార్యాలయాలలో, విద్యాలయాలలో కనిపించే అవినీతిని సాక్ష్యాధారాలతో వివరంగా వ్రాసేది. దానిపై నిరంతరం పోరాడుతూ, ఆ సమాచారం ఎప్పటికప్పుడు పంపండి.

తరగతి గదిలో ఉపాధ్యాయుని బోధనలో, విద్యార్థుల చూపే అంకితభావంలో వస్తున్న నూతన రీతులు ప్రతిబింబించే నూతన శీర్షిక త్వరలో ప్రారంభించబోతున్నాం దీనికి తోడ్పడే విధంగా నూతన ప్రక్రియ అవలంభిస్తున్న వారు, నిరతర ప్రయోగాలు చేస్తున్నవారు వారి వారి అనుభవాలను తెలుపగోరుచున్నాము.

యితర రాష్ట్రాల ఉద్యమవార్తలను తెలుపుటతోపాటు, అన్ని రాష్ట్రాలలో మన పత్రిక చదువడానికి వీలుగా ఒక పేజి పూర్తిగా S.T.F.I. వార్తలకు కేటాయిస్తున్నాము.

నిబంధనావాళి పాలసీ స్టేటుమెంటు, ఉద్యమచరిత్ర, నాయంకత్వ శిక్షణ కొరకు వివిధ శీర్షికలు నిర్వహించుతున్నాము.

పత్రిక సకాలంలో ఫిర్యాదుల కతీతంగా అందరికి చేరడానికి ప్రత్యేక చర్యలు చేపట్టాము.

ఈ పత్రిక కార్యకర్తలకు కరదీపికగా, ఉపాధ్యాయులకు ఆశాజ్యోతిగ, అవినీతి అధికార్ల గుండెలలో అంకుశంగా, తీర్చిదిద్దుటకు మీ సహకారాన్ని అర్థిస్తున్నాము.

ఓ. రామిరెడ్డి
ప్రధాన సంపాదకుడు


ప్రతిష్ఠమైన ప్రమాణాలు అంకితభావం సాధించిన అపూర్వ ఫలితాలతో తయారు చేయబడలరు

# గుడ్ షప్పర్డ్ ఇంగ్లీషు స్కూల్

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే గుర్తించబడినది)

ఇంజనీర్స్ కాలని, దేవి ఫంక్షన్ హాల్ వెనుక, కర్నూలు-2

నర్సరీ నుండి 10వ తరగతి వరకు డే & రెసిడెన్షియల్

**మా విశిష్టత:** విద్యార్థుల మానసిక వత్తిడిని తొలగిస్తూ, స్వయం ప్రేరణ కలిగిస్తూ, వారిలోని అద్భుతశక్తిని వెలికతీసి విజయంవైపు పయనింపజేసే విన్నూత్నమైన, ప్రపంచఖ్యాతిగాంచిన న్యూ రోలింగ్విస్టిక్ ప్రోగ్రామ్ (NLP) ను మొట్టమొదటిసారిగా కర్నూలు నగరంలో ప్రవేశపెట్టిన ఘనత మాదే.

ఈ విశిష్ట విధానం కర్నూలు నగరంలో గుడ్ షప్పర్డ్ ఇంగ్లీషు స్కూల్‌కు మాత్రమే సొంతం.

2000-2001

| | | | | | |
|---|---|---|---|---|---|
| 10వ తరగతి | మొత్తం విద్యార్థులు | : | 18 | ఉత్తీర్ణతా శాతం | 94.4% |
| | డిస్టిన్‌క్షన్ | : | 7 | 500 మార్కులు | |
| అత్యధిక మార్కులు | ప్రథమ శ్రేణి | : | 7 | వచ్చినవారు | 4 |
| 557/600 | ద్వితీయ శ్రేణి | : | 7 | | |
| 7వ తరగతి | మొత్తం విద్యార్థులు | : | 39 | | |
| | డిస్టిన్‌క్షన్ | : | 27 | ఉత్తీర్ణత శాతం | 100% |
| అత్యధిక మార్కులు | ప్రథమ శ్రేణి | : | 10 | 500 మార్కులు పైగా | |
| 554/600 | ద్వితీయ శ్రేణి | : | 1 | వచ్చినవారు | 15 |
| | తృతీయ శ్రేణి | : | 1 | | |

వివరాలకు :
జి. యేసుదాసు
M.A., B.L.
కరస్పాండెంట్
గుడ్ షప్పర్డ్ స్కూల్

# యస్.యస్.సి పబ్లిక్ పరీక్షలు - 2001 - ఫలితాలు - విశ్లేషణ

టి.డి. ప్రసాదరావు, సంచాలకులు, ప్రభుత్వ పరీక్షలు

2001 సం॥ మార్చిలో జరిగిన పదవ తరగతి పరీక్షా ఫలితాలు ఎంతో ప్రోత్సాహకరంగా వున్నాయి. గత సంవత్సరంతో పోల్చితే అన్ని జిల్లాల ఫలితాలలో మంచి పురోభివృద్ధి కనుపిస్తోంది. ప్రభుత్వ పాఠశాలల ఫలితాలు ఆశాజనకంగా ఉన్నాయి. ఈ మంచి అభివృద్ధికి కృషి చేసిన అన్ని స్థాయిల అధికార్లు, ఉపాధ్యాయులు అభినందనీయులు. అన్నిరకాల ప్రోత్సాహాన్నందించిన గౌ॥ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు గారికి, విద్యాశాఖ మంత్రి శ్రీ కడియం శ్రీహరి గారికి, విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఐ.వి. సుబ్బారావుగారికి, పాఠశాల విద్యా సంచాలకులు శ్రీ మన్మోహన్‌సింగు గారికి ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుచున్నాను. ఇదే పట్టుదలతో కృషి చేస్తే రానున్న 2 సం॥ ప్రభుత్వ పాఠశాలల ప్రతిష్ఠ మరింత యినుమడించగలదని ఆశిస్తున్నాను.

**యస్.యస్.సి. పరీక్షా ఫలితాలు - విశ్లేషణ :**

ఈ పరీక్షలు 16-3-2001 నుండి 30-3-2001 వరకు నిర్వహించబడినవి. మార్చి 2000 పరీక్షలలో 8,91,259 మంది హాజరు కాగా 2001 మార్చిలో 9,89,177 మంది హాజరయ్యారు. వీరిలో 5,74,555 మంది రెగ్యులర్ అభ్యర్థులు కాగా 4,14,622 మంది ప్రైవేటు అభ్యర్థులు.

రెగ్యులర్ అభ్యర్థులలో 3,74,119 మంది ఉత్తీర్ణులు కావడంతో వారి ఉత్తీర్ణతా శాతం 65.11 కు పెరిగింది. గత మార్చి ఫలితాలతో (54.48%) పోల్చినపుడు యిది 10.63% ఎక్కువ. అయితే ప్రైవేటు అభ్యర్థులలో 1,65,284 మంది మాత్రమే ఉత్తీర్ణులు గావడంతో వారి ఉత్తీర్ణతా శాతం కేవలం 39.86గా వున్నది.

**బాలబాలికల ఉత్తీర్ణతా శాతం :**

| రెగ్యులర్ అభ్యర్థులు | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| మొత్తం అభ్యర్థులు | 3,31,673 | 2,42,882 | 5,74,555 |
| ఉత్తీర్ణత - | | | |
| మొదటి తరగతి | 1,21,010 | 94,175 | 2,15,185 |
| రెండవ తరగతి | 63,581 | 45,621 | 1,09,202 |
| మూడవ తరగతి | 30,170 | 19,562 | 49,732 |
| ఉత్తీర్ణతా శాతం | 64.75 | 65.61 | 65.11 |

| ప్రైవేటు అభ్యర్థులు | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| మొత్తం అభ్యర్థులు | 2,76,909 | 1,37,713 | 4,14,622 |
| ఉత్తీర్ణత - | | | |
| మొదటి తరగతి | 33,447 | 22,151 | 55,598 |
| రెండవ తరగతి | 14,040 | 8,151 | 22,191 |
| మూడవ తరగతి | 5,574 | 2,837 | 8,411 |
| కంపార్ట్‌మెంటల్ | 51,236 | 27,848 | 79,084 |
| ఉత్తీర్ణతా శాతము | 37.66 | 44.29 | 39.86 |

**100 శాతం ఫలితాలను సాధించిన పాఠశాలలు :**

| వ.సంఖ్య | యాజమాన్యం | సంఖ్య |
|---|---|---|
| 1. | ప్రభుత్వ | 16 |
| 2. | జిల్లా పరిషత్ | 50 |
| 3. | మున్సిపల్ | 00 |
| 4. | రెసిడెన్షియల్ | 14 |
| 5. | ప్రైవేట్ | 223 |
| | మొత్తం | 303 |

**'0' శాతం ఫలితాలను సాధించిన పాఠశాలలు :**

| వ.సంఖ్య | యాజమాన్యం | సంఖ్య |
|---|---|---|
| 1. | ప్రభుత్వ | 04 |
| 2. | జిల్లా పరిషత్ | 12 |
| 3. | మున్సిపల్ | 01 |
| 4. | రెసిడెన్షియల్ | లేవు |
| 5. | ప్రైవేటు | 03 |
| | మొత్తం | 20 |

**జిల్లలవారీగా ఫలితములు :**

ఈ సంవత్సరం 82.45% ఫలితాలతో ప్రకాశం జిల్లా మొదటి స్థానంలో వుండగా, 50.55% ఫలితాలతో కడప జిల్లా కడపటి స్థానంలో వున్నది. 2000 సం॥లోను ప్రకాశం జిల్లాయే ప్రథమ స్థానంలో వుండగా, అంతకుముందు 1999లో నల్గొండ మొదటి స్థానములో వున్నది.

| వ.నెం. | జిల్లా | 1999 | 2000 | 2001 |
|---|---|---|---|---|
| 1. | హైదరాబాద్ | 52.05 | 45.71 | 59.76 |
| 2. | రంగారెడ్డి | 54.26 | 55.16 | 66.38 |
| 3. | శ్రీకాకుళం | 40.73 | 41.05 | 65.45 |
| 4. | విజయనగరం | 45.10 | 51.77 | 62.54 |
| 5. | విశాఖపట్టణం | 45.71 | 50.88 | 64.04 |
| 6. | తూ॥గో॥ | 44.08 | 48.21 | 60.78 |
| 7. | ప॥గో॥ | 48.23 | 51.55 | 67.03 |
| 8. | కృష్ణ | 51.41 | 56.53 | 63.71 |
| 9. | గుంటూరు | 54.69 | 59.50 | 66.73 |
| 10. | ప్రకాశం | 63.32 | 71.71 | 82.45 |
| 11. | నెల్లూరు | 47.22 | 50.89 | 62.30 |
| 12. | చిత్తూరు | 45.80 | 54.57 | 66.22 |
| 13. | కర్నూలు | 50.05 | 55.84 | 57.05 |
| 14. | అనంతపురం | 37.71 | 40.57 | 65.95 |
| 15. | కడప | 43.47 | 52.22 | 50.55 |
| 16. | మహబూబ్‌నగర్ | 66.20 | 50.83 | 60.84 |
| 17. | నల్గొండ | 67.26 | 61.54 | 71.74 |
| 18. | మెదక్ | 46.89 | 49.73 | 67.20 |
| 19. | నిజామాబాద్ | 65.72 | 63.84 | 54.06 |
| 20. | ఖమ్మం | 50.71 | 54.35 | 63.39 |
| 21. | వరంగల్ | 64.96 | 46.41 | 80.55 |
| 22. | కరీంనగర్ | 61.48 | 60.07 | 66.32 |
| 23. | అదిలాబాద్ | 52.72 | 54.74 | 69.19 |

విద్యార్థులకు తల్లిలాంటిది - ఉపాధ్యాయులకు ప్రియ నేస్తం

# VGS

ఒకటవ తరగతి మొదలు - డిగ్రీ వరకు అన్ని సబ్జక్ట్‌లకు గైడ్స్,
Question బ్యాంకులు మాత్రమే కాదు ఆంధ్రప్రదేశ్‌లో జరిగే
దాదాపు అన్ని పోటీ పరీక్షలకు, ప్రవేశ పరీక్షలకు అత్యుత్తమ ర్యాంకులు
సాధనకు సహాయపడే మేలైన "స్టడీ మెటీరియల్", నమూనా ప్రశ్నలు -
జవాబులతో పుస్తకములు ప్రచురిస్తున్న ఏకైక పబ్లిషర్స్ వి.జి.యస్. మాత్రమే

## V.G.S. PUBLISHERS

| H.O. : AMALAPURAM<br>Ph : 31807 | B.O. : VIJAYAWADA<br>Ph : 425885 |
|---|---|

**VISALANDHRA GENERAL STORES**
**PUBLISHERS & BOOK SELLERS**

**K. AGRAHARAM, AMALAPURAM - 533 201. Ph : 31807**

## విద్యారంగం - తీరుతెన్నులు

# విద్యారంగ పయనం తిరోగమనం వైపా ?

- కె.ఎస్. ఫణిక్కర్

***ప్రస్తుతం మన దేశంలో విద్య ఎలాంటి విశాల దృక్పథమూ, సామాజిక చైతన్యమూ లేని కేవలం శిక్షణకే ప్రాధాన్యతనిస్తోంది. ఇలాంటి విద్యా విధానం మార్పునకు తావివ్వని యధాతథ వాదానికే దారి తీస్తుంది. దేశంలో భిన్నాభిప్రాయానికి నిరసనకూ ప్రాధాన్యత లేకుండా చేస్తుంది.***

భారతదేశంలో ప్రస్తుత విద్యా విధానం ఛాందసత్వం, ప్రపంచీకరణల దుర్మార్గమైన వలలో చిక్కుకొంది. విద్యారంగం వ్యవస్థాపరంగాను, విషయపరంగానూ మార్పులకు లోనవుతోంది. విద్యారంగానికి ప్రభుత్వ సహాయం తగ్గిపోతుండగా అందులో ప్రయివేట్ పెట్టుబడులు ఎక్కువవుతున్నాయి. విదేశీ విద్యాలయాలు కూడా భారత విద్యా మార్కెట్‌లోకి ప్రవేశించటానికి ఎగబడుతున్నాయి.

ప్రభుత్వానికిప్పుడు విద్య ఒక అప్రాధాన్యతా రంగంగా మారిపోగా, ప్రయివేట్ రంగం మాత్రం ఇందులో పెట్టుబడి పెట్టేందుకు సంకోచించడం లేదు. దాని లక్ష్యం సామాజిక ప్రయోజనం కన్నా లాభార్జనే. దీనితోపాటే విద్యారంగం విషయపరంగా కూడా మార్పునకు లోనవుతోంది. స్వతంత్ర భారతదేశం ఇప్పటిదాక అమలుపరచిన లౌకిక విద్యా విధానం మత ప్రాధాన్యత గల విద్యా విధానంగా మార్చబడుతోంది. ఈ ప్రయత్నం విద్యారంగాన్ని అయోమయం, తిరోగమనం, విమర్శనా రాహిత్యాలలోకి నెడుతోంది. ప్రస్తుత విద్యారంగ సంక్షోభం ఎక్కువ మంది చెబుతున్నట్టు ఆర్థిక పరమైనది కాదు. విధానపరమైనది.

ప్రస్తుత కేంద్ర ప్రభుత్వమూ, దాని సమర్థకులూ విద్యారంగంలో ఇప్పటికే ఎన్నో చర్యలు గైకొన్నారు. వాటన్నిటిలో ప్రధానంగా రెండు ఎత్తుగడలు గోచరిస్తాయి. మొదటిది. విద్యను మత భావనలతో నింపడం. రెండవది, భవిష్యత్తులో ఒక మార్పు ఉందని, యధాతథవాద సమాజాన్ని నిర్మించడానికి విద్యను ఒక సాధనంగా రూపొందించడం ! మొదటి ఉద్దేశాన్ని సాధించేందుకు "విలువలతో కూడిన విద్య" అనే దానికి అతిగా ప్రచారమివ్వటం జరుగుతోంది. రెండవ లక్ష్యాన్ని నెరవేర్చుకొనేందుకు ప్రముఖ పారిశ్రామిక వేత్తలు ముఖేష్ అంబానీ, కుమార మంగళం బిర్లాలు రూపొందించిన "విద్యారంగ సంస్కరణలకు ప్రణాళికా స్వరూపం" అనే నివేదిక ఉపయోగపడుతుంది. స్వయంగా ప్రధానమంత్రి కార్యాలయమే ఈ ప్రముఖ పెట్టుబడిదారులను విద్యారంగంపై నివేదిక సమర్పించమని కోరిందనే విషయం ఇక్కడ గమనార్హం! ఈ రెండు ఎత్తుగడలూ ఒకదానికొకటి సహకరించుకొంటూ ఛాందసత్వానికి అనుకూలమైన ఒక కొత్త తరాన్ని తయారు చేయటానికి సిద్ధపడ్డాయి.

విద్యను మత భావనలతో నింపడానికి చెప్పే ఒక సాకు విద్యకు ఒక "జాతీయతా రూపం" ఇస్తామని చెప్పడం ! స్వతంత్ర భారతదేశం వారసత్వంగా పాటిస్తున్న విదేశీ బానిస విధానాన్ని విద్యారంగం నుండి తొలగించాలనడం! బానిస విద్యా విధానానికి ప్రత్యామ్నాయంగా మరో విద్యా విధానం రూపొందించేందుకు మనదేశంలో దీర్ఘకాల కృషి జరిగింది. పందొమ్మిదవ శతాబ్దం ప్రారంభంలో ప్రముఖ హేతువాది సంఘ సంస్కర్త అక్షయకుమార్ దత్ విద్యార్థులకు సమగ్ర జ్ఞానాన్ని అందించగలిగే నూతన జాతీయ విద్యా విధానానికై ప్రయత్నించారు. అలాంటి సమగ్ర దృష్టితో నెలకొల్పబడిన ఎన్నో విద్యాసంస్థలు స్వాతంత్ర్యోదమ కాలంలో మహత్తర కృషి సాగించాయి. అవి స్వతంత్ర భారత విద్యా విధానాన్ని సైతం ప్రభావితం చేశాయి. కేంద్ర ప్రభుత్వం నియమించిన విద్యా కమీషన్లన్నీ వాటికనుగుణంగానే తమ సిఫార్సులందజేశాయి. వాటిలో ఎన్నో లోపాలు, బలహీనతలున్నా అవి లౌకిక విశాల దృక్పథంగల విద్యా విధానానికి ప్రతిబంధకాలు కాలేదు.

దీనికి భిన్నంగా ఈనాడు ప్రతిపాదించబడుతున్న విద్యా విధానం నిర్లజ్జాకరంగా అయోమయానికి లోను చేసేది, తనలో తాను కుదించుకుపోయేది. స్వార్థపూరితమైనదీ, నేషనల్ కౌన్సిల్ ఫర్ ఎడ్యుకేషనల్ రీసెర్చ్ ట్రెయినింగ్ (ఎన్.సి.ఇ.ఆర్.టి) స్కూల్ విద్యపై రూపొందించిన విధానపత్రం, కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖామంత్రి చేసిన పలు ప్రకటనలూ విస్పష్టంగా ఈ మార్పును సూచిస్తున్నాయి. ఎన్.సి.ఆర్.టి. నివేదికలో వృత్తి నైపుణ్యమూ, సమగ్ర ఆలోచనా విధానమూ లోపించాయని విద్యావేత్తలు విమర్శించారు. అయితే దాని దిశా నిర్దేశం అత్యంత స్పష్టంగా ఉంది. అది మతపరమైన విద్యాబోధనను విలువలుగల విద్యాబోధనతో సమానం చేస్తుంది. దేశవాళీ విద్యాబోధనకు ప్రాధాన్యతనిస్తుంది. భారతీయ నాగరికతను విమర్శించరాదంటుంది. దేశ భవిష్యత్ సైన్స్ బోధన ఎలా ఉండాలనేది కూడా అది సూచిస్తోంది. పర్యవసానంగానే ఇటీవల యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్ పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో జ్యోతిష్యాన్ని ప్రవేశపెట్టాలని విశ్వవిద్యాలయాలను ఆదేశించింది. ఇంతకు మునుపే వేద గణితాన్ని, కర్మకాండనూ బోధించాలని తీసుకొన్న నిర్ణయానికి కొనసాగింపుగానే జ్యోతిష్య బోధన కూడా వచ్చింది.

ఇవన్నీ సామాన్య నిర్ధారిత మార్గం నుండి స్వల్పంగా పక్కదారి పట్టడం ఎంతమాత్రం కాదు. పెద్ద కుట్రపూరిత ప్రణాళికలోని ఒక భాగమే ఇదంతా! ఉన్మాదంలో ఒక పద్ధతంటూ ఉంది. కొంతకాలం క్రితం ఆర్.ఎస్.ఎస్. తయారు చేసిన విద్యా కార్యక్రమాన్ని అధికార నివేదికగా ప్రవేశపెట్టినపుడే ఆ కుట్ర బయటపడింది. వారి కార్యక్రమంలో విద్యను హిందుత్వమయం చేసేందుకు గాను ముందు లౌకిక విద్యను దెబ్బకొట్టే ప్రయత్నం జరిగింది. దేశాన్నే హిందుత్వమయం చేయటానికి ప్రాతిపదికను తయారు చేయటం జరుగుతోంది. ఈ విషయం గమనంలో ఉంచుకొనే కేంద్ర మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖ ఇటీవల తీసుకున్న చర్యలన్నీ ఉన్నాయి. ఈ చర్యలన్నీ విలువలతో కూడిన విద్యా విధానం కొరకే తీసుకోబడుతున్నాయని చెప్పినప్పటికీ, వీటన్నిటిలోనూ మత సంబంధమైన సిద్ధాంతలే నిండి ఉన్నాయి. వాస్తవంలో "ఎన్.సి.ఇ.ఆర్.టి" విద్యా విధాన పత్రంలో లౌకిక బోధనకు బదులు మత బోధనకే ప్రాముఖ్యమివ్వబడింది. ఇందుకోసం గాంధీజీ పలుకులనే వారు తమ తోడుగా తెచ్చుకొన్నారు. గాంధీజీ గురించిన సర్వవ్యాప్త భావనకు విరుద్ధంగా వారు ఆయన పేరును సైతం తమ కనుకూలంగా వాడుకొన్నారు.

పారిశ్రామికవేత్తలు, అంబానీ-బిర్లాలు వాణిజ్యం - పరిశ్రమలకు సంబంధించిన ప్రధానమంత్రి కౌన్సిల్‌కు సమర్పించిన నివేదికకు కొనసాగింపుగా ఓ సమగ్రమైన విద్యావిధానం రాబోతుంది. అంటూనే బిర్లాల బృందాన్ని విద్యలో ప్రయివేట్ పెట్టుబడులు, ఆరోగ్యం, గ్రామీణాభివృద్ధిలో పై విషయ నిర్ణయ కమిటీగా చెబుతున్నారు. వారి నివేదిక ఈ రంగాలలో ఒక విప్లవం (!?) తేబోతున్నామని చెప్పుకొంది. అయితే వారు చేసిన సిఫార్సులు చూస్తే అభివృద్ధి చెందిన ధనిక దేశాల ప్రయోజనాలకు మన విద్యారంగాన్ని వెలివేయడం, దేశంలోని ఉన్నత వర్గాలు ప్రస్తుతం అనుభవిస్తున్న ప్రయోజనాలను రక్షించడం జరిగింది. వారు చెబుతున్న విప్లవం (!?) పోటీ పరమైన సహకారం పునాదిగా గల జ్ఞాన సమాజాన్ని ప్రతిపాదించింది. దీన్ని సాధించడానికి క్రింది పద్ధతులను అవలంబించాలని పేర్కొంది. మన దేశం ఒక పోటీకి సిద్ధమైన జ్ఞాన, ఆర్థిక పరమైన దేశంగా రూపొందాలి. భారతదేశం పారిశ్రామిక కార్మికులను, కూలీలను తయారుచేసే దేశంగా గాక, జ్ఞాన కార్మికులను తయారుచేసే దేశంగా తన్ను తాను మలచుకోవాలి. విద్య, అభివృద్ధి రెండూ ఇలాంటి జ్ఞాన కార్యకర్తలను రూపొందించే ప్రముఖ పాత్రను పోషించాలి. దీని పర్యవసానంగా మనదేశాన్ని సమాచార, సాంకేతిక యుగానికి అగ్రగామిగా నిలపాలి.

ఈ మహత్తరమైన లక్ష్యాన్ని సాధించటానికి (!?) విదేశీ పెట్టుబడులను ప్రయివేటీకరణను ప్రోత్సహించాలి. మిగిలిన రంగాలైన ప్రాథమిక సెకండరీ విద్యలు, లేక సాధారణ, కళలకు సంబంధించిన విద్యలు, లేక మార్కెట్‌లో గిరాకీలేని" విభిన్న విభాగాలకు చెందిన విద్యా నైపుణ్యాలు ప్రభుత్వం దయా దాక్షిణ్యాలకు వదలివేయవచ్చు. ఈ ప్రణాళికను పూర్తిగా అమలుపరిస్తే కలిగే పర్యవసానాలను పేర్కొనక పోయినప్పటికీ జరగబోయేది మాత్రం ఇదే. వారి ప్రణాళిక రెండు రకాల విద్యలను పెంచి పోషిస్తుంది. ఒకటి, పేదలకు, రెండవది ధనవంతులకు! పేదలకు అక్షరాస్యత మాత్రం కల్పించబడుతుంది. ధనికులకు జ్ఞానం - విజ్ఞానమూ అందజేయబడుతుంది. అలాంటి స్థితిలో భారతదేశం వంటి దేశాల్లోని జ్ఞాన సమాజాలు అభివృద్ధి చెందిన ధనిక దేశాలకు లొంగి ఉండే భాగస్వాములుగా తయారవుతాయి. వాటికి సేవా రంగాలుగా రూపొందుతాయి. వెనుకబడిన మనలాంటి దేశాలు సంపన్న దేశాలతో పోటీ పడేవిగా ఉండవు. స్వతంత్ర ఆవిష్కరణలు చేయగలిగేవిగా ఉండవు. ఆ దేశాలలోని బహుళజాతి కంపెనీలకు లాభాలనార్జించి ఇచ్చే విసుగు కలిగించే మెడికల్ ట్రాన్స్‌స్క్రిప్షన్ లాంటి పనులు చేసే దేశాలుగా మాత్రమే మిగులుతాయి. దీనర్థం, సమాచార సాంకేతిక రంగం ప్రసాదించిన నూతనావకాశాలను తక్కువ చేసి చూపడం ఎంతమాత్రం కాదు. కానీ, అంబానీ, బిర్లాల నివేదిక చూచినట్టు దీనిని ఇతర అంశాలతో సంబంధం లేకుండా చూడరాదు.

భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తొలి సంవత్సరాలలో ఉదారవిద్యకు, సాంఘిక శాస్త్రాలకూ సముచిత ప్రాముఖ్యమీయబడింది. అయితే ప్రస్తుతం ఉదార విద్యాబోధనను పూర్తిగా తొలగించకపోయినా మెల్లమెల్లగా దాని ప్రాధాన్యతను తగ్గిస్తున్నారు. పెట్టుబడులకూ, సమాచార సాంకేతిక విజ్ఞానానికి స్వర్గధామంగా భావించబడే ఆంధ్రప్రదేశ్‌లో సామాజిక శాస్త్రాల బోధనను కళాశాలల నుంచి మెలమెల్లగా తొలగిస్తున్నారు. విద్య అంటే కేవలం 'శిక్షణ'గా మారుస్తున్నారు. విద్యలో ఎటువంటి విశాల భావాలకు, సాంఘిక చైతన్యానికీ తావు లేకుండా చేస్తున్నారు. ఇటువంటి విద్యా విధానం యథాతథ వాదాన్ని ప్రోత్సహిస్తుంది. విద్యార్థులలో నిరసననూ, ప్రతిఘటనా చైతన్యాన్ని మొద్దుబారుస్తుంది.

విదేశీ పెట్టుబడిదారులు యథాతథ వాదాన్నే కోరుతారు. దానినే అంబానీ, బిర్లాల నివేదిక ప్రముఖంగా ప్రతిపాదించింది. ఆ నివేదిక ప్రయత్నపూర్వకంగానో, అప్రయత్నపూర్వకంగానో, ప్రవేశిస్తున్న విభిన్న 'ఇజం'కు, సిద్ధాంతాలకు వ్యతిరేకంగా రక్షణలు కోరింది. విశ్వవిద్యాలయాలలోను, ఉన్నత విద్యా సంస్థలలోను అన్ని రకాల రాజకీయ కార్యకలాపాలనూ నిషేధించాలని చెప్పింది. యూనివర్శిటీలలో రాజకీయ కార్యకలాపాలనూ నిషేధించాలని చెప్పింది. యూనివర్శిటీలలో రాజకీయాలు మంచివి కాకపోవచ్చు. అయితే దీనికి సంబంధించి అందరూ పునరాలోచన చేయవలసిన విషయమిది. అదే సమయంలో విశ్వవిద్యాలయాలను అన్ని రకాల సిద్ధాంతాలకూ దూరంగా ఉంచాలనడం విశ్వవిద్యాలయాల స్ఫూర్తికే విరుద్ధం - ఇది అంతిమంగా నియంతృత్వానికే దారితీయవచ్చు.

అసలు లక్ష్యాలు ఓ ప్రక్కనుండగా, మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖ, ప్రధానమంత్రి కార్యాలయమూ తీసుకొన్న చర్యలు విస్తృతమైన రాజకీయ, సామాజిక అంశాలు కలిగి ఉన్నాయి. భవిష్యత్తులో వాటి పర్యవసానాలు తప్పక ఉంటాయి. వారు ఓ మార్పులేని యథాతథవాద, ఛాందస సమాజాన్ని తయారు చేసేందుకు సైద్ధాంతిక పునాదిని సిద్ధం చేస్తున్నారు. అదే సమయంలో విదేశీ పెట్టుబడిదారులకు, వారి స్వదేశీ భాగస్వాములకు బహుళ ప్రయోజనాలు సమకూర్చేందుకు దేశంలో మేధోపరమైన అభివృద్ధిని సాధించతలపెడుతున్నారు. దురదృష్టవశాత్తు భారత మధ్య తరగతి వారు ఈ చాందస, బానిస విద్యా ప్రణాళిక ద్వారా సమకూరే చిన్నచిన్న ప్రయోజనాలను పరిగణిస్తున్నారే గానీ, వాటిని దాటి ముందుకు చూడటం లేదు.

(ది హిందూ నుండి అనువాదం : ఏ.జి. యతిరాజులు)


SREE BALAJI P.G. COLLEGE

KNR School Campus, Gandhi Nagar,
KURNOOL

Coaching for S.K. University
Distance Education

*Course Offered :*

**M.A.,** (English, Telugu, Economics, Pol. Science)

**M.Com, M.Sc** (Maths)

**MBA & MCA**

Coaching offered for Competitive Exams also,
DSC, B.Ed (Ed.CET), D.Ed CET (TTC),
I.CET (MBA & MCA)

Contac[illegible] 51365 (R) 2444[illegible] (O)

# అకడమిక్ సెల్

## నేటి పరీక్షా విధానం - సంస్కరణల ఆవశ్యకత

- సి. రామయ్య,
రాష్ట్ర లిటరసీ కమీషన్ సభ్యులు

*దేశంలో విద్యారంగాన్ని గూర్చి చర్చించే సందర్భంలో ప్రతీసారి 'పరీక్షలు-సంస్కరణలు' అన్న అంశం ప్రధానంగా చర్చకు రావడం నిర్వాహకులు తీర్మానాలు చేయడం, పాలకులు వాటిని బుట్టదాఖలు చేయడం అనేది నేడొక ప్రహసనంగా మారింది. తరగతి విద్యార్థి నుంచి రాష్ట్ర విద్యాశాఖా మంత్రి వరకు సంస్కరణలను గూర్చి నొక్కి వక్కాణించడం సర్వసాధారణమై పోయింది.*

అయ్యవారిని చేయబోతే కోతి తయారైనదన్నట్లుగా పరీక్షలను సంస్కరించే చిత్తశుద్ధిలేక అమలుపరచాలనే ఆత్మశుద్ధి అంతకన్న లేక - ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న విధంగా పాత పద్ధతిలోనే పరీక్షలను నిర్వహిస్తూ విద్యార్థులను బలి చేస్తున్నారు.

స్వాతంత్ర్యం వచ్చి ఐదున్నర దశాబ్దాలైనా బ్రిటిష్‌వారు ఏర్పరచిన పరీక్షా విధానంలో మౌలికంగా ఎలాంటి మార్పులు తీసుకరాకుండా సంప్రదాయ పద్ధతుల్లోనే పరీక్షలను నిర్వహించడం, విద్యార్థుల విజ్ఞాన మనోవికాసానికి గొడ్డలిపెట్టుగా మారి - పరీక్షలంటేనే పిల్లలకు చలిజ్వరం వచ్చే పరిస్థితులు దాపురించాయి.

అనాడు సంవత్సరానికి మూడు పరీక్షలు పెట్టి పిల్లవాడి జ్ఞానాన్ని పరీక్షిస్తే; క్రమంగా అది నెల పరీక్షగా, వార పరీక్షగా మారడమే కాకుండా మరికొన్ని స్కూళ్లయితే ప్రత్యేకత పేరుతో దినదినం పరీక్షలు నిర్వహిస్తూ విద్యార్థుల పాలిట దినదిన గండంగా మారాయి. చివరకు పరీక్షలు విద్యా సముపార్జనకు సోపానాలు అయ్యే బదులు పరీక్షల కోసమే చదవడం. పరీక్షలే విద్యకు కేంద్ర స్థానంగా మారిపోవడం దురదృష్టకరం.

ఈనాడు మనం పరీక్షల పేరు మీద విద్యార్థులను గాని, ఉపాధ్యాయులను గాని, నిర్వాహకులను గాని విశ్వసించలేని పరిస్థితులలో ఉన్నాం. విద్యారంగంలో ఒకరిపై మరొకరికి విశ్వాసం లేనట్లయితే బోధనాభ్యసన ప్రక్రియ సజావుగా సాగే అవకాశం లేదు. పరీక్షలు - పరీక్షా విధానం పట్ల సమాజంలో అసంతృప్తి, ఆందోళన బయలుదేరింది. వాస్తవానికి పరీక్షలు విద్యావిధానంలో ఒక భాగమేగాని సర్వస్వం కాదు. ఉపాధ్యాయుడు తరగతిలో తను నిర్వహించిన పాత్రకు ఎంతమేరకు న్యాయం చేకూర్చానన్న ఆత్మ విమర్శ కోసమై చేసుకున్న సాధనమే పరీక్షలు. అంతేగాని పిల్లలపై ర్యాంకుల పేర్లతో, గ్రేడ్ల పేరుతో ముద్ర వేయడానికి ఉపయోగపడే పనిముట్లు కావు పరీక్షలు. దురదృష్టవశాత్తు ఈనాడు విద్యారంగంలో కార్పొరేట్ కల్చర్. చోటు చేసుకోవడంవల్ల రంగు రంగుల ఆకర్షణీయమైన అద్దాల భవనాల్లో అన్ని హంగులతో కూడిన పాఠశాలలు ఒకవైపు కనీసం ప్రాథమిక వసతి సౌకర్యాలు లేని, పూరిగుడిసెల్లాంటి ప్రభుత్వ పాఠశాలలు ఒకవైపు దర్శనమిస్తూ, ఆర్థిక భద్రత కల్గిన ఉన్నత వర్గాలు - ప్రైవేటు పాఠశాలల్లో చేరుతుండగా, సామాజికంగా, ఆర్థికంగా, వెనుకబడిన వర్గాలకు చెందిన బీదపిల్లలు గత్యంతరంలేని స్థితిలో ప్రభుత్వ పాఠశాలలకు వస్తున్నారు. అయితే ఈ రెండు వర్గాలకు చెందిన పిల్లలకు ఒకే పరీక్షా ప్రశ్నాపత్రాన్నిచ్చి గ్రామీణ బీదపిల్లల్ని చదువురాని శుంఠలుగా సభ్య సమాజం ముద్ర వేయడం ఎంతవరకు సబబో విజ్ఞులు ఆలోచించాల్సి వుంది. క్రమక్రమంగా ఈ ధోరణివల్ల సమాజంలో రెండు వర్గాల మధ్య తీవ్రమైన అంతరం ఏర్పడి భవిష్యత్తులో సాంఘిక విప్లవానికి దారితీసే పరిస్థితులు కనబడుతున్నాయి. ప్రభుత్వం ఈ విషయంలో చేతులు కాలకముందే ఆకులు పట్టుకుంటే మంచిది.

పరీక్షా విధానాన్ని సమీక్షించి సంస్కరించే ముందు బోధనాభ్యసన ప్రక్రియలో మార్పులు తీసుకురావాలి. తరగతి గదిలో నేడు ఏం చెప్పామన్నది కాకుండా ఎలా చెప్పాం అన్నది ప్రధానాంశం కావాలి. సైన్సుకు సంబంధించి న్యూటన్ గూర్చి, సాంఘిక శాస్త్రంలో అక్బర్‌ను గూర్చి ఒకే విధంగా పాఠం చెప్పడం ఎంతవరకు సమంజసం? ఉపాధ్యాయుడు తరగతి గదిలో ఏకపాత్రాభినయం చేయకుండ - విద్యార్థులను అభ్యసన ప్రక్రియలో చురుగ్గా పాల్గొనేటట్లు చేయాలి. పూర్వకాలంలో తరగతి గదిలో గురువును ప్రశ్నిస్తే క్రమశిక్షణా రాహిత్యం. నేటి విధానంలో తరగతిలో విద్యార్థి ప్రశ్నించకపోతే క్రమశిక్షణా రాహిత్యంగా భావించాలి. క్రమశిక్షణ పేరుతో విద్యార్థుల గొంతును నొక్కరాదు. అల్లరివేరు - అభ్యసన ప్రక్రియ వేరు. మూల్యాంకన సందర్భంలో ఉపాధ్యాయుడు తను అనుకున్న లక్ష్యాలను ఎంతవరకు సాధించగలిగాడో - అది ధ్యేయంగా పెట్టుకోవాలి. విద్యార్థులను పరీక్షించే అధికారం, స్వేచ్ఛ తప్పక ఉపాధ్యాయునిదే అయితే ఏం పరీక్షించాలి? ఎప్పుడు పరీక్షించాలి? అన్న అంశంపై ఉపాధ్యాయుడు స్పష్టత కలిగి ఉండాలి. అప్పుడే పరీక్షల లక్ష్యం నిష్పక్షపాతంగా పూర్తవుతుంది.

పరీక్షకు ప్రాణవాయువు రిలయబిలిటి. పేపర్ రూపొందించడం ఒక కళ. 1) ప్రశ్నపత్రం లక్ష్యసాధన కలిగినదై ఉండాలి. 2) అర్థవంతంగా ఉండాలి. 3) ఆలోచన రేకెత్తించేదిగా ఉండాలి. 4) ప్రశ్న స్పష్టంగా ఉండాలి. 5) పరీక్ష పిల్లవాని మేధో వికాసానికై ఉపయోగపడాలి.

**ప్రస్తుతం ప్రశ్నపత్రంలో ఉన్న లోపాలు :**

1) రిలయబిలిటి లేకపోవడం, 2) జ్ఞానాన్ని పరీక్షించడం కన్నా జ్ఞాపకశక్తినే ఎక్కువగా పరీక్షించడానికి ప్రాధాన్యత నివ్వడం, 3) విషయాత్మక అంశాలకే ప్రాముఖ్యత కనిపించడం, 4) సిలబస్‌ను పూర్తిచేయడమే లక్ష్యంగా కనిపించడం.

### రిలియబిలిటి

**వివరణ :** పాఠ్యప్రణాళికను రూపొందించడంలోగాని, పాఠ్య పుస్తక రచనలోగాని - ప్రశ్నపత్రాన్ని రూపుదిద్దడంలోగాని, ప్రశ్నాపత్రాలను దిద్దడంలోగాని శాస్త్రీయ దృక్పథం గాని ప్రమాణాలు గాని గోచరించడం లేదు. దీనివలన పిల్లవాడు కాన్సెప్ట్ అర్థం చేసుకోవడంలోగాని, ప్రశ్నార్థం చేసుకోవడంలోగా గాని, తికమకకు గురవుతున్నాడు.

**జ్ఞాపకశక్తి :** ప్రశ్నపత్రాలు తరచుగా విద్యార్థి సృజనాత్మక శక్తిని గాకకుండా జ్ఞాపకశక్తినే పరీక్షించడానికి తోడ్పడుతున్నాయి. విద్యార్థుల్లో అంతర్గతంగా ఉన్న నైపుణ్యాలను వెలికితీసే లక్ష్యం నేటి ప్రశ్నాపత్రాల్లో కనిపించటం లేదు. విద్యార్థి నుండి తగిన సమాచారాన్ని రాబట్టడంలోగాని, విద్యార్థి తనకున్న పరిజ్ఞానాన్ని అన్వయించుకొని సమాధానం రాసేటట్లుగా గాని, విద్యార్థి ప్రతిభకు న్యాయంగా పరీక్షించేటట్లుగాని - లేకపోవడం వల్ల కేవలం విద్యార్థి మానసిక వత్తిడికి గురవుతున్నాడు. బోధనాభ్యసన ప్రక్రియలో ఉపాధ్యాయుడు పాఠ్యపుస్తకాధారంగానే సమాచారాన్ని అందిస్తున్నాడు గాని, ఆలోచించే విధంగా బోధించలేక పోతున్నాడు.

పాఠ్యపుస్తక రచన జరిగేటప్పుడే నైపుణ్యాలను (Skills) వెలికితీసేటట్టుగా సాగాలి. కాగా ఇప్పటి పుస్తకాలు సమాచారాన్ని తెలియజేయడానికే ఉపయోగపడుతున్నాయి.

ప్రశ్న పత్రాలను దిద్దడంలో శాస్త్రీయ ప్రమాణాలను రూపొందించుకోవాలి. ప్రశ్న పత్రాన్ని ఎవరు దిద్దినా ఒకే రకమైన మార్కులు వచ్చేటట్లుగా ఉండాలి. పైన పేర్కొన్న ప్రమాణాలు ప్రశ్నపత్రంలో చోటు చేసుకోవాలంటే ప్రధానంగా మూడు దశల్లో ఇది కొనసాగాల్సి వుంటుంది.

1) ప్రశ్న పత్రాన్ని రూపొందించేటప్పుడు
2) విద్యార్థి జవాబులు రాసేటప్పుడు
3) ప్రశ్నపత్రాల్ని దిద్దేటప్పుడు

ఈ మూడింటిలో ఎక్కడ లోపం జరిగినా పరీక్ష లక్ష్యమే దెబ్బతింటుంది. ప్రశ్న పత్రాన్నే సిద్ధం చేసే సందర్భంలో రూపకర్త దృష్టిలో కొన్ని అంశాలే చోటు చేసుకొని మరికొన్నింటిని విస్మరించడం, ప్రశ్న స్పష్టంగా లేక సందేహాన్ని కల్గించేదిగా ఉండడం, జవాబు పరిమితి తెలియజేయకపోవడం, సిలబస్‌కు సంబంధించని విషయాలు రావడం, భాష స్పష్టంగా లేకపోవడం జరుగుతుంది.

విద్యార్థి ప్రశ్నను అర్థం చేసుకోవడంలోను జవాబు రాయడంలోను తనకున్న అవగాహనను దృష్టిలో పెట్టుకొని జవాబులు రాస్తాడు. కనుక ఆదర్శవంతమైన ప్రశ్నపత్రాల్ని తయారుచేయడానికై ఉపాధ్యాయులకు తగిన శిక్షణ అవసరం. అందులో ఏయే అంశాలను దృష్టి యందుంచుకోవాలి, ఏ ప్రశ్నకు ఎన్ని మార్కులివ్వాలి, ఎంతకాలంలో విద్యార్థి జవాబు రాయాల్సి ఉంటుంది. వీటన్నింటిని ప్రాథామ్యాంశాలుగా గుర్తించి తగిన శిక్షణ నివ్వడంతోపాటు ప్రధానంగా భాషా స్పష్టతకై తరగతి గదిలో మూల్యాంకన సందర్భంగా ప్రశ్నలు వేస్తూ వచ్చే జవాబుల్ని గమనించాలి. Paper setter కే Key నిచ్చే బాధ్యత ఉండాలి.

పరీక్షలు పూర్తయి ప్రశ్న పత్రాల్ని దిద్ది, ఫలితాలు ప్రకటించిన తర్వాత 'రివ్యూ' (సమీక్ష) అవసరం. కనీసం ప్రతి సబ్జెక్ట్‌కు సంబంధించిన 10% జవాబు పత్రాలనైనా రాండమ్‌గా తనిఖీ చేసి విద్యార్థులు చేసిన సాధారణ పొరపాట్లను గుర్తించి తిరిగి అవే పొరపాట్లు వచ్చే పరీక్షలో జరగకుండా ఉండే విధంగా ఉపాధ్యాయులకు తగిన సూచనలివ్వాలి. జిల్లా విద్యాశాఖాధికారి పాఠశాలల తనిఖీకి వెళ్ళినప్పుడు ఈ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించినట్లయితే క్రమక్రమంగా ఫలితాలు మెరుగయ్యే అవకాశం ఉంటుంది.

పరీక్షా ఫలితాల అనంతరం సాగే సమీక్ష లోపాలను సంస్కరించేదై, సరిదిద్దేదై యుండాలి తప్ప ఏదో ఒక వర్గాన్ని శిక్షించేందుకు కాదు అన్న దృక్పథాన్ని ప్రభుత్వం కల్గియుండాలి. కాగా ఇటీవల జవాబుదారీ తనంతో ఫలితాలే ఉపాధ్యాయుని బోధనా ప్రతిభకు కొలమానంగా భావిస్తూ నిర్దేశించిన ఫలితాల శాతాన్ని సాధించని ఉపాధ్యాయులను బదిలీ చేయడం, ఇంక్రిమెంట్లను ఆపడం సరియైన చర్యలు కావు. ఉపాధ్యాయునికి తన వృత్తిపై తనకు మరింత శ్రద్ధ, ఆసక్తి పెరిగేటట్లుగా శిక్షణా కార్యక్రమాలను, పునశ్చరణ తరగతులను నిర్వహించాలి.

విద్యారంగ నిర్వహణ సాధారణ పరిపాలనా రంగం కంటె భిన్నమైనది. అధికారులకు, మంత్రులకు 'అకడమిక్' దృక్పథం ఉండాలి. విద్యా విషయానికి సంబంధించిన ప్రతీ అంశాన్ని బ్యూరోక్రటిక్ కోణం నుండి కాక డెమోక్రటిక్ పద్ధతిలో విశ్లేషించినట్లయితే అసలు సమస్యలకు సరియైన పరిష్కార మార్గాలు గోచరిస్తాయి. •


మధిర చరిత్రలో ప్రప్రథమంగా 561/600 సాధించిన సంస్థ.
ఇంటర్‌నెట్ కనెక్షన్‌తో కంప్యూటర్ విద్యను అందిస్తున్న సంస్థ

భార్గవి ఎడ్యుకేషనల్ సొసైటీ వారి

భరత్ విద్యానికేతన్

డే & రెసిడెన్షియల్ (ప్రభుత్వ గుర్తింపు పొందిన సంస్థ)

మధిర, ఖమ్మం జిల్లా. ఫోన్ : 74527, 73288, 74269

SSC - 2001 లో భరత్ విద్యానికేతన్ సాధించిన ఫలితాలు

| | | | |
|---|---|---|---|
| హాజరైనవారు: | 80 | పాసైనవారు : | 75 |
| ఫస్ట్ క్లాసులు | 51 | సెకండ్ క్లాసులు | 18 |
| థర్డ్ క్లాసులు | 6 | ఇన్‌స్టెంట్ | 5 |

SSC ఉత్తీర్ణత 94%

SSCలో సబ్జక్టు వారీగా అత్యధిక మార్కులు

| | | | |
|---|---|---|---|
| తెలుగు | 89 | హిందీ | 92 |
| ఇంగ్లీష్ | 96 | లెక్కలు | 99 |
| సైన్స్ | 97 | సోషల్ | 97 |

1994 నుండి ఇప్పటి వరకు SSCలో సాధించిన ఫస్ట్ క్లాసులు : 301/452

7th, 2001 ఫలితాలు

| | |
|---|---|
| హాజరైనవారు: | 55 |
| ఫస్ట్ క్లాసులు | 55 |

7th ఉత్తీర్ణత 100%

BHARATH JUNIOR COLLEGE & SEELAM PULLAREDDY MEMORIAL DEGREE COLLEGE, MADHIRA, Khammam Dist.

మన ప్రయత్నంలో లోపం లేకుంటే - ఫలితం ఎప్పుడూ వెన్నంటి ఉంటుంది

## చర్చా వేదిక

# విశ్వవిద్యాలయాల్లో జ్యోతిష్యం బోధించాలా ?

నిర్వహణ : మోటుకూరి నరహరి, ప్రధానాచార్యులు,
ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల, హైదరాబాదు

***"విశ్వవిద్యాలయం" అని తెలుగులో అన్నా, యూనివర్శిటీ' అని ఆంగ్లంలో అన్న ఆ పదాలు అక్కడ జరిగే బోధన, పరిశోధనా కార్యక్రమాలు ప్రపంచ స్థాయిలో ఉత్తమ ప్రమాణాలతో సాగుతాయని, ప్రపంచం నలుమూలల ఉన్న పండితుల, మేధావుల ఆలోచనలను, శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితాలను, సృజనాత్మక రచనలను లోతుగా అధ్యయనం చేసి ఆయా దేశాల, ప్రాంతాల పరిస్థితులకు అన్వయించుకొని మానవ జాతిని కుల, మత, ప్రాంతీయ ధోరణులకు అతీతంగా పురోగమింప జేయాలని సూచిస్తున్నాయి.***

కాని ఇటీవల బి.జె.పి. నాయకత్వంలో ఉన్న వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు సంకుచితమైన, పాక్షికమైన తమ అకాంక్షలకు, విద్వేష పూరితమైన, అసహనంతో కూడిన తమ దృక్పథానికి అనుగుణంగా పాఠశాలల్లో మతపరమైన విషయాలను పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టాయి. ఇప్పుడు కేంద్రంలో తమ అధికారాన్ని ఉపయోగించుకొని ఏ తర్కానికీ, శాస్త్రీయ ప్రమాణాలకూ నిలువని జ్యోతిష్యం, హస్తసాముద్రికం వంటి విషయాలను, ఒక మతానికి - అందులోను కొన్ని కులాలకు మాత్రమే పరిమితమైన పౌరోహిత్యాన్ని పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టాలని కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖమంత్రి, ఆయనకు ప్రియతముడైన యు.జి.సి. ఛైర్మన్ విశ్వవిద్యాలయాలను ఆదేశిస్తున్నారు. ఈ చదువు నేర్చుకొనేవారికి విదేశాల్లో డిమాండ్ ఉందని, ఆ రకంగా విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జించవచ్చునని సాకులు చెప్తున్నారు. ప్రయివేటు రంగంలో విశ్వవిద్యాలయాల స్థాపనకు అనుమతి నివ్వడానికి, యావత్తు దేశాన్ని కొందరు వ్యక్తుల గుత్త సొమ్ముగా ప్రయివేటీకరించాలని ఆలోచిస్తున్నవారికి ఈ విధమైన ఆలోచనలు రావడంలో ఆశ్చర్యంలేదు. ఈ విధంగా వీరు ప్రపంచస్థాయి ప్రమాణాలతో, ప్రజల డబ్బుతో పనిచేయవలసిన విశ్వ విద్యాలయాలను తమ పరివారం జేబు సంస్థలుగా, సంకుచితమైన, ఒక మతపరమైన వ్యవహారంగా మార్చేస్తున్నారు. దీనిపై మేధావుల్లో విస్తృతమైన చర్చ జరుగుతున్నది. ఇంకా జరగాలి కూడా. శాస్త్రీయ దృక్పథాన్ని (సైంటిఫిక్ టెంపర్), లౌకిక దృక్పథాన్ని, విశ్వమానవ భావనను తరగతి గదుల్లో బోధించే మనం కూడా ఈ చర్చలో, ఛాందస వాదాన్ని ఎదిరించే ఉద్యమంలో భాగస్వాములం కావాలి. ఈ అంశాలను బాధ్యతాయుతంగా చర్చించి, జనానికి సరియైన దిశా నిర్దేశం చేయాలి. అందుకే ఈ అంశాలపై పాఠకులనుంచి, శ్రేయోభిలాషుల నుంచి, మేధావుల నుంచి సవిమర్శకమైన, సంక్షిప్తమైన రచనలను ఆహ్వానిస్తున్నాము. ప్రస్తుతానికి 'జ్యోతిష్యం' పైన చర్చ నిర్వహిస్తున్నాము. ఆ తరువాత పౌరోహిత్యం, హస్తసాముద్రికం వంటి అంశాలపై కూడా రచనలను కోరుతాము. ఆయా రచనలను 'ఐక్య ఉపాధ్యాయ'లో ప్రచురిస్తాము.

**"జ్యోతిష్యం విశ్వవిద్యాలయాల్లో బోధనాంశంగా ఉండాలా ?"** అన్న ఈ చర్చను ప్రసిద్ధ సంస్కృత పండితుడు నీలకంఠదీక్షితుని రచన "కలివిడంబనమ్"లోని కొన్ని శ్లోకాలతో, వాటి అర్థ, తాత్పర్యాలతో ప్రారంభిస్తున్నాము. మంత్ర తంత్రాలను, జ్యోతిష్యాన్ని సంప్రదాయ పండితులు కూడా ఎలా నిరసించారో ఈ రచన వివరిస్తుంది.

## కలివిడంబనమ్

**(కలికాలంలోని విపరీతాలు)**

**- నీలకంఠ దీక్షితుడు**

నీలకంఠ దీక్షితుడు 17వ శతాబ్దికి చెందినవాడు. ఆయన గొప్ప పండిత వంశంలో జన్మించాడు. ఆయన దక్షిణ భారతదేశానికి చెందిన ప్రముఖ మహాపండితుడు అప్పయ్య దీక్షితుల అన్న కుమారుడు. నీలకంఠదీక్షితుని నలుగురు సోదరులూ ప్రసిద్ధ కవులే. నీలకంఠ దీక్షితుడు తమిళనాడులోని దక్షిణ ఆర్కాటు జిల్లాలో ఆర్ని సమీపంలోని అడయపాలెంలో జన్మించాడు. ఆయన పెద్దవాడైన తర్వాత మధురకు నివాసాన్ని మార్చి, పాండ్య రాజుల కొలువులో వివిధ పదవులు నిర్వహించి పాండ్యరాజు తిరుమల నాయకునికి ప్రధానమంత్రి కూడ అయ్యాడు. అయిన పాలకుల దౌష్ట్యాలకు విసిగిపోయి తన పదవిని స్వచ్ఛందంగా విడిచిపెట్టి పట్టమడై అనే గ్రామానికి చేరుకొన్నాడు. ఆ గ్రామం తామ్రపర్ణి నదీతీరంలో ఉన్నది. ఆ గ్రామాన్ని రాజాయనకు దానం చేశాడు. నీలకంఠ దీక్షితుడు ఆ గ్రామంలో తన చరమ జీవితాన్ని శాంతియుతంగా గడిపాడు. ఆయన సంస్కృతంలో అనేక గ్రంథాలు వ్రాశాడు. ఆయన కవి, వ్యాకరణ పండితుడు, ఉత్తమ విమర్శకుడు కూడా. ఆయన వక్రోక్తి రచనలో సిద్ధహస్తుడు.

ఈయన శైలి మధురంగానూ, సుగమంగానూ ఉంటుంది. ఈయన కవిత్వంలో సున్నితమైన హాస్యం ప్రతిబింబిస్తుంది.

యది న క్వాపి విద్యాయాం - సర్వథా క్రమతే మతిః
మాంత్రికాస్తు భవిష్యామో - యోగినో యతయో పి వా.

అ. క్వ + అపి విద్యాయామ్ = ఏ విద్యయందును, మతిః=బుద్ధి, సర్వథా = అన్ని విధముల, న క్రమతే యది = ప్రసరించనిచో, మాంత్రికాః = మాంత్రికులుగా గాని, యోగినః = యోగులుగా గాని, యతయః అపి వా = యతీశ్వరులముగా కాని, భవిష్యామః = అయ్యెదము.

తా. ఏ చదువూ ఒంటబట్టనప్పుడు మనం చేయగలిగిన దేమున్నది? మాంత్రికుల మయ్యెదము. యోగుల మయ్యెదము. లేక యతీశ్వరులమయ్యెదము.

అవిలంబేన సంసిద్ధౌ - మాంత్రికై రాప్యతే యశః,
విలంబే కార్యబాహుళ్యం - విఖ్యాప్యావాప్యతే ధనమ్.

అ. అవిలంబేన = ఆలస్యము లేకుండగనే, కార్యసంసిద్ధౌ = పని నెరవేరుచో మాంత్రికైః = మాంత్రికులచే, యశః = కీర్తి, ఆప్యతే = పొందబడుచున్నది. విలంబే = ఆలస్యమైనచో, కార్యబాహుళ్యం = చాలా పనులు చేయవలసియున్నవని, విఖ్యాస్య = చెప్పి, ధనమ్ = డబ్బు, అవాప్యతే = పొందబడుచున్నది.

తా. మాంత్రికులు చేపట్టిన పని అనుకొనినట్లుగా వెంటనే నెరవేరుచో కీర్తి లభించును. ఆలస్యమగుచో ఇంకను చాల పనులు చేయవలసియున్నవని చెప్పి డబ్బు సంపాదించవచ్చును.

సుఖం సుఖిషు దుఃఖం చ - జీవనం దుఃఖశాలిషు,
అనుగ్రహాయతే యేషాం - తే ధన్యాః ఖలు మాంత్రికాః,

అ. సుఖిషు = సుఖవంతుల విషయమున, సుఖం = సుఖమైన, జీవనం = జీవనమే, దుఃఖశాలిషు = దుఃఖముచే బాధపడువారి విషయమున, దుఃఖం చ = దుఃఖమయమైన జీవనమూ, యేషాం = ఏ, మాంత్రికులకు, అనుగ్రహాయతే = అనుగ్రహమే అగుచున్నదో, తే = అట్టి, మాంత్రికాః = మాంత్రికులు, ధన్యాఃఖలు = అదృష్టవంతులు కదా !

తా. ఎవరైనను సుఖముగా ఉన్నచో వారు మావల్లనే సుఖపడుచున్నారనియును, ఎవరైనను దుఃఖముతో ఉన్నచో వారు మా ఉపదేశం వినక దుఃఖపడుచున్నారనియును రెండు విధములుగను, తమ గొప్పదనాన్నే వెల్లడించు మాంత్రికులు అదృష్టవంతులు కదా!

యావదజ్ఞానతో మౌనం - ఆచారో వా విలక్షణః,
తావన్మాహాత్మ్యరూపేణ - పర్యవస్యతి మాంత్రికే.

అ. అజ్ఞానతః = అజ్ఞానము వలన యావత్ = ఎంత (వరకు), మౌనం = మాటలాడకుండునో, విలక్షణః = లోకములో లేని, ఆచారః వా = ఆచారముగాని (ఎంత ప్రదర్శింపబడునో) తావత్ = అది యంతయు, మాంత్రికే = మాంత్రికునియందు, మాహాత్మ్యరూపేణ = మాహాత్మ్యముగా, పర్యవస్యతి = పరిణమించును.

తా. మాంత్రికుడు ఏమి చెప్పవలెనో తెలియక మౌనముగా ఉన్నను, ఏమి చేయవలెనో తెలియక లోకవిరుద్ధముగా ఆచరించినను, అంతయు మాంత్రికుని గొప్పదనముగనే లోకులు పరిగణింతురు.

చారాన్ విచార్య దైవజ్ఞైః - వక్తవ్యం భూభుజాం ఫలమ్,
గ్రహచార పరిజ్ఞానం - తేషామావశ్యకం యతః

అ. చారాన్ = గూఢచారులను, విచార్య = సంప్రదించి, తెలిసికని, దైవజ్ఞైః = జ్యోతిష్కులచేత, భుభుజాం = రాజులకు, ఫలం = ఫలము, వక్తవ్యమ్ = చెప్పదగినది. యతః = ఎందువల్లననగా, తేషాం = ఆ జ్యోతిష్కులకు, గ్రహచార పరిజ్ఞానం = గ్రహసంచార సంబంధమైన జ్ఞానము, అవశ్యకమ్ = అవసరము.

తా. జ్యోతిష్యుడు ముందుగా గూఢచారుల ద్వారా సమాచారమును సేకరించి, ఆ తరువాతనే రాజుకు శుభ ఫలము చెప్పవలయును, ఏలయన, జ్యోతిష్కునకు గ్రహచార పరిజ్ఞానమవసరము కదా !

పుత్ర ఇత్యేవ పితరి - కన్యకేత్యేవ మాతరి,
గర్భప్రశ్నేషు కథయన్ - దైవజ్ఞోవిజయీ భవేత్.

అ. గర్భప్రశ్నేషు = గర్భమునకు సంబంధించిన ప్రశ్నలయందు, పితరి = తండ్రి అడిగినచో, పుత్రః ఏవ = కుమారుడే పుట్టుననియు, మాతరి = తల్లి అడిగినచో, కన్యకా ఇతి ఏవ = కూతురే పుట్టుననియు, కథయన్ = చెప్పుచు, దైవజ్ఞః = జ్యోతిష్కుడు, విజయీ భవేత్ = విజయమును పొందును.

తా. గర్భస్థుడగు శిశువు కుమారుడా, కూతురా అని గర్భప్రశ్నవేయుటకై వచ్చువారు పురుషుడైనచో కొడుకు పుట్టునని, స్త్రీ వచ్చినచో కూతురని చెప్పినచో జ్యోతిష్కుడు విజయము పొందును. (వచ్చినవారు సంతోషముతో సొమ్ము ముట్టజెప్పుదురు)

ఆయుః ప్రశ్నే దీర్ఘమాయుః - వాచ్యం మౌహూర్తికైర్జనైః
జీవన్తో బహుమన్యన్తే - మృతాః ప్రక్ష్యన్తి కం పునః.

అ. ఆయుః ప్రశ్నే = నా ఆయుర్దాయ మెంత? అని ఇటువంటి ఆయుర్దాయ ప్రశ్న వేయుచో, మౌహూర్తికైః జనైః = జ్యోతిష్కులచేత, దీర్ఘమ్ ఆయుః = దీర్ఘాయువు, వాచ్యమ్ = చెప్పదగినది, జీవన్తః = జీవించుచున్నవారు, బహుమన్యన్తే = గౌరవింతురు, మృతాః పునః = మరణించినవారు; కం = ఎవనిని, ప్రక్ష్యన్తి = అడిగెదరు ?

తా. 'నా ఆయు వెంత?' అని ఎవరైన అడిగినచో జ్యోతిష్కుడు దీర్ఘాయుర్దాయమనియే చెప్పవలయును. వారట్లు జీవించెదరేని గౌరవింతురు. జీవింపరేని అడుగుటకు అవకాశమే లేదు కదా!

సర్వం కోటిద్వయోపేతం - సర్వం కాలద్వయావధి,
సర్వం వ్యామిశ్రమివ చ - వక్తవ్యం దైవ చింతకైః

## జ్యోతిష్యం అనాయం ?

**నేపాల్ రాజు కుమారుడు దీపేంద్ర పెండ్లి చేసుకుని 35 సం॥లోపు పిల్లల్ని కంటె తండ్రికి ప్రాణగండముంటుందని జ్యోతిష్యులు చెప్పారని, అందుకనే వారి పెండ్లి విషయం రాద్ధాంతమయిందని పత్రికా వార్తల సారాంశం.**

**కాని పెండ్లి కాకుండానే మొత్తం రాజ్య కుటుంబమే నాశనమయిందనేది ఆశ్చర్యకరమైన వాస్తవం. మరి జ్యోతిష్యం ఎక్కడ పప్పులో కాలేసింది ? అది శాస్త్రం కాదు కనుక; మిడతంబొట్ల సిద్ధాంతం కనుక !**

అ. దైవచింతకైః = జ్యోతిష్కులచేత, సర్వం = సమస్తమునూ, కోటి ద్వయ + ఉపేతం = రెండు పక్షములు ఉండునట్లును, సర్వం = ప్రతిదీ, కాలద్వయ + అవధి = రెండు కాలాలలో జరిగేదిగాను, సర్వం = ప్రతియొక్కటి, వ్యామిశ్రమివ = తికమక పెట్టేదిగాను, వక్తవ్యమ్ = చెప్పదగినది.

తా. జ్యోతిష్కులు తాము చెప్పే ఫలం జరుగవచ్చు - జరుగక పోవచ్చు అన్నట్లు రెండర్థాలిచ్చేదిగానూ, ఇప్పుడు జరగవచ్చు లేదా మరికొంత కాలానికి జరగవచ్చు అని, రెండు కాలాలకు సంబంధించినది గానూ, లేదా వారికీ వీరికి జరిగితే మీకు కూడా జరగవచ్చని తికమకపెట్టే విధంగానూ చెప్పితే అతనికి ముందు ముందు ఇబ్బందులుండవు.

నిర్ధనానం ధనావాప్తిం - ధనినా మధికం ధనమ్,
బ్రువాణాః సర్వథా గ్రాహ్యాః - లోకైః జ్యౌతిషికా జనాః.

అ. నిర్ధానానామ్ = డబ్బు లేనివారికి, ధన + అవాప్తిం = ధనప్రాప్తిని, ధనినామ్ = ధనికులకు, అధికం = అధికమైన, ధనం = ధనమును, బ్రువాణాః = చెప్పు, జ్యౌతిషికాః = జ్యోతిష్కులైన, జనాః = జనులు, లోకైః = జనులకు, సర్వథా = అన్ని విధములుగా, గ్రాహ్యాః = గ్రహింపదగినవారు.

తా. ధనము లేనివారికి ధనము వచ్చునని, ధనికులకు విశేషధనము లభించునని చెప్పు జ్యోతిష్కులపై జనులకు ఆదరమెక్కువ కలుగును.

శతస్యలాభే తాంబూలం - సహస్రస్య తు భోజనమ్,
దైవజ్ఞానా ముపాలంభో - నిత్యః కార్యవిపర్యయే.

అ. శతస్య లాభే = జ్యోతిష్యం విన్నవారికి నూరు లభించినచో, తాంబూలమ్ = (జ్యోతిష్కునకు) తాంబూలము లభించును. సహస్రస్యతు = వేయి లభించుచో, భోజనమ్ = భోజనము లభించును. కార్యవిపర్యయే = పని చెడినచో, దైవజ్ఞానాం = జ్యోతిష్కుల యొక్క, ఉపాలంభః = నింద, నిత్యః = తప్పనిసరియగును.

తా. జోస్యము చెప్పించుకొన్నవానికి వంద లభించినచో వాడు సంతోషముతో జ్యోతిష్కునకు తాంబూలమిచ్చును. వేయి లభించినచో భోజనము పెట్టును. జోస్యము ఫలించనిచో మాత్రము జ్యోతిష్కునకు నిందలు తప్పవు.

అపి సాగపర్యంతా - విచేతవ్యా వసుంధరా,
దేశో హ్యరత్నిమాత్రో 2పి - నాస్తి దైవజ్ఞవర్జితః.

అ. వసుంధరా = భూమి, సాగరపర్యంతా అపి = సముద్ర పర్యంతము, విచేతవ్యా = వెదుక దగినది. దైవజ్ఞవర్జితః = జ్యోతిష్కులు లేని, దేశః = దేశము, అరత్నిమాత్రః అపి = జానెడైనను, న + అస్తి = లేదు.

తా. సముద్రపర్యంతము వ్యాపించిన భూమి నెల్ల గాలించినను జ్యోతిష్కుడు లేనిచోటు జానెడైనను లేదు.

# విద్యారంగ కాషాయీకరణ - బి.జె.పి. ప్రభుత్వ ప్రయత్నం

- డి. రామిరెడ్డి

*భారతదేశంలో 1925లో మత సంస్థగా ప్రారంభమైన ఆర్.యస్.యస్. క్రమంగా విస్తరించి అనేక విభాగాల నేర్పరచుకుంది. దాని రాజకీయ విభాగమే భారతీయ జనతాపార్టీ. ఈ పార్టీ అధికారంలోనికి రాక పూర్వమే స్వంత విద్యాలయాలు నెలకొల్పి, బాల్యం నుండి మత భావజాలంతో పిల్లలను తీర్చిదిద్దాలనే లక్ష్యంతో 1946లో దీనానాథ్ భత్రా అనే ఆర్.యస్.యస్. ప్రచారక్ "గీతా పాఠశాల" ప్రారంభించారు. ఆ తర్వాత ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ జిల్లాలో 1952లో ఒక అద్దె యింట్లో "సరస్వతీ శిశుమందిర్" ప్రారంభించారు.*

ఈ పాఠశాలలు అభివృద్ధి చెంది రాష్ట్ర వ్యాపితంగా విస్తరించడంతో రాష్ట్ర స్థాయిలో "శిశు శిక్షా ప్రబంధ సమితి" అనే సంస్థను స్థాపించారు. ఈ కోవలో అనేక రాష్ట్రాలలో యిటువంటి పాఠశాలలు ప్రారంభమయినాయి. 1977లో "విద్యాభారతి అఖిల భారతీయ శిక్షా సంస్థాన్" ఏర్పరచి దానిలో అన్ని రాష్ట్రాల ముఖ్యులను భాగస్వాములుగా చేశారు. ఆ విధంగా నేడు అది 13,000 పాఠశాలలను నడుపుతున్నది. అందులో 74,000 మంది ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. వాటిలో 8145 ప్రాథమిక పాఠశాలలు 2800 ఉన్నత పాఠశాలలు, సీనియరు ఉన్నత పాఠశాలలు 2000ల ఉపాధ్యాయ పాఠశాలలు, 40 కాలేజీలు, 15 ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు, 7 పాలిటెక్నిక్ లాంటి సాంకేతిక విద్యాలయాలు ఉన్నాయి.

వీటిలో ఏకోపాధ్యాయ పాఠశాలలు గాక మిగిలిన వాటిలో 50 శాతానికి మించి రాష్ట్ర ప్రభుత్వాల గుర్తింపును కలిగి ఉన్నాయి. 1990 నుండి విద్యాభారతికి దీనానాద్ భత్రయే ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

భారతదేశంలో ఏ విద్యాలయాలలోనైనా, విద్యను రాజ్యాంగంలో పేర్కొనిన లక్ష్యాలకు, పరిమితులకనుగుణంగా బోధించాలి. ఆర్టికల్ 28 ప్రకారం ప్రభుత్వ ద్రవ్య సహాయం పొందే ఏ పాఠశాలలో కూడ మత విద్య భోదించరాదని స్పష్టంగా చెప్పబడింది. మైనారిటీలు ప్రత్యేకంగా పాఠశాలలు పెట్టుకొని వారి మత విషయాలు చెప్పుకోవాలని ఆర్టికల్ 30లో పేర్కొనబడింఇ.

కాని బి.జె.పి. పాలిత రాష్ట్రాలలో దీనికి తిలోదకాలిచ్చి, విద్యా భారతి పాఠశాలలకు రికగ్నిషన్‌తోపాటు ప్రభుత్వ ద్రవ్య సహాయం కూడ చేస్తున్నారు.

1998 అక్టోబరు 22న జరిగిన విద్యామంత్రుల సమావేశంలో ఈ విద్యాభారతి రూపొందించిన ఒక పత్రాన్ని దొడ్డిదారిన అధికార పత్రంగా విద్యా మంత్రి శ్రీ మురళీ మనోహర్ జోషిగారు ప్రవేశపెట్టడానికి ప్రయత్నించారు. వామపక్ష, లౌకిక భావాలు గల రాష్ట్రాల విద్యామంత్రుల ప్రతిఘటనతో వీరి ఆటసాగలేదు. ఆ పత్రంలో రిజిష్టర్ సంస్థలు, సొసైటీలు గత 10 సం॥ నుండి నిర్వహిస్తున్న పాఠశాలలన్నింటిని గుర్తింపబడిన పాఠశాలలుగా భావించాలని వాటికి గ్రాంట్-ఇన్-ఎయిడ్ యివ్వాలని ప్రతిపాదించబడింది. ఈ ప్రతిపాదన నెగ్గి వుంటే ఈ పాటికి దేశంలోని అన్ని సరస్వతి శిశుమందిరాలకు ప్రభుత్వ గుర్తింపు, గ్రాంట్ ఇన్ ఎయిడ్ వచ్చి ఉండేది. ఆరోజు ఆ ప్రతిపాదన వీగిపోయినా ప్రస్తుతం మెజారిటీ ఉంది కాబట్టి దొడ్డిదారిన వారి అజెండా అమలు చేయడానికి ప్రయత్నిస్తున్నారు.

దీని కొరకు 3 ప్రయత్నాలు జరిగాయి. (1) విద్యా విభాగాలలో కీలక విభాగాల అధిపతులుగా ఆర్.యస్.యస్. మేధావులను నియమించడం. (2) ఆ స్థానాలలో ఉన్న అభ్యుదయ వాదులందర్ని తొలగించడం. (3) పాఠశాలల సిలబసు సవరించడం.

ఈ పని గుట్టుగా అమలు జరుగుతున్నది.

ప్రొఫెసర్ సుమిత్ సర్కార్, ప్రొఫెసర్ ఫణిక్కర్, ఐ.సి.హెచ్.ఆర్. కార్యదర్శి టి.కె.వి. సుబ్రమణ్యం లాంటి 12 మంది ప్రముఖ చరిత్ర కారులను ఐ.సి.హెచ్.ఆర్. నుండి తొలగించారు.

శ్రీ బి.ఆర్. గ్రోవర్‌ను ఐ.సి.హెచ్.ఆర్. ఛైర్మన్‌గా నియమించారు. ఈయన బాబ్రీ మశీదు స్థానంలో రామాలయం ఉండేదని తప్పుడు సాక్ష్యాధారాలు సేకరించిన చరిత్రకారులు. యస్.సి.ఇ.ఆర్.టి. ఛైర్మన్‌గా ఆర్.ఎస్.ఎస్. అభిమాని డా॥ కె.జి. రస్తోగి నియమించబడ్డారు. "హిందూత్వం" జీవన విధానమే కాని మతం కాదని తీర్పునిచ్చిన మాజీ సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ జె.యస్. వర్మను సిలబసు సమీక్షా సంఘ ఛైర్మన్‌గా నియమించారు.

బి.జె.పి. సన్నిహిత వ్యక్తి డా॥ హరిగౌతమ్‌ను యు.జి.సి. ఛైర్మన్‌గా నియమించారు. కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలోని అనేక యూనివర్శిటీలకు వైస్ ఛాన్సలర్లుగా బి.జె.పి. వారిని నియమించారు. ఈ విధంగా విద్యారంగ జీవనాడులన్నింట్లో వారి మనుషులతో నింపారు.

ఈ విధంగా క్రమంగా ఒక్కొక్క విభాగంలో వారి లక్ష్యాన్ని నెరవేర్చే పని ప్రారంభించారు. మన పాఠశాలలు 2 రకాలుగా ఉంటాయి.

(1) యన్.సి.ఇ.ఆర్.టి. సిలబసు పాటించే పాఠశాలలు. (2) రాష్ట్రాల పరిధిలోని యస్.సి.ఆర్.టి. సిలబసు పాటిస్తూ రాష్ట్ర విద్యాబోర్డులు తయారుచేసే పాఠ్యపుస్తకాలు వాడే పాఠశాలలు యన్.సి.ఇ.ఆర్.టి. రాష్ట్ర బోర్డులను ఆదేశించలేదు. ఆదేశించలేదు కాని దాని మార్గదర్శక సూత్రాలను వారు అమలు జరుపుతుంటారు. బి.జె.పి. పాలిత రాష్ట్రాలలో వారి సిద్ధాంతాల కనుగుణంగా పాఠ్యాంశాలను మార్చి పాఠ్యపుస్తకాలను రూపొందించారు. వాటి వికృత రూపాలు గత 4 సం॥గ అనేక పత్రికలలో ప్రచురించబడ్డాయి. ఆ రాష్ట్రాలలో ప్రభుత్వాలు మారినపుడు ఆ పాఠ్యాంశాలను తొలగించడం తిరిగి బి.జె.పి. పాలన రాగానే కొనసాగించడం జరుగుతున్నది.

గత మాసంలో యన్.సి.ఇ.ఆర్.టి. సిలబసు రివిజనుపై తుది డాక్యుమెంటును ప్రచురించింది. గత సం॥ చిత్తు డాక్యుమెంటు

విడుదల చేశారు. కొన్ని రాష్ట్రాలలో చర్చలే జరుగలేదు. ఆంధ్రప్రదేశ్‌లో నాకు తెలిసి ప్రభుత్వ ఆధ్వర్యంలో సెమినార్ జరుగలేదు. కాని తుది డాక్యుమెంటులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సెమినార్ నిర్వహించినట్లు పేర్కొన్నారు. మే నెలలో ఉపాధ్యాయ సంఘాలతో చర్చించారు.

వచ్చే విద్యా సంవత్సరం నుండి దీనిని అన్ని రాష్ట్రాలలో అమలు జరుపడానికి ప్రయత్నాలు ప్రారంభించారు.

తుది డాక్యుమెంట్ ఉపోద్ఘాతంలోనే పచ్చి అవాస్తవాలు వ్రాశారు. భారతదేశంలో బ్రిటిషు వారువచ్చి వలస విద్యా విధానం ప్రవేశపెట్టక పూర్వం ధనిక పేద తేడాగాని, కుల, మత, లింగ విచక్షణ" లేని విద్యాలయాలు ప్రతి గ్రామంలో విలసిల్లేవట. వాటిని బ్రిటిషువారు నాశనం చేశారట.

మనదేశంలో బ్రిటిషు వారు రాకపూర్వం ఉన్న సాంఘిక, రాజకీయ వ్యవస్థను గూర్చి తెలిసిన వారెవ్వరూ దీనిని నమ్మరు. మను ధర్మ సూత్రాలు పాటించేనాటి సమాజంలో శూద్రులకు చదివే అర్హతలేదు. స్త్రీలకు విద్య నిషేధం. ఎవరో కొద్దిమంది ధనికులకు గురుకులాలతో విద్యాబోధన జరిగేది. క్రైస్తవ మత ప్రచారకులు, బ్రిటిషు ప్రభుత్వం వచ్చిన తర్వాతనే అణగారిన వర్గాలకు విద్యాబోధన ప్రారంభమయింది.

అలాగే పిల్లలు బాల్యం నుండి (1) భారతీయుడయినందున గర్వపడాలి. (2) హిందూత్వాన్ని అన్ని మతాలవారు అంగీకరించాలి. (3) పిల్లలకు మతబోధ చేయాలి. (4) మత, ఆధ్యాత్మిక విలువల్ని బోధించాలి. (5) సంస్కృతి భాషను అన్ని పాఠశాలలో బోధించాలి అని పేర్కొన్నారు.

వీటితోపాటు 10వ తరగతి వరకు పరీక్షలుండరాదని 5 సం॥లలోపు ప్రైమరీ విద్యను ప్రైవేటు సంస్థలకు ఒప్పగించాలని, ఫార్మల్ విద్యతోపాటు, ఓపెన్ స్కూలులాంటి ప్రత్యామ్నాయ మార్గాలు పాటించాలని కూడా పేర్కొన్నారు. ఉన్నత విద్యను పూర్తిగా ప్రైవేటీకరణ చెయ్యాలని కూడా పేర్కొన్నారు.

1986లో రూపొందించిన నూతన విద్యా విధానంగాని, 1992లో సరిచేయబడిన విద్యా విధాన పత్రంలో గాని మన విద్యా లక్ష్యాలలో "మన దేశాన్ని లౌకిక, ప్రజాస్వామ్యం రిపబ్లిక్‌గా తీర్చి దిద్దే విధంగా విద్యా విధానం ఉండాలి" అని పేర్కొన్నారు.

ప్రభుత్వం ఆ విధాన పత్రాన్ని సవరించలేదు. రాజ్యాంగాన్ని సవరించలేదు. ఈ పనులు చేయకుండానే మత విద్యా బోధనకు పూనుకోవడం గర్హనీయం.

ఒక్కొక్క అంశాన్ని పరిశీలిస్తే (1) మనం హిందువులమైనందుకు గర్వించాలి. ఈ "హిందూ" అన్న పదం వేదాలలోగాని, పురాణాల్లోగాని లేదు. సింధునది, సింధుప్రాంతం క్రమంగా హిందూ ప్రాంతంగా మొదటి పర్షియన్ భాషలో 17వ శతాబ్దంలో వాడబడిందని ఇర్ఫాన్‌హబీబ్ గారు ఒక ఉపన్యాసంలో చెప్పారు.

మనదేశం ఒకే జాతిగా ఉండేదా. లేక అనేక జాతుల కలయికగా ఉండేది అనే చర్చ కూడా ఉంది. మనదేశంలో పెద్ద, చిన్న, సమూహాలు 4635 ఉన్నవని, వీటిలో ప్రతివారికీ వారి భాష, ఆచార వ్యవహారాలు వేరువేరుగా ఉన్నాయని నిర్ధారించారు. ఆ విధంగా మనది బహుజాతుల కలయికగా ఏర్పడిన దేశం.

(సశేషం)


ది మచిలీపట్నం కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్

బ్రాంచీలు

| రామానాయుడుపేట | కోనేరు సెంటర్ | బస్టాండ్ సెంటర్ | పెడన |
|---|---|---|---|
| ఫోన్ : 26980 | ఫోన్ : 29217 | ఫోన్ : 28997 | ఫోన్ : 48366 |

| | |
|---|---|
| 30 రోజుల నుండి 90 రోజుల వరకు | 7% |
| 91 రోజుల నుండి 180 రోజుల వరకు | 8% |
| 181 రోజుల నుండి 1 సంవత్సరము వరకు | 9% |
| 1 సం॥ నుండి 2 సం॥ముల వరకు | 10% |
| 2 సంవత్సరముల పైబడి మరియు 3 సం॥ల వరకు | 10.5% |
| 3 సంవత్సరముల పైబడి | 11% |

తాకట్టు, జామీను అప్పులు మరియు బంగారు నగలపై అతి తక్కువ వడ్డీరేటు 18%కు ఋణ సౌకర్యము లభించును. ఈ అవకాశమును సద్వినియోగం చేసుకోగలరు. మా బ్యాంకు యొక్క అన్ని బ్రాంచీలయందు తాకట్టు, జామీను అప్పులు మరియు బంగారు నగలపై ఋణ సౌకర్యము కలదు

చింతా జగదీష్‌కుమార్
శెక్రటరి

పాలకవర్గము

సర్వశ్రీ

| | |
|---|---|
| 1) టి.పి.ఆర్.వి.కె. తులసీదాస్ | ప్రెసిడెంట్ |
| 2) కొల్లు హరనాధబాబు | వైస్ ప్రెసిడెంట్ |
| 3) అద్దేపలి మధుసూధనరావు | డైరెక్టరు |
| 4) చలమలశెట్టి పార్ధసారధి | డైరెక్టరు |
| 5) గొరిపర్తి పాపరాజు | డైరెక్టరు |
| 6) కన్నెబోయిన వెంకట ఉమామహేశ్వరరావు | డైరెక్టరు |
| 7) కరింశెట్టి వెంకట సుబ్బారావు | డైరెక్టరు |
| 8) లావేటి ప్రసాద్ | డైరెక్టరు |
| 9) మడుపల్లి సత్యన్నారాయణ | డైరెక్టరు |
| 10) మీర్ గులామ్ హైదర్ | డైరెక్టరు |
| 11) పినపాల చంద్రకళాధరరావు | డైరెక్టరు |
| 12) యరగాని రమేష్‌బాబు | డైరెక్టరు |

మీ చిన్నారులకు బాల వికాస పథకములో రూ. 9,500 లు డిపాజిట్ చేయండి
20 సంవత్సరములకు రూ. 1,01,089లు పొందండి (12%)

## చైతన్య స్రవంతి

# విద్యారంగంలో క్రియా శీల ప్రమేయం ఉపాధ్యాయ ఉద్యమ కర్తవ్యం

- వి. బాల సుబ్రహ్మణ్యం

"పాలక వర్గాలు సమాజం మొత్తాన్నీ తమ నియంత్రణలో వుంచుకొంటాయి. వాళ్ళు తమ రాజకీయాధికారాన్ని రెండు విధాలుగా చెలాయిస్తారు. మొదటి పద్ధతి ప్రభుత్వం ద్వారా అంటే ప్రభుత్వ యంత్రాంగమైన పోలీసు, సైన్యం, చట్టాలు, జైళ్ళు ద్వారా అధికారాన్ని చెలాయించడం. రెండో పద్ధతి ప్రజల సమ్మతిని పొందడం ద్వారా అంటే పాలక వర్గాల చింతనను వ్యాప్తి చెందించి, ప్రజల్ని వొప్పించడం ద్వారా పెత్తనాన్ని చెలాయించడం. ఈ రెండో పద్ధతి చాలా ప్రమాదకరమైనది. మన కంటికి నేరుగా కనపడనిది. ఈ రెండో పద్ధతి కోసం మత సంస్థలు, రాజకీయ పక్షాలు, ప్రచార సాధనాలు, విద్యా సంస్థలు, ఆరోగ్య సంస్థలు, సాంస్కృతిక సంఘాల్లాంటి వాటిని, పాలక వర్గం అద్భుతంగా ఉపయోగించుకొంటుంది. రాజ్యం అనే కోటను రక్షించే రిజర్వుడు బలగాలు ఇవే. మనం కోటను స్వాధీనం చేసుకొన్నా ఈ రిజర్వుడు బలగాలు మనల్ని జయిస్తాయి". - ఆంటోనియో గ్రాంసీ

ఉదాహరణకు, మన స్కూళ్ళనే తీసుకుందాం. అవి పాలక వర్గాల సంస్కృతికి పునరుత్పత్తి కేంద్రాలు. ఈ సాంస్కృతిక పునరుత్పత్తి అనేది ఒక విధానం. ఈ విధానంలో క్రింది వర్గాల నుంచి వచ్చిన పిల్లలు తమ కుటుంబ నేపధ్యాన్ని తమ "సామర్థ్యాన్ని" గుర్తెరిగి తాము ఇంతకన్నా ఉన్నత స్థాయిలోకి వెళ్ళలేమని మన స్కూళ్ళ ద్వారా తెలుసుకొంటారు. తాము అంత తెలివి గల వారం కాదని నిర్ణయించుకొంటారు. ఆ విధంగా తమ అల్పత్వాన్ని అంగీకరించి తమంత తామే క్రింది సామాజిక శ్రేణిలోకి చేరిపోతారు.

మరింత స్పష్టంగా చెప్పుకోవాలంటే పిల్లలు తమకు గణితం రాదనీ, గొడ్లు కాసుకొనేందుకు మాత్రమే పనికి వస్తామనీ మన స్కూళ్ళలో నేర్చుకొంటారు. దీనికి ప్రభుత్వ పాఠ్య క్రమం, బోధనా పద్ధతులు ఒక కారణమైతే కనబడని కారణాలు చాలా వున్నాయి. మన పాఠశాల ఒక విధమైన క్రమశిక్షణను, శ్రేణి బద్ధతనూ (సమాజంలో తమ స్థానం ఎక్కడ అనే ఆలోచనను) బహుమతులనూ, శిక్షనూ అమలు పరుస్తుంది. ఈ ఆజ్ఞాబద్ధత, విధి విధానాలు పిల్లలు తమ అజ్ఞానాన్ని అంగీకరించుకొనేలా చేస్తాయి. పాలకవర్గాల, సంపన్నుల జ్ఞానాన్ని జ్ఞానార్జననూ మాత్రమే గౌరవించేలా ఈ విధానాలు చేస్తాయి. ఇవన్నీ కనబడని బోధనాంశాలు.

దీన్ని దృష్టిలో వుంచుకొనే పాలోఫైరీ ఉపాధ్యాయుడిని ఒక కనబడని నియంతగా, పాలకవర్గాల పనిముట్టుగా వర్ణిస్తాడు. మన చదువుల కాయన "బ్యాంకింగ్ ఎడ్యుకేషన్"అని ముచ్చటయిన పేరు పెడతాడు. ఈ విద్యా విధానంలో ఉపాధ్యాయుడు సర్వజ్ఞుడు, విద్యార్థి శుద్ధ అజ్ఞాని, ఉపాధ్యాయుడు ఆజ్ఞలు జారీ చేస్తాడు. పిల్లవాడు వాటిని పాటిస్తాడు. ఉపాధ్యాయుడు పాఠ్యాంశాల్ని, బోధనా విధానాన్ని రూపొందిస్తాడు. విద్యార్థి వాటిని నిమిత్తమాత్రుడై స్వీకరిస్తాడు. పిల్లవాడి మెదళ్లో తన కిష్టమొచ్చిన అంశాల్ని డిపాజిట్ చేయడం, అవసరమైనప్పుడు (పరీక్షలు) వాటిని డ్రా చెయ్యడం టీచర్ నిత్యకృత్యంగా, లక్ష్యంగా వుంటుంది. ఈ విద్యలో డైలాగ్ ఉండదు. ఎన్‌కౌంటర్ అసలే వుండదు.

ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే మన శత్రువు మన జీవన రంగంలో అందు గల డిందు లేడన్నట్లు సర్వత్రా వున్నాడు. మన చదువుల్లో, ఆరోగ్యంలో, వినిమయతత్త్వంలో, సైద్ధాంతిక ధృక్పధంలో, సౌందర్యంలో, కులంలో, మతంలో ప్రతిచోటా మన శత్రువున్నాడు. అడుగడుగునా అతని పై పోరాడితేనే పాలకవర్గాల పై దాడిని మనం ముమ్మరం చెయగలం. పాలక వర్గాలకు వ్యతిరేకంగా మనం చేసే వర్గ పోరాటం ఇలా వుంటుంది మరి.

### మన చదువుల చుట్టూ విష సంస్కృతి :

ఇప్పుడు విద్యారంగం చుట్టూ వున్న ఈ విష సంస్కృతిని మనం చూద్దాం. ఈ సంస్కృతిని ఒక విషవలయంగా మార్చి ఇదే విద్య, దీనికోసమే విద్య అని మన చేత అనిపించి దీని పునాదుల మీద తమ సౌధాన్ని ఎంత అద్భుతంగా పాలకవర్గాలు నిర్మించుకొన్నాయో పరిశీలిద్దాం.

ఇప్పుడు మన చదువుల పరమార్ధాలు ధన సంపాదన. అది కూడ అతి తక్కువ కాలంలో సంపాదన. ఆడంబరం, విలాసాలు మన విద్య అందిస్తున్న ఈనాటి విలువలు. సామాజికాంశాల్ని, భాషను అందుకే అనవసరం అంటున్నారు. వ్యక్తిగత ప్రభావం, ధోరణి నిరూపించుకొనే పోటీలు మన చదువులకు పరమార్థాలు, ఆత్మీయత, ఆదర్శం శూన్యమైన గురుశిష్య సంబంధాలు సరేసరి. వ్యక్తి వికాసానికి, ఆత్మ స్థైర్యానికి బదులు అత్యాశకు ఆత్మ న్యూనతకు దారితీయించే చదువులు ఆత్మహత్యల్ని సైతం ప్రోత్సహిస్తున్నాయి. మార్కులు, పరీక్షలు, భట్టీ పట్టడాలు గొంతులు కొసుకొనేలా పోటీ పడ్డాలు చూస్తే చదువుల్లో సారమంతా ర్యాంకులుగా మారిపోయిన కాలంలో మనమున్నాం. దుర్మార్గమైన సైద్ధాంతిక కాలుష్యంలో ఏ ఆదర్శంలేని ఒక ప్రపంచంలోకి క్యూలో నిలబెట్టి నెట్టడం మన రెసిడెన్షియల్ కాలేజీల్లో చూస్తున్నాం. శ్రమకు వీలున్నంత దూరం చెయ్యడం, సమగ్రత కరువైన సంకుచిత ధోరణి, అశాస్త్రీయమైన అంశాల్ని అశాస్త్రీయమైన పద్ధతుల్లో నేర్పడం, ఆంగ్లంపై మోజు ఇవన్నీ చాలక మతఛాందసం కూడా తలకెత్తుతున్న ఈ విద్య ఏ కోణం నుంచి చూచినా పాలక వర్గాల ప్రయోజనాలే కాపాడుతుంది. పాశ్చాత్య దేశాల అవసరాలకు తగిన కోర్సులు తప్ప మిగతావి మనక్కనిపించవు. విజ్ఞానంలో వైవిధ్యానికి సమాధి కట్టి, ఇతర అవకాశాలు కుచించుకొనిపోయినట్టు భ్రమపెట్టి, భయపెట్టి ఇరుకుదారిలో అందర్నీ నెట్టడం మన విద్యల వికృతరూపానికి పరాకాష్ట. తాను పదిలంగా నిర్మించదలచుకొన్న ఒక వికృత సమాజాన్ని ఈ తరగతి గది నాలుగు గోడల మధ్య ఈ విద్య ద్వారా మాత్రమే నిర్మించుకోగలమనే పాలకవర్గాల నిశ్చితాభిప్రాయం ఇక్కడ అడుగడుగునా మనం చూడవచ్చు. అయితే అలా చూడ్డానికి మనకు దృష్టి వుండాలి. అది వర్గ దృష్టి.

### విద్యారంగంలో ప్రజాస్వామికోద్యమం :

అందువల్ల మనం ఈ విద్యారంగంలో మొదట ఒక ప్రజాస్వామిక ఉద్యమానికి శ్రీకారం చుట్టాలి. ఈ ప్రజాస్వామిక విద్యలో విద్యార్థి ఏమీ తెలియని మట్టి ముద్ద కాదు. అతనొక నవనవోన్మేష సజీవప్రాణి. అతనికి హక్కులున్నాయి. అతనికి స్కూలులో భద్రత కావాలి. అతని భాష, అతని లోకం, అతని అవసరాలు, అతని విధానాలు అతని పద్ధతులు - మన విద్యలో ప్రధానాంశాలుగా వుండాలి. ఇప్పుడున్న నియంత, పాలితుడు సంబంధాల స్థానే స్నేహితుల సంబంధాలు పాఠశాలలో నెలకొనాలి. ఇదొక సాంస్కృతికాంశం.దీన్ని మనం క్రమశిక్షణా రాహిత్యానికి దారితీస్తుందని వ్యతిరేకిస్తాం. పిల్లల మధ్యలో టీచరు నేల మీద కూచుంటే, వాళ్ళతో కలిసి ఆడితే, పాడితే, పనిచేస్తే మన సంస్కృతి ఒప్పుకోదు మరి. ఈ పాలకవర్గ పెత్తందారీ సంస్కృతినే మనం ప్రతిఘటించాలి. ఇదొక వర్గపోరాటం. బలహీనుడి హక్కులు గుర్తించి అతనికి భద్రతను మన బాధ్యతగా విశ్వసించి, అతన్ని ప్రశ్నించనివ్వడం, అతన్ని సృజనశీలంగా వ్యవహరింపజెయ్యడం అనేవి చిన్న అంశాలు కాదు. వీటిని అమలు చెయ్యడం అంటే ఇదొక వర్గ పోరాటమే అవుతుంది. ఇది చాలా క్లిష్టం కూడా. అందుకే ఈ స్వేచ్ఛా విద్యకోసం లెక్కలేనంత మంది తత్వవేత్తలు తరాల తరబడి పోరాడుతున్నారు.

మన పాఠ్యపుస్తకాల్లో ఎవరి పేర్లు కన్పిస్తాయి? ఒక యాదయ్య, ఒక అయిలమ్మ ఎక్కడైనా కన్పిస్తాయా? వాటి భాష ఎవరిది? ఉపాధ్యాయుడి భాష ఎవరిది? ఏ వాతావరణంలోకి మనం మన దళిత విద్యార్థుల్ని నెట్టుతున్నాం? మనం చెప్పే దేవుళ్ళు ఎలాంటి వాళ్ళు? మన పురాణ కథలు ఎవరిని గొప్ప చేసి చెపుతాయి? మనం చెప్పే కథలు మన నిరుపేద పిల్లల్ని ఏమని ప్రశ్నిస్తాయి? మనం వేసే ప్రశ్నలు, చేసే చేష్టలు, చూసే చూపులు, వ్యవహరించే విధానం బిడ్డల్ని బడిలోకి ఇముడ్చుకొనేలా వున్నాయా? తరిమేసేలా వున్నాయా? ప్రోత్సాహకాలుగా వున్నాయా, నిరుత్సాహకరంగా వున్నాయా? మన మాదిగవాడకు, మాలవాడకు బడి కొలతలో పావు కిలోమీటరు దూరంలోనే వుండొచ్చు. కానీ వాటి మధ్య గల సామాజిక దూరమెంత? ఈ దూరాన్ని తగ్గించడంలో లేదా పెంచడంలో ఉపాధ్యాయుడి పాత్ర ఎంత? డ్రాపౌట్ అవుతున్న పిల్లల మానసిక ఘర్షణను తరిచి చూస్తే మన స్కూళ్ళు మన రేషన్‌షాపుల్లాగే, ఆసుపత్రుల్లాగే, ఆఫీసుల్లాగే పేదలకెంత వ్యతిరేకంగా వున్నాయో అర్థమవుతుంది. ధనిక వర్గానికి ఎంత సన్నిహితాలో కూడా తెలుస్తాయి. దీన్ని సరిచెయ్యడమంటే అదీ పెద్ద పోరాటమే!

విద్యారంగాన్ని ఇలా పిల్లల పక్షపాతిగా, పేదల పక్షపాతిగా మార్చడానికి పాఠ్యపుస్తకాల నుంచి పాటలు నేర్పడం ద్వారా ఒక నూతన ఒరబడిలోకి నెట్టడానికి, మొత్తం వ్యవస్థను పై నుంచి కింది దాకా ప్రజాస్వామ్యీకరించడానికి ఓ సాంస్కృతిక ఉద్యమం లాంటి దాన్ని కేరళ వామపక్ష ప్రభుత్వం ఇటీవల ప్రారంభించింది. అదే ప్రభుత్వం పరిపాలనను వికేంద్రీకరించి ప్రణాళికల్ని పంచాయతీలకూ అప్పగించింది. విచిత్రం ఏమంటే కేరళలోని అభివృద్ధి నిరోధక వర్గాలతో పాటు ఒక మేధావి వర్గం సైతం విద్యారంగంలో తెచ్చిన ఈ ప్రజాస్వామిక విప్లవాన్ని వ్యతిరేకించాయి. పంచాయతీ ప్రణాళికల్ని అంగీకరించిన వారు కూడా విద్యారంగంలో ఈ అభ్యుదయ విధానాన్ని వ్యతిరేకించారు. దీన్నేమనాలి? అంటే ఈ పోరాటం అంత క్లిష్టమైంది ! (సశేషం)


*Now it is possible to meet your Global Needs*

VIVEKANANDA INSTITUTE

KURNOOL Ph (08518) 28770

OFFERING COURSES

Level I - Basic English

Level II - Functional English

Level III - Spoken English

India's No. 1 English Training Institute Welcomes you

Come on let us touch the world with 100% fluency

H.O. : CHENNAI R.O.: HYDERABAD

# సార్వత్రిక ప్రాథమిక విద్య - సమస్యలు - పరిష్కారాలు

కె. సుధాకరరెడ్డి, APC, D.P.E.P., R.R. Dist.

*స్వాతంత్ర్యం సిద్ధించి యాభై మూడేళ్ళు గడిచినా సమాజంలో సగం మంది నిరక్షరాస్యులుగానున్న మన దేశం "సార్వత్రిక ప్రాథమిక విద్య" సాధనకై అడ్డంకుల నధిగమించి లక్ష్య సాధనకై కృషి సల్పాల్సిన అవసరం వుంది. రాజ్యాంగం అమల్లోకి వచ్చిన పదేళ్ళలో 5-14 సం॥ పిల్లలందరికి నిర్బంధోచిత ప్రాథమిక విద్యను అందించాలని రాజ్యాంగంలో నిర్దేశించుకున్నా అది నినాదంగానే మిగిలింది తప్ప పిల్లలందరిని విద్యావంతులుగా చేయటంలో మనం ఘోరంగా విఫలమయ్యాం.*

రాజ్యాంగం 1950లో అమలులోకి వచ్చింది కనుక 1960 నాటికి ఈ లక్ష్యం నెరవేరి వుండాలి. నెరవేరకపోగా గడువు ముగిసి 43 ఏళ్ళు దాటినా సార్వత్రిక విద్య ఒక మిధ్యగానే వుండిపోయింది. తాజా జనాభా లెక్కల ప్రకారం ఆరు నుంచి పద్నాలుగు ఏళ్ళ వయస్సు పిల్లల్లో సగం మంది బడి బయటే వుంటున్నారు. ఇంకా బాలికల్లో ఈ వ్యత్యాసం అధికంగా వున్నది. 1986లో జాతీయ విద్యావిధానం చేసిన ప్రకటన ప్రకారం 1995 నాటికి సార్వత్రిక ప్రాథమిక విద్యాలక్ష్యాన్ని సాధించాల్సి వుంది. 1993లో మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ విడుదల చేసిన ప్రకటన 2000 సంవత్సరం నాటికి అందరికి విద్య లక్ష్యాన్ని సాధించాల్సి వుంది. కాని ఈ ప్రకటనలు, తీర్మానాలు లక్ష్యాన్నిర సాధించలేకపోయాయి. మరి ఈ లక్ష్యాన్ని సాధించటంలో ఎందుకు విఫలమయ్యాయో పరిశీలిద్దాం.

ఏ దేశమైతే అక్షరాస్యతలో ముందుంటుందో అక్కడి ప్రజల జీవనశైలిలో మార్పు వచ్చి తదనుగుణంగా ఆదాయం పెంచుకోవటం జరుగుతుంది. తద్వారా జీవన ప్రమాణంలో పెరుగుదల దేశ ఆర్థికాభివృద్ధికి దోహదం చేస్తుంది. కాబట్టి దేశ ఆర్థికాభివృద్ధి అక్షరాస్యతపై ఆధారపడి వుంటుంది. మనతోపాటు స్వాతంత్ర్యం సాధించుకొన్న ఆసియా దేశాలు, ఆఫ్రికా దేశాలను పోల్చుకుంటే అక్షరాస్యతలోను, ఆర్థికాభివృద్ధిలోను మనకంటే ముందున్నట్టు స్పష్టమవుతుంది. మనకంటే వెనుక స్వాతంత్ర్యం పొందిన చైనా (1949) ఇప్పుడు ప్రపంచ జనాభాలో ముందున్నప్పటికీ అక్షరాస్యతలో, ఆర్థికాభివృద్ధిలో కూడా ముందుండి ప్రపంచంలో ఒక అగ్రగామి దేశంగా నిలిచింది. అంతేకాకుండా 2020 సంవత్సరం నాటికి జనాభాను కూడా తగ్గించుకొని మొదటి స్థానం నుంచి త్వరలో తప్పుకోనున్నది.

భారతదేశంలో బడికిరాని పిల్లలందరు బాలకార్మికులుగా మారిపోతున్నారు. మన రాష్ట్రంలో బడికిరాని పిల్లలు సుమారుగా 30 లక్షల మంది వున్నారు. దేశంలోకెల్లా అత్యధిక బాలకార్మికులున్న రాష్ట్రం కూడా ఆంధ్ర రాష్ట్రమే! పిల్లల్ని బడికి పంపకపోవటంలో ప్రధానంగా 5 సమస్యలు ఎదురవుతున్నాయి. అవి : 1) పేదరికం, 2) సామాజిక వెనుకబాటుతనం, 3) లింగ వివక్షత - మూఢనమ్మకాలు, 4) పాఠశాలలు అందుబాటులో లేకపోవడం, 5) ఆకర్షణీయమైన పాఠశాల - బోధన.

వాటిలో ఒక్కొక్క దానిని పరిశీలిద్దాం.

**1) పేదరికం :** ఈనాడు కొన్ని కుటుంబాలు పిల్లలను సంపాదనావనరులు భావిస్తున్న సందర్భాలు వున్నాయి. తరతరాలుగా పేదరికంలో మగ్గుతూ పిల్లల్ని బాలకార్మికులుగా మారుస్తూ వారి రెక్కల కష్టంలో ఆధారపడ్డ కుటుంబాలను మనం చూస్తూ వున్నాం. అయితే పేదరికంలో వున్న అన్ని కుటుంబాలు తమ పిల్లల్ని బడికి కాకుండా పనికే పంపుతున్నారా అంటే బడికి పంపే కుటుంబాలు కూడా వున్నాయి. సాంప్రదాయకంగా నిరక్షరాస్యతవల్ల, అజ్ఞానం, అవగాహన లోపం వల్ల పిల్లల్ని బడికి పంప లేకపోవడం జరుగుతోంది. దానికి ఆర్థికాంశాలు కూడా తోడవుతున్నాయి.

**2) సామాజిక వెనుకబాటుతనం కూడా :** పిల్లల్ని బడికి పంపకపోవడానికి ఒక ప్రధానాంశమైంది. కొన్ని వర్గాల ప్రజలకే విద్య అందుబాటులో వుండటం, ఆర్థిక స్థోమతలేని దళిత, వెనుకబడిన వర్గాల ప్రజల్లో "చదువుకొని సాధించేదేముంది ?" అనే భావన, బాల్య వివాహాలు, వరకట్నంలాంటి రుగ్మతలు కూడా చాలామంది పిల్లలు బడికి దూరంగా వుంటానికి కారణమవుతున్నాయి.

**3) లింగ వివక్షత :** సమాజంలోని పేద వర్గాలలో లింగవివక్షత పాతుకపోవటంతో బాలికలకు చదువు అవసరం లేదు అనే భావన నెలకొన్నది. ఇంటిని చక్కబెట్టటానికి, పిల్లల్ని ఎత్తుకోవటానికి, వంట చేయడానికి, వంట చెఱకును పోగు చేయడానికి లాంటి పనులల్లో పెట్టి బాలికలను విద్యకు దూరం చేస్తున్నారు. ఇంకొన్ని కుటుంబాల్లో మగపిల్లల్ని కాన్వెంటులకి పంపుతూ, ఆడపిల్లల్ని ప్రభుత్వ స్కూళ్ళకి పంపుతూ వివక్షతని కనబరుస్తున్నారు.

అంతేకాకుండా, "పిల్లల్ని బడికి పంపితే పనుల్లో ఎవరు సహాయపడ్తారు? చదివే వాళ్ళందరికి ఉద్యోగాలొస్తున్నాయా? అటు ఉద్యోగాలు రాక ఇటు వృత్తిలో రాణింపు లేదనుకోవటం, తమ కుటుంబాలలో తరతరాలుగా ఎవ్వరూ చదువుకోలేదు. తమ పిల్లలు చదువు కోకపోవటం వల్ల అదనంగా వచ్చే నష్టమేమి లేదు" అనే భావన కూడా కారణం.

**4) అందుబాటులో లేకపోవటం :** తమ నివాస ప్రాంతాలలో అసలు పాఠశాలలే లేకపోవడం, ఒకవేళ ఉన్నా ఆ పాఠశాలలో ప్రాథమిక విద్యను ముగించుకున్న తర్వాత ఉన్నత విద్యావకాశాలు అందుబాటులో లేకపోవటంవల్ల చాలామంది పిల్లలు బడి మానివేయడం జరుగుతుంది. ప్రక్క గామాలలోని పాఠశాలల్లో హాస్టల్ వసతి లేకపోవటం మరొక కారణం.

**5) ఉపాధ్యాయుల కొరత, స్కూల్లో వసతుల కొరత :** ఉపాధ్యాయుల వైఖరి, బోధనా పద్ధతులు, నమోదు గావడంలోను, కొనసాగింపులోను అవరోధాలుగా నిలుస్తున్నాయి.

**పరిష్కార మార్గాలు - కర్తవ్యాలు :** సమస్యలన్నింటిని అధిగమించి పిల్లల్ని బడిలో చేర్పించటానికి ఉపాధ్యాయులు, పాఠశాల కమిటీలు కీలక పాత్రను నిర్వహించాల్సి వుంటుంది. ముందు తల్లిదండ్రులను జాగృతం చేయాల్సిన అవసరముంది. ఉపాధ్యాయులు కూడా

కాలానుగుణంగా మారి బడికి వచ్చే పిల్లలకి చదువు చెబుతాము అనే భావన నుంచి బయటపడి బడి బయటవున్న పిల్లల గూర్చి కూడా ఆలోచించాల్సిన సమయమాసన్నమైంది.

పరిశ్రమల్లో వ్యవసాయ పనుల్లో పని చేసే పిల్లల బాల్యం హరించి వేయబడి అంతంత మాత్రం సంపాదనతో పేదరికంలోనికి నెట్టి వేయబడతారని పిల్లల్ని పనుల్లో పెట్టకపోవటంవల్ల పెద్దలకి కూలి రేట్లు పెరుగుతాయనే సత్యాన్ని విస్తృతంగా ప్రచారం చేయాల్సిన అవసరం వుంది. పేదరికం కారణంగా భావించే తల్లిదండ్రులకి ప్రభుత్వం అందించే హాస్టల్ వసతిని ఉచిత పుస్తకాలు, ఉచిత బియ్యాలు లాంటి పథకాల ద్వారా వారిని బడివైపు ఆకర్షించేలా ఉపాధ్యాయులు కృషి చేయాల్సివుంది. అంతేకాకుండా ఆడపిల్లలపై వివక్షత చూపుతూ బడికి పంపకపోవడంపై కూడా తల్లిదండ్రులతో చర్చించాలి. అంగన్‌వాడి, E.C.E. సెంటర్లలో చిన్నపిల్లల్ని చేర్పించే ప్రయత్నం చేయాలి. సార్వత్రిక ప్రాథమిక విద్యను సాధించేందుకు D.P.E.P. అందించే సౌకర్యాలను కూడా ఉపయోగించుకోవాలి.

E.C.E. సెంటర్లలో 3-5 సం॥ పిల్లల్ని చేర్పించి, బడి యీడుగల్గిన పిల్లల్ని స్థానిక పాఠశాలల్లో చేర్చడానికి అవకాశం వుంది. అంతేకాకుండా అంగన్‌వాడి సెంటర్లను కూడా D.P.E.P. ద్వారా అందే ఆర్థిక సహాయం పాఠశాల పూర్తి సమయాలలో నడిపించుకొని పాఠశాలల్లో హాజరు శాతాన్ని పెంచొచ్చు.

1. **కొత్త పాఠశాల/ప్రత్యామ్నాయ పాఠశాలలు :** జనాభా ప్రాతిపదికగా 1 కి.మీ. పరిధిలో అన్ని ఆవాస ప్రాంతాలలో ఏర్పాటు చేయటంవల్ల బడి ఈడు పిల్లలందర్ని బడులలో చేర్చేందుకు వీలవుతుంది.
2. మళ్ళీ బడికి పథకం ద్వారా బడి బయటవున్న పిల్లలకి వేసవిలో శిక్షణ యిచ్చి ఆ తరువాత వారి స్థాయిని బట్టి నియత పాఠశాలలో చేర్పించటం వల్ల వారికి విద్యావకాశాలు కల్పించినట్టవుతుంది.
3. ట్రాన్సిషనల్ క్లాసులు పాఠశాలల్లో ప్రారంభించి వయస్సు మీరిన పిల్లలకు ప్రత్యేక శిక్షణనిచ్చి తర్వాత వారి స్థాయిని బట్టి నియత పాఠశాలలో చేర్చాల్సి వుంటుంది.
4. రెసిడెన్షియల్ బ్రిడ్జి కోర్సులు స్థాపించి ఆరు మాసాల్లో ప్రత్యేక బోధన గరిపి ఆ తర్వాత హాస్టల్ వసతి కల్పించి రెగ్యులర్ స్కూల్స్‌లో చేర్పించే వీలవుతుంది.
5. విద్యా వాలంటీర్లను నియమించుకొని ఉపాధ్యాయుల కొరతను నివారించవచ్చు.
6. పాఠశాలలను అప్‌గ్రేడ్ చేయటంవల్ల ప్రక్క గ్రామాలకు వెళ్ళి చదువుకోలేని పిల్లలు బడిమాని వేయకుండా కొనసాగేలా చూడవచ్చు.

డి.పి.ఇ.పి. ద్వారా లభించే పై సౌకర్యాలను వినియోగంలోకి తెచ్చి పిల్లలందరిని విద్య సాధించేందుకు సమాజ సహకారం ఉపాధ్యాయులు యువత, స్వయం సహాయక బృందాలు కృషి చేసిననాడే "అందరికి విద్య - అందరిది బాధ్యత" అనే నినాదం నిజమవుతుంది. కాకుంటే అందరికి విద్య - ఒక మిధ్యగానే మిగులుతుంది.


ఆల్ఫా పబ్లిక్ స్కూల్ కనిగిరి, కొత్తపేట, ప్రకాశం జిల్లా

నర్సరీ నుండి 10వ తరగతి వరకు ఆంగ్ల మాధ్యమం

కేరళ మరియు మన రాష్ట్రం నుండి పోస్టు గ్రాడ్యుయేట్ అనుభవముగల ఉపాధ్యాయులచే శిక్షణ ఇస్తున్న ఏకైక విద్యా సంస్థ - ఆల్ఫా

2000-2001 విద్యా సంవత్సరములో "ఆల్ఫా" విజయాలు : 7వ తరగతి, 10వ తరగతులలో 100 శాతం ఉత్తీర్ణత

7వ క్లాస్ అత్యధిక మార్కులు
56[illegible]/600 గుమ్మడి సాయికృష్ణ

7వ తరగతిలో పరీక్షలు వ్రాసినవారు 36 మంది. 500 పైగా మార్కులు వచ్చినవారు 29 మంది. మిగతావారు ఫస్ట్ క్లాసులు.

10వ తరగతిలో కనిగిరి పట్టణంలో రికార్డు సృష్టించిన
[illegible] 524/600 [illegible] మాధురి

10వ తరగతి పరీక్ష వ్రాసిన 16 మందిరలో 493 నుండి 524 మార్కులు వచ్చిన విద్యార్థులు 6 గురు. ఫస్ట్ క్లాసులు 6, సెకండ్ క్లాసులు - 2, థర్డ్ క్లాస్ -1

బస్ సౌకర్యం కలదు

అన్ని తరగతులకు అడ్మిషన్లు జరుగుచున్నవి

బాల, బాలికలకు ప్రత్యేక హాస్టలు వసతి కలదు

గమనిక : నూతన విద్యా విధానం అనుసరించి I.I.T. నందు సీట్లు పొందుటకు అనుగుణంగా 8,9,10 తరగతులకు ప్రత్యేక క్లాసులు నిర్వహించుట

డైరెక్టరు : జి.మాలకొండారెడ్డి B.Sc., B.L.
అడ్వకేట్ - కనిగిరి

# జాతీయ పాఠశాల విద్యా ప్రణాళికను రాష్ట్రంలో అమలుపరచే ముందు సంపూర్ణ చర్చ జరగాలి

కె. జోజయ్య, అధ్యక్షులు, యు.టి.యఫ్.

కేంద్ర ప్రభుత్వం జాతీయ విద్యా పరిశోధన, శిక్షణా మండలి (NCERT) ద్వారా ప్రకటించిన "పారశాల విద్యా ప్రణాళిక (National Curriculum Framework for School Education)ను మన రాష్ట్రంలో ప్రవేశపెట్టడానికి సాంకేతిక ప్రక్రియ ప్రారంభమైనది. తొలి చర్యగా మన "రాష్ట్ర విద్యా పరిశోధన, శిక్షణా మండలి (SCERT) ఆధ్వర్యమున 26-5-2001న హైదరాబాదులో ఒక వర్క్ షాప్ నిర్వహించబడింది.

విద్యాశాఖ ఉన్నతాధికారు, యస్.సి.ఇ.ఆర్.టి. నిపుణులు, విద్యాశాఖకు చెందిన రిటైర్డ్ ఉన్నతాధికారులు, విద్యావేత్తలు, స్వచ్ఛంద సంస్థల కార్య నిర్వాహకులు, ఉపాధ్యాయ సంఘాల నాయకులు మున్నగువారు అందులో పాల్గొన్నారు.

ఆ వర్క్ షాపులో పాల్గొన్నవారికి యస్.సి.ఇ.ఆర్.టి. రూపొందించిన "విద్యా ప్రణాళిక" సంక్షిప్త రూపం (Summary) మాత్రమే కొద్దిరోజుల ముందు అందివ్వబడినది. దాని ఆధారంగా ఆ విద్యా ప్రణాళికను గురించి లోతైన అవగాహన ఏర్పడే అవకాశం లేదు. అయినా వర్క్‌షాపులో పాల్గొన్న ప్రస్తుత మరియు మాజీ అధికారులు, యితరులు కొందరు NCERT రూపొందించిన పాఠశాల విద్యా ప్రణాళిక ప్రస్తుత అవసరాలకు అనుగుణంగా వున్నదని, మీడియాలో వస్తున్న విశ్లేషణలు, విమర్శలు అర్థం లేనివనియు, పట్టించుకోవలసిన అవసరం లేనివనియు పేర్కొన్నారు. వారిలో కొందరు పూర్వ నిర్ణయ అభిప్రాయాలు (Pre-determined notions) గలిగి వుండి అలా పేర్కొన్నారేమోననే భావం కలిగింది.

కనుక NCERT ప్రకటించిన పారశాల విద్యా ప్రణాళికను మన రాష్ట్రానికి వర్తింప జేసుకొనే సందర్భంలో దానిపై చర్చ 1, 2 వర్క్ షాపులకో, 1, 2 వేదికలకో పరిమితం కాగూడదు. కేవలం కొందరు అధికారుల అభీష్టానికో, మరికొందరు నేతల నిర్ణయానికో వదలి వేయవలసిన విషయం గాదు. అది మన రాష్ట్రం, మనదేశం యొక్క భావితరాల భవిష్యత్‌కు, సామాజిక స్థితిగతులకు, మనదేశ ప్రత్యేక విశేషణమైన "భిన్నత్వంలో ఏకత్వం"నకు, దేశ సమైక్యతకు రూపురేఖలిచ్చే అంశము. కనుకనే విశాల ప్రాతిపదికన, విద్యారంగంతో సంబంధమున్న వివిధ వర్గాలను భాగస్వాములను చేయడం ద్వారా ఆ విద్యా ప్రణాళికపై సంపూర్ణ చర్చ జరపడం ఎంతైనా అవసరం అని యు.టి.యఫ్. అభిప్రాయపడింది.

నేటి యన్.డి.ఎ. ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటి నుండి విద్యారంగంపై కేంద్రీకరించి, తమ సైద్ధాంతిక పునాదిని బలపరచుకొనే దానికి ఒక వర్గం గట్టి ప్రయత్నం చేస్తున్నది. అందుకు ఋజువుగా అనేక శాస్త్ర, చరిత్ర సంస్థలలో తమ వారిని జొప్పించడం, తాము అధికారములోనున్న రాష్ట్రాలలో పాఠ్యాంశాలలో చేసిన అనేక వక్రీకరణలు


Estd. 1996 Ph : 33444 (O), 20858 (R)

KNR మెమోరియల్ జూనియర్ కాలేజ్

గ్రూపులు

**M.P.C., Bi.P.C + EAMCET**
**Integrated Course**
**CEC, MEC EM/TM**

డే & రెసిడెన్షియల్

- ★ నిష్ణాతులైన అనుభవజ్ఞులైన అధ్యాపక బృందం
- ★ ఇంటర్ మొదటి సంవత్సరం EAMCET నుండి శిక్షణ.
- ★ ఇంటర్ IInd Yearలో అడ్మిషన్లు కలవు.
- ★ Doubts Clarification కొరకు Study Hours.
- ★ బాలికలకు ప్రత్యేక హాస్టల్ వసతి కలదు.
- ★ S.S.C.లో 500-525 మార్కులు వచ్చిన వారికి ఫీజులో 50% రాయితీ కలదు. 525 పైగా వచ్చిన వారికి పూర్తి ఫీజు రాయితీ కలదు.

అడ్మిషన్ల కొరకు సంప్రదించండి



వి. ప్రభాకర్ రెడ్డి M.Sc., B.Ed.,
కరస్పాండెంట్/ ప్రిన్సిపాల్

విద్యాదర్శిని
ఎడ్యుకేషనల్ సప్లయర్స్

1-8-522/4, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు ఎదురుసందు
చిక్కడపల్లి, హైదరాబాద్-20 ఫోన్:766 8045

ఉపాధ్యాయుల ఆదరాభిమానములతో నడుపబడుతున్న సంస్థ

మీ విద్యా సంస్థలకు అవసరమైన

అడ్మిషన్ ఫారాల నుండి పెన్షన్ ఫారాల వరకు
అటెండెన్స్ రిజిష్టర్స్ నుండి అడ్మిషన్ రిజిష్టర్స్ వరకు
ప్రశ్నాపత్రాలు నుండి ప్రమోషన్ షీట్స్ వరకు

అన్ని రకాల రిజిష్టర్లు లభించును

ప్రింటింగ్ ఆర్డర్స్ స్వీకరించబడును

\- ఆర్గనైజర్

మన ముందున్నాయి. అందుకనే ఆ నేపథ్యములో NCERT ద్వారా ప్రకటించబడిన "పాఠశాల విద్యా ప్రణాళిక"ను అసాంతం పరిశీలించడం శ్రేయస్కరం.

NCERT చే ప్రకటించబడిన ఏ విద్యా ప్రణాళిక ప్రాతిపదికగా మన రాష్ట్ర విద్యా ప్రణాళికను రూపొందించాలని ప్రయత్నం ప్రారంభమైనదో ఆ విద్యా ప్రణాళిక ముసాయిదా పత్రంపై సంవత్సరంపాటు దేశ వ్యాపితంగా చర్చకు అవకాశం కల్పించామని పేర్కొంటూ 2000 నవంబరులో ఆమోదిత పత్రాన్ని కేంద్ర ప్రభుత్వ ప్రకటించింది. కేంద్ర ముసాయిదా పత్రం 2000 జనవరిలో ప్రకటించబడగా మొన్నటి రాష్ట్ర వర్క్‌షాపు వరకు మన రాష్ట్రంలోని విద్యావేత్తలకు, ప్రభుత్వేతర సంస్థల (NGO)కు, ఉపాధ్యాయ సంఘాలకు అది అందుబాటులో లేదనేది ఒక వాస్తవం. జాతీయ విద్యా ప్రణాళిక ముసాయిదాపై రాష్ట్ర ప్రభుత్వం అప్పుడే స్పందించి, చర్చకు అవకాశం కల్పించి వుంటే యీ గ్యాప్ ఏర్పడి వుండేదిగాదు.

ఆ విద్యా ప్రణాళికా పుస్తకములు అందుబాటు లేక, అవి లభించిన తదుపరి అధ్యయనం చేసిన పలువురు మేధావులు, విద్యావేత్తలు తమ అభిప్రాయాలను, ఆందోళనను నేటికి ప్రకటిస్తున్నారు. నిష్పాక్షికంగా, సామాజిక స్పృహతో పరిశీలించే వారెవరైనా వారి అభిప్రాయాలను, భయాందోళనలను తేలికగా కొట్టి పారవేయలేరు.

NCERT ప్రకటించిన విద్యా ప్రణాళిక ముసాయిదాపై, ఆమోదిత ప్రణాళికపై యు.టి.యఫ్. స్పష్టమైన అభిప్రాయాలను కలిగి వున్నది. అందులోని ఆందోళనకరమైన అంశాలను వ్యతిరేకిస్తూనే, మంచి అంశాలను ఆహ్వానిస్తోంది. అవి -

**ఆహ్వానించదగిన అంశాలు :**

1) మాతృభాషలో బోధన, 2) పదవ తరగతి వరకు ఉచిత విద్య, 3) నాన్-డిటెన్షన్ విధానం, 4) సిలబసు భారం తగ్గించడం, 5) జి.డి.పి.లో 6% విద్యకు కేటాయింపు.

**వ్యతిరేకించే అంశాలు :**

1) విలువలతో కూడిన విద్య (Value education) కై విద్య, మతము సమైక్య సంబంధం కలిగి వుండాలనడం;

2) ఆధ్యాత్మిక బోధనకై, నీతిబోధకై బయటి వ్యక్తులకు పాఠశాలలో ప్రవేశం కల్పించుట;

3) సంస్కృత భాషను ఒక సబ్జక్టుగా ప్రవేశపెట్టడం;

4) మూల్యాంకనములో సెమిస్టర్ సిస్టమ్‌ను ప్రవేశపెట్టడం;

5) జ్యోతిష్యాన్ని, పౌరోహిత్యాలను బోధనాంశాలుగా ప్రవేశపెట్టడం;

6) కొందరికి ప్రత్యేక విద్యావకాశాలను కల్పించడం;

7) దేశ వ్యాపితంగా ఒకే చట్రంలో 10 + 2 విధానం వుండాలనడం.

పైన పేర్కొన్న అంశాలన్నిటిపై అందరూ దృష్టి సారించవలసి వున్నది; విశ్లేషించవలసి వున్నది; స్థూలంగా రాష్ట్రావసరాలకు ఉపయోగపడే విద్యా ప్రణాళిక రూపొందడంలో భాగస్వాములు కావలసి వున్నది.

కనుకనే మన రాష్ట్ర విద్యా ప్రణాళికను రూపొందించే క్రమములో NCERT విడుదల చేసిన విద్యా ప్రణాళికను ప్రామాణిక పత్రంగా ఆమోదించక, దానిపై విస్తృత చర్చకు అవకాశం కల్పించాలని, ఆ తదుపరే మన రాష్ట్ర అవసరాలకు అనుగుణమైన విద్యా ప్రణాళికను రూపొందించడానికి పూనుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

(సశేషం)


**శ్రీ శాంతినికేతన్ స్కూల్**

**నర్సరీ నుండి 10వ తరగతి వరకు**

ఇండస్ట్రియల్ ఎస్టేట్, కల్లూరు, **కర్నూలు.** ఫోన్ : 31203, 31388

ఏటేటా నిర్ణీత లక్ష్యాలను సాధిస్తూ విద్యారంగంలో ముందుకు దూసుకుపోతున్న సంస్థ - శ్రీ శాంతినికేతన్

ప్రత్యేకతలు :
- ★ అత్యుత్తమ శిక్షణ కల్గిన ఉపాధ్యాయ బృందం
- ★ ప్రతి విద్యార్థిని మహోన్నతునిగా తీర్చిదిద్దే విద్యాబోధన
- ★ ఏకాగ్రతను పెంచే వాతావరణం
- ★ ఉత్తమ ప్రమాణాలతో కూడిన విద్యా విధానం

ఫలితాలు 2000-2001 సంగలో మా పాఠశాల సాధించిన ప్రగతి

| తరగతి | మొత్తం విద్యార్థులు | 500 పైగా మార్కులు సాధించినవారు | ప్రథమ శ్రేణి | ద్వితీయ శ్రేణి | తృతీయ శ్రేణి |
|---|---|---|---|---|---|
| 10వ | 33 | 6 | 24 | 5 | - |
| 7వ | 48 | 4 | 38 | 4 | 4 |

వివరాలకు
యం. పద్మా నాగేశ్వరరావు (కరస్పాండెంట్)
శ్రీ శాంతినికేతన్ స్కూల్



స్థాపితం : 1993



రెసిడెన్షియల్ హైస్కూల్

సంతోష్‌నగర్, మిర్యాలగూడ

SSC-2001 ఫలితాలలో
**టౌన్ ఫస్ట్ - 551**

A.P.R.S. ప్రవేశ పరీక్షలో
**7 సార్లు జిల్లా ఫస్ట్**

ర్యాంక్ సాధించిన విద్యా సంస్థ

డైరెక్టర్ : వంగాల నిరంజన్ రెడ్డి M.A.,

# ఎయిడెడ్ ఉపాధ్యాయుల పట్ల ఇంత వివక్షత ఎందుకు?

నేరేళ్ళ రమణయ్య శాస్త్రి, సహాధ్యక్షులు, యు.టి.ఎఫ్.

విద్యారంగంలో ఉన్నత విలువలు, ప్రమాణాలు పెంచాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఈ సంవత్సరం ప్రభుత్వరంగంలో 7531 క్రొత్త ప్రాథమిక పాఠశాలలను ప్రారంభించడం, 4352 ప్రాథమిక పాఠశాలను ప్రాథమికోన్నత పాఠశాలలుగా అప్‌గ్రేడ్ చేయడం, ఇప్పటికే అప్‌గ్రేడ్ అయిన 1130 ఉన్నత పాఠశాలలకు గ్రాంట్ ఇన్‌ఎయిడ్ పోస్టులను మంజూరు చేయడం అలాగే ఇప్పటికే ఖాళీగా ఉన్న పోస్టులతో సహా మొత్తం 32 వేల ఉపాధ్యాయుల పోస్టులను భర్తీ చేయడానికి చేస్తున్న కృషికి అభినందనలు.

ఈ సంవత్సరం గతంలో ఎన్నడు లేనంతగా రికార్డు స్థాయిలో 10వ తరగతి ఫలితాలు వచ్చాయి. ఇప్పుడు ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలవల్ల ఇంకా ఎక్కువ శాతం ఫలితాలు వచ్చే అవకాశాలు ఉన్నాయి.

ప్రభుత్వ రంగంతోపాటు మున్సిపల్, ప్రభుత్వ ద్రవ్య సహాయంతో నడుస్తున్న విద్యాసంస్థలు కూడా మన రాష్ట్రంలో గణనీయంగా ఉన్నాయి. ప్రభుత్వం ఈ రంగంలో ఉన్న విద్యా సంస్థల అభివృద్ధికి ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు.

పిల్లలలో ఆటలపై శ్రద్ధ పెంచడానికి వ్యాయామ విద్యను విస్తృతపరచి క్రీడారంగంలో ప్రమాణాలు పెంచడానికి గత సంవత్సరం ప్రభుత్వ, పంచాయితీరాజ్ పాఠశాలల్లో 1000 వ్యాయామ ఉపాధ్యాయులస్థానే గ్రేడ్-2 ఫిజికల్ డైరెక్టర్ పోస్టులను మంజూరు చేసింది. కాని మున్సిపల్, ఎయిడెడ్ పాఠశాలలకు ఈ పోస్టులను మంజూరు చేయలేదు. ప్రభుత్వ, పంచాయితీరాజ్ ఉపాధ్యాయులకు ఇచ్చే రాయితీలను ఎయిడెడ్ వారికి వర్తింప చేయడంలేదు. కాని నష్టాలను మాత్రం వర్తింపచేస్తున్నారు. ఉదా : అప్రంటీస్ విధానం గతంలో ఎయిడెడ్ పాఠశాలలకు లేదు. ప్రభుత్వ పంచాయతీరాజ్ మున్సిపల్ ఉపాధ్యాయులకు మాత్రమే ఉండేది. ఇప్పుడు దీనిని ఎయిడెడ్ కూడా వర్తింపచేశారు.

రాష్ట్రంలో అన్ని ఎయిడెడ్ పాఠశాలల్లోను గత 7, 8 సం॥రాలుగా ఖాళీ పోస్టులను భర్తీ చేయడంలేదు. Surplus Man Power Cell పేరుతో ఆర్థిక శాఖ అనుమతిలేనిదే ఒక్క పోస్టును కూడా నింపవద్దని జి.ఓ. 275 ద్వారా ఆదేశించారు. దీనిపై అనేక వివరణలు ఇచ్చారు. అయితే Aided ఖాళీలు ఖాళీలుగానే ఉన్నాయి. అనేక ఉన్నత పాఠశాలల్లో Subject టీచర్ల కొరత వుంది. ఇప్పటివరకు వివిధ జిల్లాలో ఎయిడెడ్ పాఠశాలలు, పోస్టుల వివరాలు.

**వివిధ జిల్లాలలో ఎయిడెడ్ పాఠశాలలు పోస్టుల వివరాలు**

| S. No. | Name of the District | High Schools | | | | Primary School | | | | Sanskrit School | | | | Arabic School | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | No. of Schools | No. of Post Sanctioned | Working | Vacant | No. of Schools | No. of Post Sanctioned | Working | Vacant | No. of Schools | No. of Post Sanctioned | Working | Vacant | No. of Schools | No. of Post Sanctioned | Working | Vacant |
| 1. | శ్రీకాకుళం | 1 | 14 | 10 | 4 | 30 | 145 | 126 | 19 | - | - | - | - | - | - | - | - |
| 2. | విజయనగరం | 13 | 311 | 234 | 77 | 84 | 343 | 256 | 87 | 1 | 12 | 11 | 1 | - | - | - | - |
| 3. | విశాఖపట్టణం | 27 | 609 | 494 | 115 | 39 | 544 | 457 | 87 | 1 | 13 | 11 | 2 | - | - | - | - |
| 4. | తూ॥గో॥ | 49 | 1102 | 964 | 138 | 159 | 749 | 707 | 42 | 9 | 103 | 87 | 16 | - | - | - | - |
| 5. | ప॥గో॥ | 40 | 880 | 74 | 138 | 286 | 904 | 759 | 145 | 11 | 131 | 115 | 16 | - | - | - | - |
| 6. | కృష్ణ | 62 | 1401 | 1142 | 259 | - | 2237 | 1956 | 281 | 5 | 78 | 68 | 10 | - | - | - | - |
| 7. | గుంటూరు | 90 | 1994 | 1597 | 397 | 297 | 1389 | 1185 | 204 | 8 | 107 | 91 | 16 | - | - | - | - |
| 8. | ప్రకాశం | 50 | 815 | 719 | 96 | 196 | 898 | 848 | 50 | 12 | 106 | 99 | 7 | 1 | 5 | 5 | 0 |
| 9. | నెల్లూరు | 20 | 583 | 445 | 138 | 106 | 566 | 474 | 92 | 5 | 51 | 43 | 8 | - | - | - | - |
| 10. | చిత్తూరు | 19 | 412 | 320 | 92 | 41 | 207 | 175 | 32 | 9 | 113 | 98 | 15 | - | - | - | - |
| 11. | కడప | 26 | 563 | 462 | 101 | 94 | 412 | 376 | 36 | 16 | 203 | 181 | 22 | 1 | 5 | 5 | 0 |
| 12. | అనంతపురం | 12 | 247 | 204 | 43 | 36 | 157 | 119 | 38 | 1 | 28 | 27 | 1 | 3 | 57 | 47 | 10 |
| 13. | కర్నూలు | 33 | 632 | 568 | 64 | 125 | 673 | 644 | 29 | 5 | 65 | 61 | 4 | 5 | 66 | 52 | 14 |
| 14. | మహబూబ్‌నగర్ | 19 | 405 | 337 | 68 | 19 | 120 | 107 | 13 | - | - | - | - | - | - | - | - |
| 15. | నల్గొండ | 19 | 375 | 325 | 50 | 58 | 330 | 313 | 17 | - | - | - | - | - | - | - | - |
| 16. | మెదక్ | 5 | 139 | 96 | 43 | 3 | 24 | 17 | 7 | - | - | - | - | - | - | - | - |
| 17. | కరీంనగర్ | 13 | 248 | 211 | 37 | 29 | 169 | 143 | 26 | 3 | 22 | 11 | 11 | 1 | 8 | 8 | 0 |
| 18. | అదిలాబాద్ | 13 | 224 | 152 | 72 | 14 | 105 | 85 | 20 | - | - | - | - | - | - | - | - |
| 19. | నిజాంబాద్ | 13 | 364 | 283 | 81 | 22 | 166 | 139 | 27 | 1 | 19 | 17 | 2 | - | - | - | - |
| 20. | ఖమ్మం | 22 | 526 | 419 | 107 | 52 | 190 | 154 | 36 | - | - | - | - | - | - | - | - |
| 21. | వరంగల్ | 29 | 752 | 625 | 127 | 57 | 376 | 334 | 422 | 20 | 20 | 0 | - | - | - | - | - |
| 22. | రంగారెడ్డి | 20 | 461 | 359 | 102 | 24 | 218 | 195 | 23 | - | - | - | - | - | - | - | - |
| 23. | హైదరాబాద్ | 133 | 4359 | 2848 | 1511 | 105 | 802 | 575 | 227 | 3 | 11 | 10 | 1 | 4 | 34 | 26 | 8 |
| | మొత్తము | 728 | 17416 | 13556 | 3860 | -- | 11724 | 10144 | 1580 | 92 | 1082 | 950 | 132 | 15 | 175 | 143 | 32 |

అనేక ఎయిడెడ్ ఉన్నత పాఠశాలల్లో పదోన్నతులు లేక ఇన్‌చార్జ్ ప్రధానోపాధ్యాయుల పాలన కొనసాగుతోంది. అలాగే స్కూలు అసిస్టెంట్ పదోన్నతులు కూడా ఇవ్వడం లేదు. ఈ సంవత్సరం మే చివర జరిగిన కౌన్సిలింగ్‌లో సుమారు 500 మంది ప్రభుత్వ పంచాయితీరాజ్ పాఠశాలల్లో ఉపాధ్యాయులు, H.M./M.E.O. లుగా పదోన్నతి పొందారు. అలాగే మరొక 15 వేల మంది ఉపాధ్యాయులు స్కూలు అసిస్టెంట్, గ్రేడ్ 1 పండిట్, ప్రాథమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయులుగా పదోన్నతులు పొందనున్నారు. కాని ఒక ఎయిడెడ్ పాఠశాలలో పదోన్నతి పొందాలంటే ఉపవిద్యాశాఖ అధికారి నుండి ప్రాంతీయ సంయుక్త పంచాలకుల వరకు అందరిని సంతృప్తిపరచాలి. అయినా ప్రమోషన్ వస్తుందన్న నమ్మకం లేదు. సాక్షాత్తు రాష్ట్ర రాజధాని నగరంలోనే అనేక పాఠశాలల్లో ఉపాధ్యాయులకు పదోన్నతులు లేక గత పదేళ్ళుగా ఎదురు చూస్తున్నారు. ఉదా : వీరమాచనేని పడగయ్య ఉన్నత పాఠశాల, సికింద్రాబాద్, ఇస్లామియా బాలుర ఉన్నత పాఠశాల, సికింద్రాబాద్, డాక్టరు అంబేద్కర్ పాఠశాల చిక్కడపల్లి పాఠశాలల్లో ప్రధానోపాధ్యాయుల పదోన్నతులకై 1988-89లో పంపిన ప్రతిపాదనలకు ఇంతవరకు విముక్తిలేదు. అలాగే శ్రీనివాస ఉన్నత పాఠశాల, ఆర్.టి.సి. ఉన్నత పాఠశాల St. Thomas (SPG) బాలుర ఉన్నత పాఠశాల, ఇలా ఒకటికాదు, రెండు కాదు అన్ని పాఠశాలల్లో ఇదే పరిస్థితి.

ఖాళీలు నింపకపోవడం, ప్రమోషన్ లేకపోవడం అనేవి అటుంచితే అసలు జీతాలు ఎప్పుడు వస్తాయో తెలియని పరిస్థితి. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ మరియు ఐక్యపోరాటాల ఫలితాలుగా ఎంత జీతం వస్తుందో తెలియని స్థితి నుండి ఖచ్చితంగా ఇంత వస్తుంది అనే స్థితి డైరెక్టు పేమెంట్ ద్వారా 1982లో వచ్చింది. ఇస్తున్న జీతాన్ని ప్రతినెల ఒకటవ తేదీన చెల్లించాలని మనం అనేక పోరాటాలు చేశాం, చేస్తున్నాం. 1998 పోరాట ఫలితంగా జి.ఓ. 62ను సాధించుకున్నాం. కాని ఆ జి.ఓ.లో ఉన్న లొసుగులు లోపాలవల్ల, దానిపై యాజమాన్యాలవారు కోర్టులో స్టే తెచ్చుకున్నారు. మన సంఘ పక్షాన స్టే సడలించేదానికి కృషి చేస్తున్నాము. ఇదిలా వుండగా గతంలో ఎన్నడు లేని విధంగా గత ఆర్థిక సం॥ 2000-2001లో జీతాల కొరకు అనేక ఇబ్బందులు ఎదుర్కొవలసి వచ్చింది. ఆర్థిక శాఖ అభ్యంతరాలతో డిసెంబర్ 2000, జనవరి, ఫిబ్రవరి 2001 జీతాలు ఇంతవరకు రాలేదు. బకాయిలు కూడా చెల్లించలేదు. ఈ జీతాలు, బకాయిలు చెల్లింపులకై విద్యాశాఖ సుమారు 40.10 కోట్ల రూపాయిలకై ఆర్థిక శాఖకు ప్రతిపాదనలు పంపింది. వాటిపై ఇంతవరకు ఎటువంటి చర్యలేదు.

ఇన్ని ఇబ్బందులు ఉన్నప్పటికి కూడా ఎయిడెడ్ పాఠశాల సిబ్బంది విద్యా ప్రమాణాలు పెంచేందుకు కృషి చేస్తూనే ఉన్నారు. మంచి ఫలితాలు సాధిస్తూనే ఉన్నారు.

2001-2002 క్రొత్త విద్యా సంవత్సరం ప్రారంభమవుతోంది. కనీసం ఇప్పుడైన ప్రభుత్వం ఎయిడెడ్ ఉపాధ్యాయుల పట్ల, విద్యాసంస్థల పట్ల వివక్షత విడనాడి వారి సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నం చేయాలి. అన్ని యాజమాన్యాల ఉపాధ్యాయులతో సమానంగా ప్రమోషన్ అవకాశాలు, ఎల్.టి.సి. సౌకర్యం Medical Reimbursment, G.P.F. ప్రసూతి సెలవు వంటి సౌకర్యాలను ఎయిడెడ్ ఉపాధ్యాయులకు వర్తింపచేసి వారిలో వున్న న్యూనతా భావాన్ని తొలగించేందుకు చర్య తీసుకోవాలి. ఎయిడెడ్ పాఠశాలల్లో ఉన్న ఖాళీలను కూడా డి.యస్.సి. ద్వారా భర్తీ చేసి ఎయిడెడ్ పాఠశాలలో మంచి వాతావరణం కలిగేటట్లు చూడాలి.


నిలబెట్టుకున్న విద్యాసంస్థ



2000-2001 మార్చి SSC లో

100% ఫలితాల విజయభేరి

పరీక్షకు హాజరైన విద్యార్థులు : 122

| | |
|---|---|
| ప్రథమశ్రేణి | 103 |
| ద్వితీయ శ్రేణి | 18 |
| తృతీయ శ్రేణి | 1 |

మా లక్ష్య సాధనకు సహకరిస్తున్న ప్రతి ఒక్కరికి పేరు పేరున
కృతజ్ఞతాభినందనములు

మేనేజిమెంట్

శాంతినికేతన

A True Spot for Quality

NALANDA PUBLIC SCHOOL



LKG, UKG
I to X (E.M.)

Ashoknagar, MIRYALAGUDA
Nalgonda Dist - 508 207
Ph : 63544, 63545

# ప్రత్యేక రాష్ట్రం కాదు ప్రజానుకూల పాలన కావాలి !
# భాషా ప్రయుక్త రాష్ట్రాలపై దాడి ప్రమాదకరం !!

డా॥ కె. నాగేశ్వర్, ఉస్మానియా యూనివర్శిటీ

కాలపరీక్షకు నిలిచిన భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు అనే భావనకు తిలోదకాలిస్తూ కేంద్రం జార్ఖండ్, ఉత్తరాంచల్, చత్తీస్‌ఘడ్ రాష్ట్రాలను ఏర్పాటు చేయడంతో దేశ వ్యాప్తంగా చిన్న రాష్ట్రాలకై డిమాండ్ ఊపందుకొంది. దేశంలో దాదాపు ఇలాంటి డజనుకుపైగా డిమాండ్లు వినిపిస్తున్నాయి. బుందేల్‌ఖండ్, హరిత్‌ప్రదేశ్, గూర్ఖాలాండ్, కాంతాపురి, విదర్భ మొదలగునవి ఇందుకు ఉదాహరణలు. ఈ నేపథ్యంలో తెలంగాణా డిమాండ్ పునరావృతమైంది. దీనితో రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల్లో కూడా ప్రత్యేక రాష్ట్ర డిమాండ్లు వినిపించడం మొదలయ్యాయి. రాష్ట్ర సమైక్యతకే సవాల్‌గా పరిణమించిన ఈ పరిణామాలను అర్థం చేసుకునేందుకు ప్రయత్నిద్దాం. ముందుగా భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు ఉన్న చారిత్రక విశిష్ఠతను అర్థం చేసుకోవాలి.

బ్రిటిష్ పాలిత భారతదేశంలో వివిధ భాషలు మాట్లాడే ప్రజలు ఒకే రాష్ట్రంలో వుండేవారు. ఉదాహరణకు, మద్రాస్ రాష్ట్రంలో తమిళ, తెలుగు, కన్నడ, మళయాలం భాషలు మాట్లాడే ప్రజలు వుండేవారు. అలాగే బ్రిటిష్ సార్వభౌమాధికారానికి లోబడివున్న సంస్థాన రాజ్యాలు కూడా బహుభాషా ప్రాంతాలుగా వుండేవి. అందుకే 1920 దశకం నాటికి స్వాతంత్ర్యోద్యమం విశాల ప్రజా ఉద్యమ రూపం సంతరించుకోవడంతో దేశంలోని వివిధ ప్రాంతాల్లోని ప్రజలలో ప్రజాతంత్రయుతమైన భాషావరమైన ఆకాంక్షలు పెరిగాయి. విద్యాబోధన, పరిపాలన లాంటి అన్ని వ్యవహారాలన్నీ తమ మాతృభాషలోనే జరగాలన్న భావన ప్రజల్లో బలపడసాగింది. తమ భాషాపరమైన హక్కుల కోసం ప్రజల్లో పెరుగుతున్న కోరికను స్వాతంత్ర్యోద్యమ నేతలు గుర్తించారు. ఆమోదించారు. ఈ మేరకు 1920 నాగ్‌పూర్ సమావేశంలో మహాత్మాగాంధీ ప్రతిపాదించిన తీర్మానాన్ని కాంగ్రెస్ పార్టీ ఆమోదించింది. ఇకపై కాంగ్రెస్ పార్టీని బ్రిటిష్ పాలిత రాష్ట్రాల ఆధారంగా కాకుండా భాషా ప్రయుక్త యూనిట్ల ఆధారంగా నిర్మించాలని నిర్ణయించారు. ఈ విధంగా భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు అన్నది రాజకీయ డిమాండుగా ముందుకు వచ్చింది.

> **కేవలం భౌగోళికంగా చిన్నదైనంతా మాత్రాన పరిపాలన మెరుగ్గా వుండాల్సి నవసరం లేదు. మెరుగైన పాలన, ప్రజల భాగస్వామ్యం అనేది ఆదేశంలో వున్న పరిపాలనా సంస్కృతిపైన ఆధారపడి వుంటుంది. అధికార వికేంద్రీకరణ, నిబద్ధతగల రాజకీయ నాయకత్వం, శ్రమశిక్షణగల అధికార యంత్రాంగం, జాగరూకతగల ప్రజానీకం మెరుగైన పాలనకు కీలకాంశాలు, భౌగోళిక స్వరూపం కాదు.**

ఈ కాలంలో ఏర్పడ్డ ఆర్థిక పరిణామాలు కూడా మాతృభాషా చైతన్యాన్ని పెంచాయి. బ్రిటిష్ వలస పాలన కాలంలో భారతదేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి అయింది. ఫలితంగా కొత్త పారిశ్రామిక వర్గం, మధ్యతరగతి వర్గం, మేధావివర్గం ఏర్పడ్డాయి. ఈ కొత్త వర్గాలు తమ భాష మాట్లాడే ప్రజలంతా ఒకటిగా వుండాలన్న భావాన్ని పెంచాయి. ఫలితంగా దేశంలోని ఇతర ప్రాంతాల్లో లాగానే 1930లోనే ఆంధ్ర మహాసభ ఏర్పాటయింది. తెలుగు భాష మాట్లాడే ప్రజలంతా ఏకం కావాలన్న డిమాండు ముందుకు వచ్చింది. ఈ విధంగా స్వాతంత్ర్యోద్యమంలో భాగంగానే భాషా ప్రయుక్త రాష్ట్రాల డిమాండు బలపడింది. విశాల ప్రజానీకం డిమాండుగా పరిణమించింది.

అయితే స్వాతంత్ర్యానంతరం అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ పార్టీ భాషా ప్రయుక్త రాష్ట్రాల డిమాండును తిరస్కరించింది. భాష ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ దేశ విభజనకు దారితీస్తుందని 1948లో కాంగ్రెస్ పార్టీ సరికొత్తగా సిద్ధాంతీకరించింది. కాంగ్రెస్ పార్టీ ద్రోహం చేసినప్పటికీ అప్పటికే ప్రజా ఉద్యమంలో భాగమైన భాషా ప్రయుక్త రాష్ట్రాల డిమాండు స్వాతంత్ర్యానంతరం మరింత బలపడింది. దేశ వ్యాప్తంగా భాష ప్రాతిపదికపై రాష్ట్రాల ఏర్పాటుకై ఉద్యమాలు చెలరేగాయి. తెలంగాణాలో నైజాంకు వ్యతిరేకంగా, కోస్తాలో జమీందారీ విధానానికి వ్యతిరేకంగా ఈ ప్రాంతంలో సాగిన విశాల ప్రజా ఉద్యమానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టులు విశాలాంధ్రకై ఉద్యమించారు. 1945లోనే పుచ్చలపల్లి సుందరయ్య రచించిన 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అన్న కరపత్రం ఈ ఉద్యమానికి సిద్ధాంత పరిపుష్ఠిని, ప్రచార బలాన్ని ఇచ్చింది.

ఈ విధంగా విశాలాంధ్ర డిమాండు ముందుకు రావడం, పొట్టి శ్రీరాములు అపూర్వ త్యాగం అనంతరం ఇది సాఫల్యం కావడంతో దేశ వ్యాప్తంగా భాషాపరమైన రాష్ట్రాలకై ఉద్యమాలు బలపడ్డాయి. ఈ విశాలాంధ్ర భావనను తెలంగాణా ప్రజలపై ఎవరూ రుద్దింది కాదు. స్వాతంత్ర్య పోరాటంలో, ప్రత్యేకించి ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో తెలంగాణాతో సహా సమస్త తెలుగు ప్రజానికంలో పెరిగిన భాషాపరమైన బాంధవ్యం ఆంధ్రప్రదేశ్ ఏర్పాటును నిజం చేసింది. దేశ వ్యాప్తంగా భాషా ప్రయుక్త రాష్ట్రాలకై డిమాండ్లు ముందుకు రావడంతో 1953లో కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల పునర్‌వ్యవస్థీకరణ కమీషన్‌ను ఏర్పాటు చేసింది. కేంద్ర పాలకులు భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు భావనను వ్యతిరేకించినప్పటికీ బలమైన ప్రజా ఉద్యమాల ఒత్తిడి మూలంగా కమీషన్‌ను ఏర్పాటు చేసారు. కానీ, భాషాపరమైన రాష్ట్రాల ఏర్పాటు డిమాండును దెబ్బతీయడానికి వెనుకాడలేదు. కమీషన్ చేసిన సిఫారసుల్లో ఇది మనకు కనపడుతుంది. భాష ప్రతిపాదికపై రాష్ట్రాల ఏర్పాటును సిఫారసు చేస్తూనే ఇందుకు విరుద్ధంగా హైదరాబాద్, విదర్భ రాష్ట్రాల ఏర్పాటును కూడా సూచించింది. హైదరాబాద్ రాష్ట్రంలో మరాఠీ, కన్నడ ప్రాంతాలు కూడా వుండేవి. చివరికి ప్రజా ఉద్యమ ఒత్తిడి మూలంగా హైదరాబాద్ రాష్ట్రం కూడా భాష ప్రాతిపదికంపై పునర్ వ్యవస్థీకరించబడింది. ఫలితంగా 1956లో సమైక్య రాష్ట్రాల ఏర్పాటు ద్వారా భారతదేశ పునర్ వ్యవస్థీకరణ మొదలయింది.

సుమారు రెండు దశాబ్దాల పాటు సాగిన ఈ ప్రక్రియ రాష్ట్రాల ఏర్పాటుకు భాషా ప్రాతిపదికను సుస్థిరం చేసింది. అయితే, ఇందులో కొన్ని మినహాయింపులు లేకపోలేదు. హిందీ భాష మాట్లాడే ప్రజలందరూ

ఒకే రాష్ట్రంగా లేనప్పుడు తెలుగు భాష మాట్లాడే ప్రజలంతా ఒకటికన్న ఎక్కువ రాష్ట్రాల్లో నివసిస్తే వచ్చే నష్టం ఏమిటని ప్రత్యేక రాష్ట్రవాదుల వాదన. ఈ వాదన చేసేవారు ఒక వాస్తవాన్ని విస్మరిస్తున్నారు. భారతదేశంలో సుమారు 40 శాతం మంది ప్రజలు హిందీ భాషను మాట్లాడుతారు. వీరందరినీ ఒకే రాష్ట్రంలో వుంచితే, డాక్టర్ అంబేడ్కర్ అన్నట్లు, భారతదేశంలో అసమాన రాష్ట్రాలు ఏర్పడి అస్థిర వ్యవస్థను సృష్టించేవి. ఉర్దూ భాష మాట్లాడే ప్రజలందరూ ఒకే భౌగోళిక ప్రాంతంలో నివసించడం లేదు. అంతేగాక, ఉర్దూ భాష మాట్లాడే ప్రజలంతా ఒకే మతానికి చెందినవారు. అందుకే ఉర్దూ రాష్ట్రం ఏర్పాటు సాధ్యం కాలేదు. భాషా ప్రాతిపదికను ప్రశ్నిస్తూ దేశంలోని వివిధ ప్రాంతాలలో వివిధ స్థాయిల్లో తర్వాత కాలంలో కూడా ప్రత్యేక రాష్ట్ర డిమాండ్లు వినిపిస్తూ వచ్చాయి. ఇటీవల మూడు కొత్త రాష్ట్రాల ఏర్పాటుతో ఈ డిమాండ్లకు సరికొత్త బలం చేకూరింది.

కొన్ని రాజకీయ ఆర్థిక కారణాలు కూడా ప్రత్యేక రాష్ట్ర డిమాండుకు బలాన్ని చేకూర్చాయి. భాషా ప్రయుక్త రాష్ట్రాల భావనను సైద్ధాంతికంగానే వ్యతిరేకిస్తూ వచ్చిన భారతీయ జనతా పార్టీ అధికారంలోకి వచ్చింది. మతం ఆధారంగా ప్రజలను ఐక్యం చేయడం ద్వారా మతరాజ్యస్థాపన బి.జె.పి. లక్ష్యం. ఈ లక్ష్య సాధనకు భాషాపరంగా ప్రజల ఐక్యత ఆటంకమని బి.జె.పి. భావిస్తోంది. అందుకే భారతదేశాన్ని 60 రాష్ట్రాలుగా విభజించాలని బి.జె.పి. డిమాండ్ చేస్తోంది. దేశంలో ప్రధాన ప్రతిపక్షంగా వున్న కాంగ్రెస్ పార్టీ ఈ సమస్యపై మరోసారి అవకాశవాదాన్నే ప్రదర్శిస్తూ వస్తోంది. రెండు ప్రధాన రాజకీయ పార్టీలు ఏకాభిప్రాయానికి రావడంతో మూడు కొత్త రాష్ట్రాలు అవతరించాయి. చిన్న రాష్ట్రాలు ఏర్పడడం శ్రేయస్కరం అన్న భావన బలపడుతోంది. కానీ, ఇది వాస్తవమా అన్నది పరిశీలించాలి. ఇతర రాజకీయ పార్టీలు ఈ అంశంపై పూర్తి అవకాశవాద వైఖరిని తీసుకొంటున్నాయి. ఉదాహరణకు మూడు కొత్త రాష్ట్రాల ఏర్పాటును వ్యతిరేకించని తెలుగుదేశం పార్టీ తన అధికారాన్ని కాపాడుకోవటం కోసం రాష్ట్రంలో ఇందుకు భిన్నమైన వైఖరిని ప్రస్తుతం తీసుకుంటోంది. అవకాశాన్ని బట్టి గాలి ఎటు మరలుతుందో చెప్పలేం.

**చిన్న రాష్ట్రాలు శ్రేయస్కరమా ?**

చిన్న రాష్ట్రాలను ఏర్పాటు చేయాలన్న డిమాండ్‌పై వున్న వాద ప్రతివాదాలు పరిశీలిద్దాం.

భాషా ప్రాతిపదికగా భారతదేశంలో రాష్ట్రాలు ఏర్పాటైనప్పటికీ హిందీ మాట్లాడే ప్రాంతమంతా ఒకే రాష్ట్రంగా లేదు. అనేక రాష్ట్రాలుగా ఏర్పాటు చేస్తూ మినహాయింపు ఇచ్చాయి. ఇందుకు కారణం హిందీ మాట్లాడే వారినందరినీ కేవలం ఒకే ఒక రాష్ట్రంగా ఏర్పాటు చేయడం సాధ్యం కాదు. కాబట్టి భిన్న రాష్ట్రాలుగా రూపకల్పన జరిగింది. అలాంటి మినహాయింపే ప్రస్తుతం కూడా యిచ్చి పెద్ద రాష్ట్రాలుగా వున్న ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్‌లాంటి వాటిని పునర్వ్యవస్థీకరించాలన్నదే ప్రస్తుత డిమాండ్. ప్రపంచంలో చాలా దేశాలు మనదేశంలోని అనేక రాష్ట్రాలకన్నా, జిల్లాలకన్నా తక్కువ వైశాల్యం కలిగి ఉన్నాయి. అయినప్పటికీ వాటి జాతీయ తలసరి ఆదాయం భారతదేశ తలసరి ఆదాయం కంటే ఎన్నో రెట్లు ఎక్కువగా ఉంది. కాబట్టి భౌగోళికంగా వైశాల్యం ఎక్కువ వున్నంత మాత్రాన అది దేశ సౌభాగ్యానికి ఉపయోగకరం కాదనే వాదన వుంది.

అయితే, ఇలాంటి ప్రతిపాదనలో కొన్ని తీవ్ర ఇబ్బందులు వున్నాయి. కొన్ని పరిమితులు మినహాయింపులు ఉన్నప్పటికీ ప్రస్తుతమున్న రాష్ట్రాల వ్యవస్థ కాలపరీక్షకు నిలిచింది. ప్రస్తుతం వున్న ఈ ప్రాతిపదికను ఎత్తివేయడం జరిగితే మరే ప్రత్యామ్నాయమైన శాస్త్రీయ ప్రాతిపదిక రాష్ట్రాల ఏర్పాటుకు లేకుండ పోతుంది. ఫలితంగా లెక్కలేనన్ని డిమాండ్లు ఉత్పన్నమవుతాయి. ఇలాంటి పరిస్థితుల్లో ఏ దేశమైనా సమైక్యంగా వుండగలుగుతుందా? అన్న భయ సందేహాలు వ్యక్తమవుతున్నాయి. ఉదాహరణకు, ఆంధ్రప్రదేశ్‌ను మూడు చిన్న రాష్ట్రాలుగా ఏర్పాటు చేస్తే భవిష్యత్తులో ఉత్తర తెలంగాణా ప్రాంతం కానీ, ఉత్తర కోస్తా ప్రాంతం కానీ తమకు కూడా ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరితే ఏ కారణాన వారిని తోసిపుచ్చలగలం. అందుకే ఈనాటికీ, ఏనాటికీ కూడా భారతదేశంలో రాష్ట్రాల ఏర్పాటుకు భాషే ప్రాతిపదికగా వుండాలి.

చిన్న రాష్ట్రాల ఏర్పాటు పరిపాలనా సౌలభ్యాన్ని ఇస్తుంది. ప్రజల అవసరాలు, ఆలోచనలను పాలకులు సరిగా అర్థం చేసుకోవడానికి అవకాశం యిస్తుంది. ఈ రకంగా ప్రజలకు పాలకులకు మధ్యనున్న దూరాన్ని తగ్గిస్తుంది. పరిపాలనలో ప్రజలకు భాగస్వామ్యాన్ని యివ్వడంలో చిన్న రాష్ట్రాలలో సహజంగానే సులభంగా వుంటుంది. అభివృద్ధి సంక్షేమ పథకాలపైన సరైన పర్యవేక్షణ సాధ్యమవుతుంది. ప్రభుత్వ కార్యక్రమాలని మరింత ఫలప్రదంగా నిర్వహించుకొనటానికి దోహదపడుతుంది. అయితే ఈ వాదనను ప్రశ్నించే అంశాలు కూడా లేకపోలేదు.

కేవలం భౌగోళికంగా చిన్నదైనంతా మాత్రాన పరిపాలన మెరుగ్గా వుండాల్సినవసరం లేదు. మెరుగైన పాలన, ప్రజల భాగస్వామ్యం అనేది ఆదేశంలో వున్న పరిపాలనా సంస్కృతిపైన ఆధారపడి వుంటుంది. అధికార వికేంద్రీకరణ, నిబద్ధతగల రాజకీయ నాయకత్వం, శ్రమశిక్షణగల అధికార యంత్రాంగం, జాగరూకతగల ప్రజానీకం మెరుగైన పాలనకు కీలకాంశాలు, భౌగోళిక స్వరూపం కాదు.

చిన్న రాష్ట్రాల ఏర్పాటు వల్ల వనరులను మరింత ప్రయోజనకరంగా ఉపయోగించుకోవచ్చు. ఇందుకు ఉత్తరప్రదేశ్ అనుభవాలను ఉదహరిస్తుంటారు. వ్యవసాయ పారిశ్రామిక అభివృద్ధి విషయంలో స్వాతంత్ర్యం వచ్చిన నాటితో పోల్చితే ప్రస్తుత ఉత్తరప్రదేశ్ పరిస్థితి దిగజారింది. జనాభాలో మొదటిస్థానంలో వున్న ఉత్తరప్రదేశ్ తలసరి ఆదాయం విషయంలో 11వ స్థానంలో వుంది. అదే సమయంలో చిన్న రాష్ట్రాల ఏర్పాటు వలన స్వావలంబన దెబ్బతింటుంది. (సశేషం)

అభినందనలతో...

**శ్రీ తేజ ఎడ్యుకేషనల్ సొసైటీ వారి**

Estd : 1994 ☎ 74550

**సుశీల మెమోరియల్ డిగ్రీ కళాశాల**

మధిర, ఖమ్మం జిల్లా

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే గుర్తింపుపొందినది. కాకతీయ యూనివర్సిటీ అనుబంధం పొందినది)

Estd : 1996 ☎ 74490

**సుశీల మెమోరియల్ జూనియర్ కళాశాల**

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే గుర్తింపుపొందినది)

Estd : 1996 ☎ 74490

**ఉషోదయ కాన్వెంట్**

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే గుర్తింపుపొందినది)

మధిర నియోజకవర్గంలో గుర్తింపు పొందిన ఏకైక ఉన్నత పాఠశాల

డైరెక్టర్
బి. కొటేశ్వరరావు
M.Sc., B.Ed.,

సెక్రటరీ & కరస్పాండెంట్
కరివేద వెంకటేశ్వరరావులు
M.Sc., M.Ed.,

# కోర్టులు-తీర్పులు

## హాఫ్-ఎ-మిలియన్ ఉపాధ్యాయుల సీనియారిటీపై ట్రిబ్యునల్ తీర్పు

- ఓ. రామిరెడ్డి

హాఫ్-ఎ-మిలియను టీచర్లు, రెగ్యులర్ ప్రమోషను పొందినవారు, అప్‌గ్రేడెడ్ బి.ఇడి.లు, భాషా పండితులను 1.1.76 నుండి ఉమ్మడి సీనియారిటి జాబితాలు తయారుచేసి ప్రమోషను ఈయవలసి వచ్చినపుడు 1999 ఏప్రిల్ నెలలో విద్యాశాఖ కార్యదర్శిగారు అన్ని ఉపాధ్యాయ సంఘాలతో ఒక సమావేశం ఏర్పాటు చేసి, పై మూడు క్యాటగిరిలలో ఎవరిని ముందుంచాలి అని చర్చించారు.

యు.టి.యఫ్. తప్ప అన్ని ఉపాధ్యాయ సంఘాలు మొదట ప్రమోటయిన వారిని, తర్వాత అప్‌గ్రేడెడ్ వారిని, చివరగా హాఫ్ ఎ మిలియన్ వారిని ఉంచాలని వాదించారు. కేవలం యు.టి.యఫ్. ప్రతినిధులు మాత్రమే ఈ పద్ధతి తప్పని సీనియారిటి జాబితాలో ముందు హాఫ్-ఎ-మిలియన్ వారిని ఆ తర్వాత ప్రమోటయిన వారిని, ఆ తర్వాత అప్‌గ్రేడయిన వారిని చేర్చాలని ప్రతిపాదించడం జరిగింది.

కాని మెజారిటీ తీర్మానం పేరుతో యు.టి.యఫ్. వాదన త్రోసిపుచ్చి Memo. No. 0144/సర్వీసు-2-1/99-1 తే. 22.4.99 ఉత్తర్వు యిచ్చారు. దానిలో మొదట రెగ్యులర్ వారు, తర్వాత అప్‌గ్రేడెడ్ వారు, తర్వాత హాఫ్-ఎ-మిలియను వారిని ఉంచాలని పేర్కొన్నారు. 99-2000 జనవరి మధ్య ట్రిబ్యునల్‌కు అనేకమంది వెళ్ళినా 144 మెమోను ఖాయపరుస్తూ ట్రిబ్యునల్ తాత్కాలిక ఉత్తర్వు యిచ్చింది. దాని ప్రకారమే గత ప్రమోషన్లిచ్చారు.

కాని A.3037/99 మొ॥ 5 పిటీషన్లపై ట్రిబ్యునల్ తుది తీర్పు 4.5.2001న యిచ్చింది. ఆ తీర్పులో ప్రభుత్వ వాదన పిటీషనర్ల తరపున లాయర్ల వాదన పేర్కొని తీర్పు యిలా యిచ్చారు.

In view of the facts and circumstances of the case and the discussion refered above the O.As are allowed by setting aside the impunged Memo. No. 0144/Ser. 11-1/99-1 Date 22.4.99 on the Government which has been communicated throuh Memo. Rc. No. 6008/C2-2/98 date 6.5.99 by the Commissioner and Director of school Eucation with a direction to the official respondents to prepare the seniority list in accordance with ruels governing the posts and seniority with in 3 months from the date of receipt of this order. The official respondents are also directed to review the promotions that are affected earlier based upon the seniority fixed in pursuance of this impunged memo. of the Government or the orders passed in the main O.As.

0144 మెమోను రద్దు చేసి రూల్సు ప్రకారం నిర్ణయించమన్నారు. మెమో రద్దయింది కాబట్టి సహజంగా హాఫ్ ఎ మిలియను వారిని ముందుంచాలని భావించాలి. ఆ ప్రకారం గతంలో యిచ్చిన ప్రమోషన్లు రివ్యూ చెయ్యాలి. ఈ రివ్యూ చేసే సమయంలో అక్రమాలు జరుగకుండా సంఘాలు జాగ్రత్తపడాలి.

## అర్ధ మిలియను ఉపాధ్యాయులు సీనియారిటి జాబితాల సవరణ

ప్రభుత్వ మెమో నెం. 0144/సర్వీస్-II-1/99-1 విద్య తేది 22.4.1999 ప్రకారము తయారు చేయబడి, ఇప్పటివరకు అమలులోనున్న సీనియారిటీ జాబితాలను కోర్టు తీర్పు రద్దు పరచినదనియు, కనుక సవరణ జాబితాలను ఎ.పి. స్టేట్ అండ్ సబార్డినేట్ సర్వీసు రూల్సు నందలి రూలు 33, 34, 36ల ప్రకారము తయారు చేయాలనియు పాఠశాల విద్యా సంచాలకులు ఆర్.,సి.నెం. 6008/సి2-2/తేది : 9.5.2001 ద్వారా యిచ్చిన ఉత్తర్వులలో పేర్కొనడం జరిగింది. పాఠకుల అవగాహనకై ఆ రూల్సు యొక్క సారాంశము క్రింద పొందుపరచడమైనది.

**రూలు 33 :**

ఎ) ఒక ఉద్యోగి ఒక సర్వీసుకు చెందిన క్లాసు, క్యాటగిరి (లేక) గ్రేడులోని నియామకము తేదీ నుండి ఆ ఉద్యోగి సీనియారిటీ నిర్ణయించబడును.

బి) ఇద్దరు లేక అంతకంటె ఎక్కువమందిని ఒకేసారి నియమించు సందర్భములో రిజర్వేషను కొరకు గాని లేక ఇతర కారణముపై గాని వారి ప్రాధాన్యతా క్రమము (ర్యాంకు)ను నిర్ణయించవచ్చును. అట్టి ప్రాధాన్యతా క్రమము స్థిరీకరించబడి వున్నపుడు వారి సీనియారిటి దానిని బట్టే నిర్ణయించబడును.

సి) ప్రమోషన్ తేది నోషనల్‌గా యివ్వబడినపుడు, తదుపరి ప్రమోషన్ అర్హదాయక సర్వీసు అట్టి నోషనల్ తేదీ నుండే పరిగణించబడును.

డి) ఒకే వేతన స్కేలు గల వేరొక పోస్టు నుండి బదిలీపై నియమించబడినపుడు మొదటి పోస్టులో నియామకపు తేదీ నుండి సీనియారిటిని పరిగణించబడును.

(ఇ) నుండి (జి) వరకు అంశమునకు సంబంధము లేనివి.

**రూలు 34 :**

ప్రమోషను ఇచ్చుటకై వేర్వేరు యూనిట్లకు చెందిన ఒకే క్యాటగిరి ఉద్యోగుల యొక్క కామన్ సీనియారిటీ జాబితాను తయారుచేయుటకు గాను రూలు 33(ఎ) ననుసరించి ఆయా యూనిట్లలో వారి వారి నియామకపు తేదీలు పరిగణలోనికి తీసుకొనబడును. అయితే ఒకే యూనిట్‌లోని వారి సీనియారిటీలో ఎట్టి మార్పు ఉండదు.

**రూలు 36 :**

ఒకే రెగ్యులరైజేషన్ తేదీ నుండి ప్రొబేషన్ ప్రారంభమైన వారి విషయములో ఇంటర్ - సీనియారిటి క్రింది విధముగా నిర్ణయించబడును

1) డైరెక్టు రిక్రూట్మెంటుకై ఎంపిక చేయబడినపుడు సదరు ఎంపిక అధికారులచే కేటాయించబడిన ర్యాంకు ప్రాతిపదిక అవుతుంది.
2) ప్రమోషన్ పొందిన లేక బదిలీపై ప్రమోషను పోస్టులో నియమించబడిన వారి విషయములో వారి ప్రొబేషన్ ప్రారంభ తేదీ ప్రాతిపదిక అవుతుంది.
3) పై (2)వ అంశము ఒకే తేదిగా గల వారి విషయములో ఎక్కువ వయస్సుగల వారు సీనియరు అవుతారు.
4) పాలనాపరంగా బదిలీపై నియమించబడిన వారి విషయములో వారి స్వంత డిపార్టుమెంటులో ప్రొబేషన్ ప్రారంభతేదీ పరిగణలోనికి తీసుకోబడుతుంది.
5) అభ్యర్థనపై బదిలీ చేయబడిన వారి విషయములో క్రొత్త యూనిట్‌లో చేరిన తేదీ ప్రాతిపదికగా తీసుకోబడుతుంది.

- కె. జోసయ్య

నేటి మీ నిర్ణయమే రేపటి మీ బాలల బంగారు భవితకు బాట
సచ్ఛీలత, సంస్కారం, జ్ఞానాలకు
ప్రగతి ట్యూటోరియల్స్ వారి ఆధ్వర్యంలో

# ప్రగతి
# మోడల్ స్కూల్

డే & రెసిడెన్షియల్ LKG to 10th (EM & TM)

ఇండస్ట్రియల్ ఏరియా కెదురుగా, ఇల్లెందురోడ్,
ఖమ్మం

STATE SYLLABUS

ఫోన్ : 22349
43376

అడ్మిషన్లు ప్రారంభమైనవి

ప్రత్యేకతలు

- ★ ఏకాగ్రతను పెంచే 4 ఎకరాల విస్తీర్ణంలో విశాలమైన తరగతి గదులు
- ★ తల్లిదండ్రుల ఆశయాలకు అనుగుణంగా Teaching aids తో Modern Methods ద్వారా బోధన
- ★ Ist క్లాస్ నుండి కంప్యూటర్, మ్యూజిక్, డ్యాన్స్‌లకు ప్రత్యేక తరగతులు.
- ★ చక్కని లైబ్రరీ, లేబొరెటరీ సౌకర్యం.

- ★ పక్కా భవనంలో చక్కని హాస్టల్ వసతి
- ★ డే స్కాలర్స్‌కు బస్ సౌకర్యం
- ★ Spoken English, Sanskrit లకు ప్రత్యేక తరగతులు
- ★ మీడియా వారి ప్రత్యేక క్యాంపస్‌లు
- ★ నిర్ణీతకాల వ్యవధులలో వైద్య పరీక్షలు, క్యాంపస్‌లో ఎల్లవేళలా వైద్య సౌకర్యం.

10వ తరగతి విద్యార్థులకు క్లాసులు ప్రారంభమైనవి

# ప్రశ్నోత్తరాలు

- నిర్వహణ : కె. జోజయ్య

*(ఈ వేసవిలో నిర్వహించబడిన జిల్లాల ఉద్యమ శిక్షణా తరగతుల సందర్భములో కార్యకర్తలు అడిగిన సాధారణ ప్రశ్నలు కొన్నింటికి జవాబులు ఈ క్రింద ఇవ్వబడినవి)*

**ప్రశ్న :** ఉన్నత పాఠశాలలకు ఫిజిక్స్, ఇంగ్లీషు స్కూల్ అసిస్టెంట్ పోస్టులను యిస్తున్నామని యు.టి.యఫ్. రజతోత్సవాలలో విద్యాశాఖామాత్యులు ప్రకటించారు. ఈ విద్యా సం॥లోనైనా వాటిని మంజూరు చేస్తున్నారా ?

**జవాబు :** ఇప్పటికి మంజూరు చేయలేదు. జె.సి.టి.ఎ.; జె.ఎ.సి.లకు ప్రభుత్వం యిటీవల యిచ్చిన అగ్రిమెంటులో సదరు పోస్టులను 'దశల వారీ'గా మంజూరు చేస్తామని హామీ యిచ్చినది. హామీలు యివ్వడంలో కనబరచే ఉత్సాహం వాటిని అమలుపరచడంలో ప్రభుత్వానికి వుండటం లేదు. హామీలు అమలు కోరుతూ జె.సి.టి.ఎ., జె.ఎ.సి.లు ప్రాతినిధ్యాలు చేయడం జరుగుతూనే వుంది. సంబంధిత ఫైలు సర్క్యులేషన్‌లో వుంది. త్వరలో ఉత్తర్వులు యిస్తారని ఆశిద్దాం.

**ప్రశ్న :** డి.యస్.సి. ద్వారా ఎంపికైన ఉపాధ్యాయుల సర్వీసు రెగ్యులరైజేషన్ వారి నియామకపు తేదీ నుండే జరుగుతుందా?

**జవాబు :** "Seniority counts from the date of regularisation" అనునది ఒక మౌలిక నిబంధ. DSC ద్వారా ఎంపికయిన వారి సీనియారిటి సెలక్షన్ లిస్ట్‌లోని వారి 'ర్యాంక్' ప్రాతికగా నిర్ణయించబడుతుంది. (ఎ.పి. స్టేట్ అండ్ అబార్డినేట్ సర్వీసు రూల్సు నందలి రూలు - 33(బి)) ఈ రెండు నిబంధనల కారణంగా ముందుగా విధులలో చేరినను జూనియర్ యొక్క రెగ్యులరైజేషన్ అతని సీనియర్ యొక్క రెగ్యులరైజేషన్ తేదీ నుండి మాత్రమే చేయబడుతుంది. అయితే, యిప్పటివరకు డి.యస్.సి. ర్యాంకులు, సీనియర్లు చేరిన తేదీలు తెలియని కారణంగా ఎవరు చేరిన తేదీ నుండి వారికి రెగ్యులరైజేషన్ చేయడం జరుగుతోంది. అది సరిగాదు.

**ప్రశ్న :** ప్రభుత్వ, పం.రాజ్ పాఠశాలలలో యిటీవల నియమించబడిన ఉపాధ్యాయుల సర్వీసు రెగ్యులరైజేషన్ మరియు ప్రొబేషన్ డిక్లరేషన్ ఎవరు చేయాలి?

**జవాబు :** నియామక అధికారే సర్వీసు రెగ్యులరైజేషన్ మరియు ప్రొబేషన్ డిక్లరేషన్ చేయాలనేది నిబంధన. ఉపాధ్యాయుల ప్రస్తుత సర్వీసు రూల్సు (జి.ఓ. 505, 538) ననుసరించి స్కూల్ అసిస్టెంట్ పోస్టు వరకు నియామకాధికారి అయిన జిల్లా విద్యాశాఖాధికారే ఆ పోస్టులలోని ఉపాధ్యాయుల సర్వీసు రెగ్యులరైజేషన్, ప్రొబేషన్ డిక్లరేషన్ చేస్తారు. ప్రధానోపాధ్యాయులు, యం.ఇ.ఓ.లకు ఆ ప్రక్రియలను ఆర్.జె.డి. చేస్తారు.

**ప్రశ్న :** క్యాటగిరి III వారికి 16 సం॥ల స్కేలు అనుమతిస్తూ DSE యిచ్చిన ప్రొసీడింగ్స్ చాలవని, ప్రభుత్వ ఉత్తర్వులు కావాలని ఆడిట్‌వారు అభ్యంతర పెట్టుచున్నారు. సమంజసమేనా ?

**జవాబు :** సమంజసము గాదు. ఉపాధ్యాయుల ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీముకు సంబంధించిన మౌలిక ఉత్తర్వులైన జి.ఓ. 164 ఆర్థిక, తేది : 1-6-1982 (అధ్యాపక దర్శిని - 6, పేజి - 32) నందు "For appointment to the special temporary promotion post, it is necessary that an employee shall be duly qualified for holding the promotion post under the service rules applicable to the post" అని స్పష్టముగా పేర్కొనబడియున్నది. అట్లే జి.ఓ. 538 విద్య, తేది 20-11-98 (అ.ద. 16, పేజి-258) ద్వారా యివ్వబడిన సర్వీసు రూల్సు నందు సె.గ్రే. పోస్టు యొక్క మరియు దాని తదుపరి ప్రమోషన్ పోస్టు అయిన ప్రైమరీ స్కూల్ హెడ్మాష్టర్ పోస్టు యొక్క అర్హతలు ఒకటిగా పేర్కొనబడినవి. ఆవిధంగా వున్న ప్రభుత్వ ఉత్తర్వుల ఆధారంగా ఆర్.సి.నెం. 696/జి3/2001. తేది 12.4.2001 ద్వారా DSE వివరణ ఉత్తర్వులు యిచ్చేరేగాని క్రొత్త సౌకర్యాన్ని కల్పించలేదు. కనుక ప్రభుత్వం నుండి ఉత్తర్వులు కావాలనడం సమంజసంగాదు.

**ప్రశ్న :** సెకండరీ గ్రేడు ఉపాధ్యాయులకు తప్ప క్యాటగిరి III కి చెందిన యితర క్యాడర్ల వారికి అర్హతలు లేవనే పేరుతో 16 సం॥లు యివ్వడానికి నిరాకరిస్తున్నారు. సక్రమమేనా ?

**జవాబు :** సక్రమమే. ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుని పోస్టు (L.F.L.H.M.) క్యాటగిరి-III కి ప్రమోషన్ పోస్టుగా సర్వీసు రూల్సు (జి.ఓ. 538, తేది : 20-11-98)లో పేర్కొనబడియున్నది. సదరు ప్రధానోపాధ్యాయుని పోస్టు అర్హతలు, సె.గ్రే. పోస్టు అర్హతలు ఒకటే గావున సె.గ్రే. వారికి 16 సం॥ల స్కేలు అనుమతిస్తారు. మిగిలినవారికి సాధారణంగా ఆ అర్హతలు వుండవు గనుక వారికి 16 సం॥ల స్కేలును నిరాకరిస్తారు. కొద్ది సంఖ్యలో వుండే అట్టివారికి కూడా పి.ఎ.టి. ద్వారాగాని మరో విధంగా గాని మినహాయింపు యివ్వాలని ప్రభుత్వానికి ప్రాతినిధ్యము చేస్తున్నాము.

**ప్రశ్న :** ఎయిడెడ్ వారి యాక్ట్ 9/2000 Prospective effect తోనే అమలు జరుపబడుతుందని అగ్రిమెంటులో పేర్కొన్నారు. దానిని ఏ విధంగా అమలు చేస్తారు?

**జవాబు :** యాక్ట్ 9/2000 మార్చి 2000 లో చేయబడినది. దానికి Prospective effect యివ్వడమంటే ఆ చట్టమైన తేదీ తరువాత గ్రాంట్-యిన్-ఎయిడ్‌కు అడ్మిట్ అయిన పోస్టులలో పనిచేస్తున్న వారి అన్-ఎయిడెడ్ కాలపు యింక్రిమెంట్లు పరిగణనలోకి తీసుకోబడవు. అనగా ఆ చట్టమైన తేదీకి ముందు గ్రాంట్-యిన్-ఎయిడ్‌కు అనుమతించబడిన అన్ ఎయిడెడ్ యింక్రిమెంట్లు రద్దు కాకుండా కొనసాగుతాయి.

**ప్రశ్న :** యల్.యఫ్.యల్. ప్రైమరీ స్కూల్ హెడ్మాష్టర్ ప్రమోషన్ నిరాకరిస్తే కలిగే నష్టమేమైనా వుందా?

**జవాబు :** సదరు ప్రమోషన్‌ను నిరాకరిస్తే 26-10-88 తదుపరి పొంది వున్న 16; 22 సం॥ల స్కేళ్ళు రద్దవుతాయి. అంతేగాక, భవిష్యత్‌లో ఎట్టి ప్రమోషన్ పొందే అవకాశం వుండదు.

**ప్రశ్న :** ఒక ప్రైవేట్ పాఠశాలలోని సె.గ్రే. ఎయిడెడ్ పోస్టులో 3 సం॥లు పనిచేస్తూ డైరెక్టు రిక్రూట్మెంట్ ద్వారా జూన్ 86లో ప్రభుత్వ పాఠశాలలో సె.గ్రే.గా జాయిన్ అయిన ఉపాధ్యాయునికి పే ప్రొటెక్షన్ వుంటుందా ?

**జవాబు :** అట్టి అవకాశము లేదు. అయితే సదరు ఉపాధ్యాయుని యొక్క ఎయిడెడ్ పాఠశాల సర్వీసు పెన్షన్‌కు పరిగణించబడుతుంది.




# శ్రీ మాణిక్ విద్యాసంస్థలు
## కర్నూలు

## శ్రీ మాణిక్ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజ్

* M.P.C. * Bi.P.C (EM & TM) * MEC (EM)
* Seperate Sections for both Boys & Girls

## శ్రీ మాణిక్ ఎంసెట్ కోచింగ్ సెంటర్

లాంగ్‌టర్మ్ కోచింగ్ జూలై లేక ఆగష్టు నుండి ప్రారంభం
షార్ట్‌టర్మ్ కోచింగ్ ఇంటర్ పరీక్షలు వ్రాసిన వెంటనే ప్రారంభం

## శ్రీ మాణిక్ హైస్కూల్స్

NURSERY, LKG, UKG, I to X (EM) & VII to X (TM)

బాలబాలికలకు ప్రత్యేక హాస్టల్ వసతి కలదు

**Founder :**
**Late I. Nagakondala Rao**

**Director :**
**I. Manik Prasad**
M.Sc., M.Ed., D.C.P.,

# నడుస్తున్న చరిత్ర

## డబ్ల్యు.టి.ఓ. ప్రపంచ దేశాలకు కంట్లో నలుసే ?

- జీ.సి. మధుసూదనరావు

ఇప్పటివరకు ప్రపంచ వ్యాప్తంగా ఆందోళన రేకెత్తించిన రేకెతిస్తున్న సంస్థ డబ్ల్యు.టి.ఓ. (ప్రపంచ వాణిజ్య సంస్థ). డబ్ల్యు.టి.ఓ. వల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలు దెబ్బతింటాయని, ఆ దేశాల్లో స్వదేశీ పరిశ్రమలు మూతపడుతాయని, వ్యవసాయరంగం దారుణంగా దెబ్బతింటుందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. ఈ సందర్భంగా డబ్ల్యు.టి.ఓ. పుట్టుక దాని పదజాలపు అర్థాలూ, అనర్థాలూ గూర్చి తెలుసుకోవడం సముచితం, సందర్భోచితం. అందుకే ఈ వ్యాసం.

**ప్రపంచ వాణిజ్య సంస్థ పుట్టుక :**

రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత బ్రెట్టన్ ఉడ్‌లో ఓ సమావేశం నిర్వమించి, దేశ విదేశాల్లోని ద్రవ్య సంబంధమైన పరిస్థితుల్ని సరిచేయడం కోసం "అంతర్జాతీయ ద్రవ్యనిధి" అనే సంస్థను, యుద్ధానంతర పునర్నిర్మాణానికి కావల్సిన వనరుల్ని సమకూర్చడానికి "ప్రపంచ బ్యాంక్" అనే సంస్థను 1945లో ఏర్పాటు చేయాలని ప్రపంచ దేశాలు భావించాయి. తదుపరి ప్రపంచ దేశాలకు మధ్య వచ్చే వాణిజ్య వివాదాలా పరిష్కారం కోసం, అంతర్జాతీయ వాణిజ్యానికి సంబంధించిన సమిష్టి నిబంధనలను అమలు చేయాలని, పారిశ్రామిక ఉత్పత్తులపై దిగుమతి పన్నులను తగ్గించడం కోసం, వాణిజ్య సరళీకరణ, ఇలా ఎన్నో లక్ష్యాలతో ఒక్క మాటలో చెప్పాలంటే వాణిజ్య అభివృద్ధికి అనుకూలమైన వాతావరణాన్ని పెంపొందించే లక్ష్యంతో 1947లో జెనీవాలో 23 దేశాలు (భారత్‌తో సహా) సమావేశమై "జనరల్ అగ్రిమెంట్ ఆన్ టారిఫ్స్ అండ్ ట్రేడ్" (గ్యాట్) అనే సంస్థ స్థాపన ఒప్పందంపై సంతకాలు చేశాయి. కాని గ్యాట్ అభివృద్ధి చెందుతున్న దేశాల సమస్యలను పెంచుతున్నదే కాని తగ్గించడం లేదని, ధనిక దేశాలకు దాసోహం అంటున్నదని అభివృద్ధి చెందుతున్న దేశాలు విమర్శించాయి.

1986లో జరిగిన ఉర్వుగ్వే సమావేశంలో గ్యాట్ పరిధిని పెంచారు. సేవల సంబంధిత వాణిజ్యం, వాణిజ్య సంబంధిత పెట్టుబడి చర్చలు, (ట్రిమ్స్) వాణిజ్య సంబంధిత మేధోపర ఆస్థి హక్కులు (ట్రిప్స్) విదేశీ పెట్టుబడులపై నియంత్రణల్ని సడలించడం, సర్వీసు రంగాలలో పెట్టుబడుల ప్రతిపాదనలతోపాటు వ్యవసాయాన్ని మొదటిసారిగా అజెండాలో చేర్చడం జరిగింది. వీటి లోపాలను గ్రహించిన చాలా దేశాలు నిరసన వ్యక్తం చేశాయి. భారత్, బ్రెజిల్ లాంటి దేశాలు తీవ్ర నిరసన వ్యక్తం చేశాయి. గ్యాట్ పరిధిలోనికి చేర్చిన ఈ అంశాలను వ్యతిరేకించే దేశాలను అమెరికా సూపర్ 301, స్పెషల్ 301 లాంటి చట్టాలను ప్రయోగిస్తానని బెదిరించింది. అయినా గ్యాట్‌పై 1991 వరకు వ్యతిరేకత కొనసాగుతూనే వుంది. దీంతో గ్యాట్ డైరక్టర్ జనరల్ ఆర్థర్ డంకెల్ ఒక ముసాయిదాను ప్రకటించాయి. దీనినే డంకెల్ డ్రాఫ్ట్ అంటారు. ఈ ముసాయిదాను కూడా పలుదేశాలు వ్యతిరేకించాయి. కాని అభివృద్ధి చెందిన దేశాలను అడ్డుకొనే శక్తి లేక డంకెల్ డ్రాఫ్టుకు సమ్మతిస్తూ భారత్‌తో సహా 114 దేశాలు సంతకాలు చేశాయి. దాంతో డంకెల్ సిఫార్సుల కనుగుణంగా జెనీవాలో 1995లో "ప్రపంచ వాణిజ్య సంస్థ" ఏర్పాటైంది. ఈ డబ్ల్యు.టి.ఓ. అనేక షరతులతో కూడిన ఒడంబడికల సముదాయం. ఇది 26,000 పేజీల గ్రంథం. దీని తూకం 1.75 క్వింటాళ్ళు, సామాన్యుడి జీవింత ఎంత చిందరవందరగా వుంటుందో, అలాగే ఈ సంస్థలో పదాలు, విషయాలు సామాన్యుడికి అర్థంకానే కావు. అందుకే W.T.O లో ప్రస్తావనకు వస్తున్న పదాలు తెలుసుకొందాం.

**బిల్టేవెన్ ఎజెండా :**

గ్యాట్ ఒప్పందంలో కుదిరిన అంశాలపై మళ్ళీ చర్చలు జరపడాన్ని బిల్టేవెన్ ఎజెండా అంటారు. దీని ప్రకారం వ్యవసాయ రంగానికి ఇస్తున్న రాయతీలపై చర్చలు వుంటాయి.

**కైర్న్స్‌గ్రూప్ :**

వ్యవసాయ వాణిజ్యంలో అత్యధిక సరళీకరణను క్రమబద్ధంగా జరపాలని కోరుకున్న 15 దేశాల సముదాయం. ఈ గ్రూప్ ఆస్ట్రేలియాలోని కైర్న్స్‌లో ఏర్పడింది.

**టారిఫ్ పీక్ :**

కొన్ని ఉత్పాదనలపై అత్యధిక టారిఫ్ విధింపు, ముడి సరకులపై తక్కువ టారిఫ్, దీని ద్వారా జరుగుతుంది.

**ఎ.టి.సి. (అగ్రిమెంట్ ఆన్ టెక్స్‌టైల్ అండ్ క్లాతింగ్ 1994) :**

అభివృద్ధి చెందిన దేశాల్లో జౌళి వస్త్రాల దిగుమతిపై ఆంక్షల తొలగింపు కోసం 10 సంవత్సరాలలో అమలు కావలసిన ఒప్పందం. ఇందులో మొదటి దశగా 1995 జనవరి 1 నుంచి 16 శాతం జౌళీ ఉత్పాదనలను కోటా నుంచి తొలగించాలి. 1998లో 2002లో తిరిగి 16 శాతం కోటా తొలగింపు జరగాలి.

**మోడ్స్ ఆఫ్ సప్లై ఆఫ్ సర్వీసెస్ :**

సేవలను అందుబాటులోకి తెచ్చే వివిధ విధానాలు. మొదటి పద్ధతి - ఒక దేశం నుంచి మరొక దేశానికి సేవల అందుబాటు. రెండవ పద్ధతి - ఒక దేశానికి చెందిన కంపెనీ మరో దేశంలో శాఖను ఏర్పాటు చేయడం. మూడో పద్ధతి - ఒక దేశానికి చెందిన ప్రజలు మరో దేశానికి సేవలందించేందుకు (పనికి) వెళ్ళటం. నాల్గో పద్ధతి - ఒక దేశంలో మరో దేశపు సేవల ఉపయోగం. ఉదా : టూరిజం.

**ట్రిమ్స్ (ట్రేడ్ రిలేటెడ్ ఇన్‌వెస్ట్‌మెంట్ మేజర్స్) :**

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ప్రోత్సహించేందుకు మరో దేశం ఆహ్వానించవచ్చు.

**ట్రిప్స్ (మేథో హక్కుల ఒప్పందం) :**

దీని పరిధిలోకి పేటెంట్లు ట్రేడ్ మార్కులు వస్తాయి. దీనివల్ల పేద దేశాలు మరింతగా దిగజారిపోతాయి.

**యాంటి డంపింగ్ డ్యూటీస్ :**

మామూలు ధరకన్నా తక్కువ రేటులో ఏదైనా ఉత్పత్తిని దిగుమతి చేసుకోవడంవల్ల తమ దేశ ఉత్పత్తులకు నష్టం వాటిల్లే స్థితిలో ఆదేశాలు విదేశీ వస్తువులపై యాంటీ డంపింగ్ డ్యూటీస్ క్రింద సుంకాలు పెంచవచ్చు.

**సబ్సిడీలు, కౌంటర్ వెయిలింగ్ డ్యూటీలు :**

కొన్ని ఎగుమతులను ప్రోత్సహించేందుకు సబ్సిడీలను ఇవ్వడానికి ఇది వీలు కల్పిస్తుంది. అయితే ఇలాంటి వాటిపై దిగుమతి చేసుకునే దేశాలు కౌంటర్ వెయిలింగ్ సుంకం విధించవచ్చు.

**టెక్నికల్ బారియర్ టు ట్రేడ్ :**

వాణిజ్యానికి సాంకేతిక, చట్టపరమైన అవరోధాల ఒప్పందం. ఉత్పాదనల నాణ్యత, ఆరోగ్య, పారిశుద్ధ్య నిబంధనల పేరిట ధనిక దేశాలు వర్ధమాన దేశాల ఉత్పత్తుల్ని తమ దేశాల్లోకి రాకుండా అడ్డుకొనే ప్రమాదం వుంది.

**ఎ.ఎం.ఎస్. (అగ్రి గ్రేట్ మెజర్‌మెంట్ ఆఫ్ సపోర్ట్) :**

ఇందు వ్యవసాయ రంగానికి ఇస్తున్న సబ్సిడీలు, వ్యవసాయ ఉత్పాదనలపై వచ్చే సబ్సిడీలు ఉంటాయి. మొదటివి సాధారణ సబ్సిడీలు కాగా, రెండోది ప్రత్యేక పంటలపై సబ్సిడీలు. వర్ధమాన దేశాల్లో ఈ మొత్తం సబ్సిడీలు ఉత్పత్తులపై 10 శాతం, ధనిక దేశాల్లో 5 శాతం ఎ.ఎం.ఎస్. ఉంటే 2004 నాటికి దానినిక్రమంగా 13, 20 శాతం

తగ్గింపు సాధించాలి. ఇలాంటి ఒప్పందాలు, పదాలు W.T.O లో చాలా వున్నాయి.

**ప్రపంచ వాణిజ్య సంస్థ లక్ష్యాలు !**

ప్రపంచ దేశాల మధ్య వ్యాపార లావాదేవీలు సక్రమంగా జరగడానికి, వ్యాపార విషయమై సంస్థ సభ్య దేశాల మధ్య వివాదాలు వస్తే పరిష్కరించడం, ఉదారవాద వాతావరణాన్ని ఏర్పరచి ప్రపంచ దేశాల సమగ్ర వ్యాపార లావాదేవీల అభివృద్ధికి పాటు పడటమే డబ్ల్యు.టి.ఓ. లక్ష్యం అంటున్నారు. కాని ప్రపంచ వాణిజ్యసంస్థ పేద దేశాల అభివృద్ధికి అవరోధమని, దేశాల సార్వభౌమాధికారాన్ని కాలరాస్తుందని, పర్యావరణాన్ని ధ్వంసం చేస్తుందని, దేశాల మధ్య, ప్రజల మధ్య అసమానతలను పెంచుతోందని, శ్రామికులను, మానవ హక్కులను అణచి వేస్తుందని, ఇది బహుళ జాతి సంస్థల ప్రయోజనాలను కాపాడే సంస్థ అని పేద దేశాలు, పత్రికలు మరియు నిపుణులు విమర్శిస్తున్నారు. ఈ సందర్భంగా డబ్ల్యు.టి.ఓ. ఒప్పందాలలోని లోపాలు పరిశీలిద్దాం !

**వ్యవసాయ రంగానికి తీరని దెబ్బ !**

గ్యాట్ పుట్టినప్పటి నుండి వస్తువుల వాణిజ్యానికే అది పరిమితమయినది. కాని మొదటిసారిగా డబ్ల్యు.టి.ఓ.లో వ్యవసాయ రంగాన్ని చేర్చడం వల్ల వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా కొనసాగిస్తున్న వర్ధమాన దేశాల వ్యవసాయ రంగం ఉనికికే ప్రమాదం పొంచి వుందని చెప్పవచ్చు. ఈ ఒప్పందం ప్రకారం డబ్ల్యుటి.ఓ.లో వాగ్దానం చేసిన దానికంటే ఎక్కువ రాయితీలు వ్యవసాయ రంగానికి ఇవ్వరాదు. ఈ సంస్థలోని దేశాలకు అవసరమున్నా లేకున్నా ఇతర దేశాల వ్యవసాయ ఉత్పత్తులు, వస్తువులను దిగుమతికి అనుమతించాలి. దిగుమతులకు స్వేచ్ఛ కల్పించడం కోసం సుంకాలను తగ్గించాలి. 2005 తర్వాత అభివృద్ధి చెందుతున్న దేశాలు వ్యవసాయోత్పత్తుల దిగుమతులపై నిషేధం విధించరాదు. 1987-88 నాటి దేశపు ఆహారోత్పత్తిలో 0.4 శాతం నుండి 2003 నాటికి 3 శాతం ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకోవాలి. దానిలో భాగంగా మన దేశంలోనికి బర్మా నుండి పప్పుధాన్యాలు, మలేషియా నుండి పామాయిల్ మరియు ఇతర దేశాల నుండి చెక్కెర, పాలపొడి, గోధుమల దిగుమతి అయ్యాయి. ఈ విషయంపై మన ప్రభుత్వాన్ని ముఖ్యంగా వామపక్షాలు, రైతులు నిలదిస్తే, ప్రభుత్వ నేతలు వాణిజ్యపంటలు పండించమంటున్నారు. మరి అందరూ వాణిజ్య పంటలు పండిస్తే గిట్టుబాటు ధర వుందా అంటే అది లేదు? వ్యవసాయ భూములన్నీ రొయ్యల గుంటలు లాంటి వాణిజ్య భూములైతే దేశంలోని ప్రజలకు ఆహారం ఎక్కడ నుంచి వస్తుంది? ఈ ఒప్పందం ద్వారా వ్యవసాయ రంగంలో బహుళజాతి సంస్థలు, కార్పోరేట్ సంస్థలు ప్రవేశిస్తున్నాయి. వీరు ముందుగానే నాణ్యత ప్రాతిపదికపై ధర ఇవ్వడానికి రైతులతో ఒప్పందం చేసుకొంటున్నారు. లేవిడి భూముల్ని దీర్ఘకాల ప్రాతిపదికపై లీజుకు తీసుకొని సాగుచేస్తున్నారు. ఈ రెండు పద్ధతుల వల్ల రైతులు భూములపై హక్కులు కోల్పోనున్నారు. తమ భూముల్లో తామే కూలీలుగా మారిపోతున్నారు. ఆధునిక బయో టెక్నాలజీ, సబ్సిడీల కారణంగా అనేక దేశాలు ఉత్పాదకతలో మనకన్నా ముందంజలో వున్నాయి. ప్రపంచంలో గోధుమలో 43, ధాన్యం 41, మొక్కజొన్న 98, పప్పులు 126, చెరకు 35, వేరుశెనగ 70, ప్రత్తిలో 62వ స్థానంలో వున్నాము. మొత్తం మీద ప్రపంచ వ్యవసాయ మార్కెట్‌లో మన వాటా 2 శాతం నుండి 0.6 శాతానికి పడిపోయింది. అలాంటప్పుడు మన రైతులు ఇతర దేశాలకు తాము ఎలా ఎగుమతి చేయగలరో ఆలోచించాలి.

**రాయితీలతో కపటం !**

డబ్ల్యు.టి.ఓ. ఒప్పందం ప్రకారం సభ్యదేశాలు ఈ ఒప్పందంలో చెప్పినదానికంటే ఎక్కువ ఇవ్వరాదు. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో వ్యవసాయానికిస్తున్న రాయితీలలో 1995-2000 సంవత్సరాల నాటికి 13.3 శాతానికి తగ్గించాలి. వ్యవసాయ విస్తరణ, పరిశోధన, వ్యవసాయ భీమా, భూములు సాగుచేయకుండా వుంటే ధనిక దేశాలు ఇచ్చే రాయితీలు రాయితీలు కావట! ఎంత దగా! అమెరికాలో రైతులు ప్రభుత్వం నుంచి 29 విధాలుగా రాయితీలు పొందుతున్నారు. కాని మన దేశంలో రైతులకు రాయితీలు ఇవ్వరాదట. తగ్గించాలట. అంటే వర్ధమాన దేశాల్లోని రైతులు ఇక రాయితీలు పొందలేరు. కాని వాస్తవంగా ధని దేశాల్లో రైతులు పొందే రాయితీలలో వర్ధమాన దేశాల రైతులు ఒక శాతం మాత్రమే పొందుతున్నారు. అందుకే రైతులు దీన్ని వ్యతిరేకించాలి.

**మేధోసంపత్తి హక్కులు :**

డబ్ల్యు.టి.ఓ.లోని మేథోహక్కుల ద్వారా వ్యవసాయ రంగం దెబ్బతినే ప్రమాదం వుంది. పేటెంట్ కాలపరిమితిని 20 ఏళ్ళకు పెంచారు. మొక్కలు, సూక్ష్మక్రిములు, పశుగణం ప్రకృతి ప్రసాదించినవి. కాని వీటిపై పేటెంట్ పొందేందుకు ఈ ఒప్పందం వీలు కల్పిస్తుంది. జీవకణాల్ని పేటెంట్ చేస్తే మన విత్తన పరిశోధనలన్ని ఆగిపోతాయి. నూతన రకాల పైర్లను పండించాలంటే పేటెంట్ పొందిన వారికి ప్రతిఫలం చెల్లించాలి. ఇప్పటికే దేశంలో బహుళజాతి సంస్థలు రైతులతో ఒప్పందం చేసుకొన్నాయి. దాంతో వారందించిన టెర్మినేటర్ విత్తనాలే వాడాలి. ఈ విత్తనాలు ఒకసారి మాత్రమే పంటకు ఉపయోగపడతాయి. అంటే పంటవేసే ప్రతిసారి రైతు డబ్బు చెల్లించి విత్తనాలు కొనాలి. వారు ఎంత చెబితే అంతకు కొనాలి. దాంతో మనం బహుళజాతి కంపెనీలపై ఆధారపడక తప్పదు. ఇది ప్రమాదకరం కాదా?

**జౌళీరంగం :**

ఉరుగ్వే చర్చల ద్వారా జౌళీ దుస్తులపై అగ్రిమెంట్ ఆన్‌టెక్స్‌టైల్ అండ్ క్లోతింగ్ ఒప్పందం జరిగింది. ఇది ధనిక దేశాలకు అనుకూలమైన నిబంధన.

**విదేశీ పెట్టుబడులు :**

దీనికి సంబంధించిన ఒప్పందం ప్రకారం లైసెన్సింగ్, నిషేధాలు, పరిమితులు, పర్యవేక్షణ మొదలైన వాటిని విదేశీ పెట్టుబడులపైన నియంత్రణ చేసే అధికారం ఆయా దేశాల ప్రభుత్వాలకు లేదు. అందుకే దిగుమతులను తగ్గించేందుకు తాము చేపడుతున్న యాంటి డంపింగ్ సుంకం పెంచడానికి వీలుండాలని వర్ధమాన దేశాలు కోరుతున్నాయి.

**ధనిక దేశాల కుట్ర :**

ధనిక దేశాలు పేద దేశాల నుంచి వచ్చే దిగుమతులను నిరుత్సాహ పరిచేందుకు గతంలో సుంకాలు ఎక్కువగా విధించేవి. ఇప్పుడు అది కాకుండా ఆరోగ్య ప్రమాణాల పేరిట, శానిటరీ, ఫైట్ శానిటరీ, నిబంధనల పేరుతో వర్ధమాన దేశాల వ్యవసాయ ఉత్పత్తులను నాణ్యంగా లేవంటూ తిరస్కరిస్తున్నారు. ఈ సాంకేతిక పరమైన నిబంధనల రూపకల్పనలో ఎలాంటి పారదర్శకాలు స్పష్టంగా లేవు. ధనిక దేశాలు తమ ఇష్టం వచ్చిన రీతిలో నిబంధనల్ని రూపొందిస్తున్నాయి. అందుకే ఈ నిబంధనల్లో పారదర్శకత వుండాలి. నిబంధన రూపకల్పనలో వర్ధమాన దేశాలను భాగస్వాములు చేయాలి.

**సేవారంగం :**

ఈ ఒప్పందం ప్రకారం సేవారంగం బహుళజాతి కంపెనీలకు ద్వారాలు తెరచియుంచాలి. ఇందులో భాగంగా ఆర్థిక సంస్థలు, బ్యాంకింగ్ ఇన్సూరెన్స్ రవాణా, టెలికాం, రంగాలు విదేశీ సంస్థల చేతుల్లోకి మారిపోయే ప్రమాదం వుంది.

ఇలా చెప్పుకొంటూ పోతూ వుంటే డబ్ల్యు.టి.ఓ. వల్ల నష్టాలే ఎక్కువ. ముఖ్యంగా వ్యవసాయ రంగానికే కావడం బాధాకరం. మనదేశం తాజాగా 714 వస్తువులు భారత్‌లోకి రావచ్చు అంటూ నియంత్రణలు ఎత్తి వేసారు. ఇక జూన్ నాటికి ఈ వస్తువులు భారత్‌కు రానున్నాయి. దాంతో మనదేశ ఉత్పత్తుల అమ్మకాలు తగ్గిపోయే ప్రమాదం వుంది. **ఏది ఏమైనా డబ్ల్యు.టి.ఓ. ఒప్పందం వర్ధమాన దేశాలకు కంట్లో నలుసే!**

# అవినీతిపై అంకుశం

## లంచాలు వాపసు యిచ్చిన యం.ఇ.ఒ.

లంచాలు తీసుకోవడాన్ని గూర్చి విన్నాం.తీసుకోకుండా ఉండాలని ఆశిస్తున్నాం. కాని తీసుకున్న లంచాన్ని కక్కించిన ఘనత మహబూబ్‌నగర్ జిల్లా వెలుదండ యు.టి.యఫ్. మండల శాఖది. లంచాల సొమ్ము వాపసు యిచ్చిన హుందాతనం యాదయ్యగారిది.

మహబూబ్‌నగర్ జిల్లా వెల్దండ మండలంలో చాలాకాలంగా శ్రీ పి. యాదయ్య గారు యం.ఇ.ఒ.గా పనిచేస్తున్నారు. ఉపాధ్యాయ వృత్తిలో పనిచేసిన వారు యం.ఇ.ఒ.లైతే మన డిపార్ట్‌మెంటు ప్రతిష్ఠ పెరుగుతుందని, ఉపాధ్యాయులు ఆత్మగౌరవంతో పనిచేయడానికి వీరు తోడ్పతారని ఆశించాం. అందుకే ఎన్నో పోరాటాలు చేసి ఈ విజయం సాధించాం.

కాని పదవిలో చేరగానే పదవి బుద్ధులు వస్తాయి కాని పాత బుద్ధులుండవని ఋజువు చేస్తూ ఉపాధ్యాయులను జలగల్లా పీడిస్తూ, యిన్స్‌పెక్షన్‌కు, విజిట్లకు, ప్రతి పనికి రేట్లు నిర్ణయిస్తూ ఈ పోస్టు ప్రతిష్ఠ దిగజారుస్తున్న యం.ఇ.లు కొందరు తయారయ్యారు. వీరి సంఖ్య తక్కువే అయినా మొత్తం వ్యవస్థకే కళంకం తెస్తున్నారు. అనేక జిల్లాలలో వీరిపై పోరాటాలు ప్రారంభమయ్యాయి.

ఆ కోవలో వెల్దండ యు.టి.ఎఫ్. శాఖ యం.ఇ.ఒ. గారు తీసికొన్న దాదాపు రూ. 2000/-లు లంచాన్ని వాపసు యివ్వాలని కరపత్రం వేసి, ధర్నా నిర్వహించారు.

యాదయ్యగారు కూడ బెట్టుకుపోకుండా హుందాగా వారి పొరపాటు, తెలుసుకొని, మొత్తం లంచం వాపసు యిచ్చారు. తప్పు చేయడం మానవ సహజం. దానిని తెలుసుకొని సరి చేసుకోవడం అభినందనీయం.

స్వల్ప ప్రయోజనాలకు ఆశపడి, లేదా అక్రమాల రక్షణకు కక్కుర్తిపడి లంచాలు ఈయడం కూడ నేరమే. ఉపాధ్యాయ వృత్తి గౌరవాన్ని కించపరచడమే. ఉపాధ్యాయులు కూడా ఈ అలవాట్లకు, ఉదారవాదానికి స్వస్తి చెప్పాలి. వెల్దండ ఉపాధ్యాయుల్లాగా అవినీతిపై పోరాటానికి ముందుకు రావాలి. ఉపాధ్యాయుల్లారా! అవినీతిపై శంఖారావం పూరించండి ! జాతికి మార్గం చూపండి !!

## ఉపాధ్యాయుల పని విధానంపై పిల్లలచే విశ్లేషింప చేస్తామన్న ముఖ్యమంత్రి ప్రకటనకు యు.టి.యఫ్. ఖండన

అనంతపురం జిల్లా గూగూరు గ్రామంలో 1985లో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ప్రారంభించారు. అప్పటినుండి ఆ పాఠశాలలో లెక్కల టీచర్ పోస్టులేదు. అయినా గత 15 సం॥ల నుండి 10వ తరగతి పరీక్షలకు పిల్లలను పంపిస్తున్నారు. గత సంవత్సరం ఈ పాఠశాలకు 10వ తరగతిలో 20% రిజల్ట్సు రాగా ఈ సంవత్సరం 40% రిజల్ట్సు వచ్చింది.

ఈ నెల 7వ తేదీ ఆ గ్రామంలో జన్మభూమి సభ జరిగింది. ఆ సభలో ఉన్నత పాఠశాల అభివృద్ధిని గురించి ప్రధానోపాధ్యాయుని ప్రశ్నఇంచిన ముఖ్యమంత్రి గారు లెక్కల టీచరు లేకపోయినా ప్రత్యామ్నాయ ఏర్పాటు చేసి లెక్కలు చెప్పించటం ద్వారా 10వ తరగతి ఉత్తీర్ణత పెంచుతున్నర ప్రధానోపాధ్యాయుని అభినందించటానికి బదులు సభలోనే కించ పరిచారు. దానికి తోడు 6వ తరగతిలో బడి మానివేసిన విద్యార్థిని పిలిచి బడికి ఎందుకు మానివేశావని ప్రశ్నించారు. ఆ విద్యార్థి తనకు ఒక ఉపాధ్యాయుడు సరిగ్గా చదువు చెప్పలేదని ఫిర్యాదు చేశాడు. ఆ ఉపాధ్యాయుడు వెంటనే సంజాయిషీ ఇచ్చాడు. తాను 7, 8, 9 తరగతులకే బోధిస్తానని, తాను సాంఘిక శాస్త్ర ఉపాధ్యాయుడినని 6వ తరగతిలో అదనపు పీరియడ్లలో లెక్కలు బోధించునని చెప్పాడు. ఈ వాస్తవాలను ఏమాత్రం పరిగణనలోనికి తీసికొనకుండా ముఖ్యమంత్రిగారు తన హుందాతనాన్ని కూడ మరచి ఇకపై ఉపాధ్యాయుల పనితీరును ప్రతినెలా విద్యార్థులచే విశ్లేషింప చేస్తామని ప్రకటించటం బాధ్యతా రాహిత్యము.

గత 15 సం॥లుగా పోస్టు మంజూరు చేయని నేరానికి ముఖ్యమంత్రి గారు ప్రజలకు విచారం తెలియజేయాలి గాని లేని పోస్టు బరువు మోస్తున్నందుకు ఉపాధ్యాయుల తలవంచుకు వలసిన అవసరం లేదు. ప్రభుత్వ తప్పిదాలను కప్పిపుచ్చుకోవటానికి అధికారులపై నిరాధారమైన ఆరోపణలు చేయటం అనేక జన్మభూములలో సర్వసాధారణమైంది. ఇది ఉపాధ్యాయుల ఉద్యోగుల ఆత్మ గౌరవాన్ని దెబ్బ తీస్తుంది. ఉపాధ్యాయులు, విద్యార్థుల సంబంధం చాలా సున్నితమైనది. ఉపాధ్యాయులపై గౌరవం తగ్గించే ప్రయత్నం ఏమాత్రం జరిగినా అది తీవ్ర అనర్థాలకు దారితీస్తుంది. ఈ సున్నిత విషయాన్ని గమనించకుండా ముఖ్యమంత్రిగారు బహిరంగంగా ఉపాధ్యాయుల గౌరవాన్ని కించపరిచే ప్రకటనలు చేయటం, అందునా విద్యార్థుల తల్లిదండ్రుల ఎదుట దోషిగా నిలబెట్టటాన్ని ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఖండిస్తోంది. దీనికి వ్యతిరేకంగా ఉపాధ్యాయులు అన్ని స్థాయిల్లో పెద్ద ఎత్తున నిరసన తెలియజేయాలని పిలుపు ఇస్తోంది.

## అవినీతి పోరాటం - అడవుల పాలైన నెల్లూరు డి.ఇ.ఒ.

నెల్లూరు జిల్లా విద్యా శాఖాధికారిగా పనిచేసిన శ్రీ కె. జయచంద్రకుమార్ అక్రమంగా, అవినీతి పద్ధతులతో విపరీతంగా బదిలీలు, డెప్యుటేషన్లు చేసిన విషయం పాఠకులకు విదితమే. దానిపై యన్.జి.ఒ.లు, ఉపాధ్యాయులు సంయుక్తంగా జె.ఎ.సి.గా ఏర్పడి పోరాటం చేస్తున్న విషయం కూడ గత సంచికలో ప్రచురించబడినది.

కొన్ని ఉపాధ్యాయ సంఘాల వారు కొమ్ముకాస్తున్నా వత్తాసు యిచ్చినా, ప్రభుత్వంలో వీరిని కాపాడాలని ఒక వర్గం విశ్వప్రయత్నం చేసినా, ప్రజా ఉద్యమ ధాటికి ప్రభుత్వం కూడ తలవంచక తప్పలేదు.

వీరిని అదిలాబాదు జిల్లా, అడవులలోని ఉట్నూరు ఏజన్సీ జిల్లా విద్యాశాఖాధికారిగా బదిలీ చేశారు. సస్పెన్షను చేసి, అవినీతి చర్యలను శిక్షించాల్సి ఉంది. కాని వీరికున్న డబ్బు, పలుకుబడి ఉపయోగించి వీటినుండి తప్పించకోవాలని ప్రయత్నిస్తున్నారు. జె.ఎ.సి. చేస్తున్న పోరాటం కొనసాగుతుంది. అది జయప్రదం అవుతుందని ఆశిస్తున్నాం.

నెల్లూరు జిల్లా పరిషత్ మాజీ ఛైరపర్సన్ శ్రీమతి నాగభూషణమ్మగారి అక్రమ, అవినీతిపై పోరాట జెండా ఎత్తిన యు.టి.యఫ్. నెల్లూరు జిల్లాశాఖ ఎత్తిన జెండా దించకుండా డి.ఇ.ఓ.పై కూడ పోరు చేసి విజయం సాధించినందుకు ఆ జిల్లా శాఖను అభినందిస్తున్నాం. ఈ స్ఫూర్తితో అన్ని జిల్లాలలో, అన్ని స్థాయిలలో అవినీతి పోరాటాలు జరుపాలని కోరుతున్నాం. అయితే ఎంతో బాధ్యతాయుతంగా, నిజాయితీగా ప్లాను ప్రకారం పై శాఖల సలహాలతో ఈ పోరు సాగించాలి.

ఎ.సి.బి.కి అవినీతి చేపలను పట్టించే పనికూడ ప్రారంభించండి.

Estd: 1993

3419296, 3316541, 6667629

# GEETANJALI

## JUNIOR COLLEGE FOR GIRLS
## DEGREE COLLEGE FOR WOMEN
## P.G. COLLEGE

Kanthi Sikhara Complex, Panjagutta, Hyderabad-82

### COURSES OFFERED IN JR. COLLEGE

**M.P.C., Bi.P.C., M.E.C., C.E.C.,**
Both Media with simultaneous EAMCET and BCA Entrace Coaching

### COURSES OFFERED IN DEGREE COLLEGE

**B.Sc.** MPC, MPCs, MSCs, MZC, MBC, GBC, MCCA, MGC E.M. only
**B.Com.**(E/M) & T/M; **B.Com.** (comp)
**B.C.A.**

### POST GRADUATE LEVEL

**M.C.A., M.Sc.,** (Comp. Sceince)
**PGDMISCA**

### Some Salient Features

- Excellent - Teaching Faculty
- Semi Residential Integrated Course (SRIC) for Intermediate
- Simulations Coaching for EAMCET & B.C.A., Entrance Examiantions along with Intermediate Course
- Seperate Building for Inter, Degree and P.G. College.
- Excellent -Computer Labs (Four Labs) with 100 Pentiums with Multimedia and Internet Connections.

**Hostel Facility avaiable in the same campus**

Note : B.Sc., (all groups) classes timings revised to morning session

# యు.టి.యఫ్. నిర్మాత అమరజీవి అప్పారి వెంకటస్వామి గారి సంస్మరణ సభలు

## అవిశ్రాంత యోధుడు, ధన్యజీవి కా॥ వెంకటస్వామి - అమలాపురం సంస్మరణ సభలో వక్తల ఉద్ఘాటన

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శి కా॥ ఎ. వెంకటస్వామి ఆశయాలు, జీవితం, పోరాటం అందరికీ ఆదర్శప్రాయమని, అనుసరణీయమని, ఆయన బాటలో నడవడమే ఆయనకిచ్చే నిజమైన నివాళి అని పలువురు వక్తలు ఉద్ఘాటించారు. తూర్పుగోదావరి జిల్లాశాఖ ఆధ్వర్యంలో అమలాపురం బాలికోన్నత పాఠశాల యందు ఏప్రిల్ 14న జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ జి. చిట్టిబాబు అధ్యక్షతన కామ్రేడ్ ఎ. వెంకటస్వామి సంస్మరణ సభ జరిగింది. వెంకటస్వామిగారి సతీమణి సత్యవతి గారు చిత్రపటాన్ని ఆవిష్కరించి పూలమాలవేసి శ్రద్ధాంజలి ఘటించారు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. నారాయణ ప్రారంభోపన్యాసం చేస్తూ ఈ జిల్లాలో ప్రారంభించిన యు.టి.ఎఫ్. ఉద్యమాన్ని రాష్ట్రమంతటా విస్తరింపచేసి 3వ వంతు ఉపాధ్యాయులు సభ్యులుగాగల అగ్రగామి సంఘంగా తీర్చిదిద్దడంలో ఎ.వి.యస్. కృషి మహత్తరమైనదని, విజయవాడ, హైదరాబాదు, భవన నిర్మాణాలలోను, అన్ని జిల్లాల భవన నిర్మాణాలలోను 1974 నుండి 2000 వరకు జరిగిన అన్ని పోరాటాలలోను, చర్చలలోను, అగ్రిమెంట్లులోను, రీగ్రూపింగ్, పి.ఆర్.సి. ఫిలానఫీలోను, ఐక్య ఉద్యమాల లోను ముఖ్యభూమిక నిర్వహించి ఉపాధ్యాయులకు అనేక హక్కులు రాయితీలు కల్పించి, జీవితాన్ని అంతా సంఘానికి వెచ్చించిన మహానాయకుడని పేర్కొన్నారు. జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం కార్యదర్శి దడాల సుబ్బారావు మాట్లాడుతూ బ్రతకలేని బడిపంతుళ్ళ జీవితాలను నేటి ఉన్నతస్థితికి తీసుకురావడంలో ఎ.వి.యస్. కృషి శ్లాఘనియమని, ఆయన చనిపోయినా ఉద్యమం, సమాజం ఉన్నంతవరకు ఆయన మన మధ్య జీవించి ఉంటారని, ఆశయాలను తుదికంటా ఆచరించి అనేకమందికి ఆదర్శప్రాయుడైనాడని అన్నారు.



యు.టి.ఎఫ్. జిల్లా మాజీ అధ్యక్షులు శ్రీయుతులు పి.బి. ముత్తారావు, టి. వెంకట్రావు, కె. బ్రహ్మాజీరావు, ఎ.వి.యస్. సహచరులు సీనియర్ నాయకులు గుర్రాల శ్రీరామమూర్తి, ఎం. నాగభూషణం, చిక్కం నాగేశ్వరరావు, యు.టి.ఎఫ్. రాష్ట్ర కార్యదర్శి పి. పుల్లయ్య, సిహెచ్. సుభాష్ చంద్రబోస్, జిల్లా ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు తదితరులు మాట్లాడుతూ కా॥ ఎ.వి.యస్. తో తమకు గల అనుబంధాన్ని వివరించారు. ఎ.వి.యస్. జీవితం స్ఫూర్తితో ఉద్యమంలో పనిచేస్తామని పేర్కొన్నారు.

ఎ. వేమవరప్పాడు గ్రామంలో సుదీర్ఘకాలం ఉపాధ్యాయునిగా సేవలందించిన ఎ. వెంకటస్వామి గార్కి స్మృత్యాంజలి పత్రాన్ని గ్రామ వైస్ ప్రెసిడెంట్ ఐ. సూర్యారావు సభలో చదివారు. అనంతరం వెంకటస్వామి గారి కుమారుడు అడ్వకేట్ ఎ. సత్యప్రసాద్ మాట్లాడుతూ వెంకటస్వామి గారి ఆశయాలకు అనుగుణంగా తమ కుటుంబ సభ్యులందరు మెలిగారని, ఇకముందు కూడా ఉద్యమానికి వెన్నంటి ఉంటామని, చివరి దశలో ఆసుపత్రిలో వెంకటస్వామిగార్కి సేవలందించిన జిల్లా కామ్రేడ్స్ కె.జార్జివిక్టర్, కె. సత్తిరాజు, పి. శ్రీనివాసరావు, కె. అప్పారావు, సురేష్, టి. సూర్యనారాయణ, పి. కృష్ణంరాజు కుమార్తె లావణ్యలకు కృతజ్ఞతలు తెలియజేసారు. జిల్లా నలుమూలల నుండి 900 మంది కార్యకర్తలు ఉపాధ్యాయులు హాజరై కా॥ ఎ.వి.యస్.కు ఘనంగా నివాళులర్పించారు.

## అమరజీవి వెంకటస్వామికి మోటూరు జోహార్లు

యు.టి.యఫ్. అగ్రనేత అప్పారి వెంకటస్వామి గారి మృతికి సి.పి.యం. పొలిట్ బ్యూరో సభ్యులు కా॥ మోటూరు హనుమంతరావు తన తీవ్ర సంతాపాన్ని వ్యక్తం చేస్తూ, వారి కుటుంబానికి ప్రగాఢ సానుభూతిని తెలియజేశారు. ఆ మేరకు ఆయన ఒక సంతాప సందేశాన్ని పంపుతూ వెంకటస్వామి గారు తన వయస్సును, ఆరోగ్యాన్ని సైతం లక్ష్య పెట్టకుండా ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌ను ఆంధ్రప్రదేశ్‌లో ఒక అగ్రగామి సంస్థగా నిర్మించడంలో అవిశ్రాంతంగా కృషిచేశారని పేర్కొన్నారు. వెంకటస్వామి మృతి యు.టి.యఫ్.కే గాక పలు ప్రజా ఉద్యమాలకు తీరని నష్టమంటూ ఆయనకు విప్లవ జోహార్లు అర్పించారు.

వెంకటస్వామి గారితో వారికి గల అనుబంధాన్ని గుర్తు చేస్తూ 1969-72 కాలంలో ఉధృతంగా సాగిన ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాలకు తమతోపాటు ఎదురు నిలచి సమైక్య ఆంధ్ర సంరక్షణకు కృషి చేసిన ఉపాధ్యాయ నాయకుడు వెంకటస్వామి అని మోటూరు కొనియాడారు. ఆ నేపథ్యంలోనే 1974 ఆగష్టు 10న ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆవిర్భావానికి నడుంకట్టిన వెంకటస్వామి 1999 వరకు 25 సం॥లపాటు ఆ సంఘానికి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారని, సంఘసేవకై 1979లోనే వాలంటరీ రిటైర్మెంట్ తీసుకొన్న త్యాగధనుడని ఆయన శ్లాఘించారు.

సామ్యవాద దృక్పథంతో, శ్రామికవర్గ సంక్షేమ వాదిగా వివిధ ప్రజాతంత్ర ఉద్యమాలకు ఆయన అందించిన సహకారం మరువరానిదని పేర్కొంటూ, ఆయన కుమారుని, కుమార్తెను వర్ణాంతర వివాహములకు ప్రోత్సహించిన సంస్కరణ వాదని కొనియాడారు.

## ఐక్య ఉద్యమాల నిర్మాణంలో దిట్ట కా॥ ఎ.వి.యస్.

### - నల్లగొండ సభలో వక్తల ఉవాచ

యు.టి.ఎఫ్. అగ్రనాయకులు అమరజీవి ఎ.వి.యస్. ఉపాధ్యాయుల ఉమ్మడి సమస్యల పరిష్కార కోసం ఐక్య ఉద్యమాలు నిర్మించడంలో అందెవేసిన చేయని, జీవితాన్నంతా పీడితోపాధ్యాయుల సేవకే అంకితం చేసిన త్యాగమూర్తని, వారి నిరాడంబరత, ఆర్థిక క్రమశిక్షణ అలవరచుకొని, వారు నమ్మిన ఆశయాలను తుదికంటా కొనసాగించడమే వారికి మనమర్పించే నిజమైన నివాళి అని యు.టి.ఎఫ్. రాష్ట్ర కోశాధికారి పి. కృష్ణమూర్తి అన్నారు.

ఏప్రిల్ 13న నల్లగొండ జిల్లాశాఖ ఆధ్వర్యంలో నల్లగొండ పట్టణంలో జిల్లా అధ్యక్షులు వి. జగదీష్‌బాబు అధ్యక్షతన జరిగిన అమరజీవి వెంకటస్వామి సంస్మరణ సభలో ఆయన ప్రధాన వక్తగా ప్రసంగించారు.

జిల్లా సీనియర్ నాయకులు వి. బంగారయ్య, డి. ఓం ప్రకాశ్, పి. సత్యనారాయణ రెడ్డి, యస్. అంజనేయులు, గౌరవాధ్యక్షులు పి. విద్యాసాగర్‌రెడ్డి జిల్లా ప్రధాన కార్యదర్శి ఎ. నర్సిరెడ్డి, ఎ.పి.టి.యఫ్. జిల్లా అధ్యక్షులు డాంగే తదితరులు ప్రసంగిస్తూ కా॥ ఎ.వి.యస్. ఉపాధ్యాయ ఉద్యమానికి చేసిన సేవలను ప్రస్తుతించారు. వారి కుటుంబానికి సానుభూతిని తెలిపారు. యు.టి.ఎఫ్. జిల్లా కార్యదర్శులు, మండల శాఖల బాధ్యులు, కార్యకర్తలు, 200 మందికిపైగా ఉపాధ్యాయులు ఈ సభకు హాజరైనారు.

## ఉద్యమం కోసం ఉద్యోగాన్ని త్యజించిన ధన్యజీవి కా॥ ఎ.వి.యస్.

**- శ్రీ డి. రామిరెడ్డి వ్యాఖ్య**

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆవిర్భావానికి ప్రధాన కారకులు కామ్రేడ్ ఎ.వి.యస్. అని, ఇంకా 14 ఏండ్ల సర్వీస్ మిగిలి ఉండగానే, ఉద్యమం కోసం ఉద్యోగాన్ని వదలివేసిన ధన్యజీవి అని, ఉపాధ్యాయ ఉద్యమం కోసం, సమాజ శ్రేయస్సు కొరకు తుది శ్వాసవరకు నిస్వార్థంగా పోరాడిన ఆదర్శమూర్తి కామ్రేడ్ ఎ.వి.యస్. అని యు.టి.ఎఫ్. రాష్ట్ర గౌరవాధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి వ్యాఖ్యానించారు.

ఏప్రిల్ 4న ప్రకాశం జిల్లాశాఖ ఆధ్వర్యంలో ఒంగోలులో జి. శేషయ్య అధ్యక్షతన జరిగిన అమరజీవి వెంకటస్వామి సంస్మరణ సభలో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. కా॥ రామిరెడ్డి, సంఘం ఆవిర్భవించిన నాటి నుండి చివరి వరకు కా॥ ఎ.వి.యస్.తో సుదీర్ఘకాలంపాటు కలిసి పనిచేసిన ఉద్యమ అనుభవాలను స్ఫూర్తిదాయకంగా వివరించారు. తమ జీవితాలను క్రొవ్వొత్తులుగా కరిగించి, పీడితోపాధ్యాయుల జీవితాల్లో వెలుగు నింపిన ఉపాధ్యాయ నాయకులలో కామ్రేడ్ ఎ.వి.యస్. ఒకరని, వారి లక్ష్య సాధనకు కృషి చేయడమే వారికి మనం అర్పించే ఘనమైన నివాళి అని శ్రీ రామిరెడ్డి అన్నారు.

జిల్లా వార్తలు ప్రధాన సంపాదకులు యం. పానకాలరావు ప్రధాన వక్తగా ఎ.వి.యస్. జీవిత విశేషాలను వివరిస్తూ ఎ.వి.యస్. జీవితం అంటే యు.టి.ఎఫ్. ఉద్యమ చరిత్రేనని పేర్కొన్నారు. మంచి క్రమశిక్షణ, మృదుభాష్యము, నిరాడంబరత ఎ.వి.యస్. గారి ఆదర్శాలని మనం వాటిని అలవరుచుకోవాలన్నారు. సభలో జిల్లా ప్రధాన కార్యదర్శి కె. ఆదినారాయణ, జిల్లా కార్యదర్శి కె. వెంకటరావు, రాష్ట్ర కౌన్సిలర్ డి. లక్ష్మిరెడ్డి, జిల్లానాయకులు టి. నారాయణరావు, షేక్ షంషుద్దీన్, షేక్ గౌస్ భాషా, పి. నాగేశ్వరరావులు ప్రసంగించినారు. కా॥ వెంకటస్వామికి నివాళులర్పించారు.

తొలుత రామిరెడ్డి ఎ.వి.యస్. చిత్రపటానికి పూలమాల వేసి శ్రద్ధాంజలి ఘటించారు.

### విజయనగరం జిల్లా

ఏప్రిల్ 8న విజయగనరం సి.పి.ఐ. కార్యాలయం అమర్‌భవన్‌లో శ్రీ డి. రాము అధ్యక్షతన అమరజీవి ఎ. వెంకటస్వామి గారి సంస్మరణ సభ జరిగింది.

తొలుత వెంకటస్వామి గారి మృతికి సమావేశం సంతాపం తెలియజేసింది. అనంతరం సీనియర్ కార్యకర్త శ్రీ ఎం. రామ్మూర్తి పంతులు వెంకటస్వామి గారి చిత్రపటానికి పూలమాల వేశారు. హాజరైన ప్రముఖులు, ఉపాధ్యాయులు చిత్రపటానికి పుష్పాలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు.

ఈ సభలో ఎ.పి.యు.ఎస్. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ యు.ఎ. నర్సింహం, జె.వి.వి. రాష్ట్ర నాయకులు శ్రీ ఎన్. దామోదరరావు, సి.పి.ఎం. జిల్లా కార్యదర్శి శ్రీ ఎం. కృష్ణమూర్తి, సి.ఐ.టి.యు. జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. శ్రీనివాస్, ఎ.ఐ.టి.యు.సి. జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ వి. కృష్ణంరాజు, యస్.టి.యు. జిల్లా అధ్యక్షులు శ్రీ ఎస్. సత్యనారాయణమూర్తి, ఎ.పి.పి.ఆర్.ఎం. ఉద్యోగులు సంఘం జిల్లా అధ్యక్షులు శ్రీ గంట వెంకటరావు, ఎస్.ఎఫ్.ఐ. జిల్లా కార్యదర్శి శ్రీ జి. శ్రీనివాస్, ఎ.పి.యు.ఎస్. జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ డి. సర్వేశ్వరరావు, యు.టి.ఎఫ్. జిల్లా గౌరవాధ్యక్షులు శ్రీ ఎం. మురళీధరరావు, యు.టి.ఎఫ్. జిల్లా సహాధ్యక్షులు శ్రీ ఎస్. అప్పలరాజు తదితరులు పాల్గొని ప్రసంగిస్తూ కా॥ వెంకటస్వామి సేవలను కొనియాడారు.

శ్రీ పల్లి తిరుపతిరావు, శ్రీ సిహెచ్. కన్నాజీరావు, శ్రీ జి. భాస్కరరావులు వెంకటస్వామి గారిపై వ్రాసిన కవితలు చదివి వినిపించారు. ఎ. వెంకటస్వామి ఆశయాలు సాధిస్తామని సభికులంతా నినదించారు.

### విశాఖ జిల్లా

విశాఖ జిల్లా యు.టి.ఎఫ్. ఆధ్వర్యంలో ఏప్రిల్ 15న కా॥ వెంకటస్వామి సంస్మరణ సభ జిల్లా యు.టి.ఎఫ్. కార్యాలయంలో కె. శుభాకరరావు అధ్యక్షతన జరిగింది.

యు.టి.ఎఫ్. రాష్ట్ర కార్యదర్శి బి. మోహనరావు ముఖ్య అతిథిగా హాజరై ఎ.వి.యస్. జీవిత విశేషాలను, ఉపాధ్యాయ ఉద్యమానికి చేసిన సేవలను వివరించారు. ఎ.పి.టి.ఎఫ్.(హెచ్) విశాఖ జిల్లా సీనియర్ నాయకులు జె. శంకర్‌రావు, జె.సి.టి.ఎ. కో-కన్వీనర్ వై. దేముడు, యు.టి.ఎఫ్.జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం. రామసుబ్బారెడ్డి, కె.యస్.ఆర్. మూర్తి తదితరులు ప్రసంగిస్తూ ఎ.వి.యస్. కుటుంబానికి సానుభూతిని ప్రకటించారు.

### చిత్తూరు జిల్లా

ఏప్రిల్ 11న చిత్తూరు జిల్లా శాఖ ఆధ్వర్యంలో ఎం. జయరామనాయుడు అధ్యక్షతన అమరజీవి వెంకటస్వామి సంస్మరణ సభ నిర్వహించబడింది.

ఉపాధ్యాయ ఉద్యమం కొనసాగినంతకాలం కామ్రేడ్ వెంకటస్వామి జీవించే వుంటారని, సమాజానికి తన జీవితాన్ని అంకితం చేసిన మహామనిషి, నిరంతర పఠనాశీలి, నైతిక విలువలు కలిగిన నాయకుడు, ఉపాధ్యాయ ఉద్యమంలో యు.టి.ఎఫ్.ను అగ్రగామిగా నిల్పిన మహానాయకుడు కామ్రేడ్ ఎ.వి.యస్. అని, ఎ.వి.యస్. మరణం అన్నీ ఉపాధ్యాయ సంఘాలకు, ప్రజా సంఘాలకు తీరనలోటని

చిత్తూరులో జరిగిన కా॥ ఎ.వి.యస్. సంస్మరణ సభలో పలువురు వక్తలు అభివర్ణించారు.

ఈ సభలో యు.టి.ఎఫ్. రాష్ట్ర కార్యదర్శి యన్. ఆనందనాయుడు, జిల్లా మాజీ అధ్యక్షుడు గురుస్వామినాయుడు, కె. అర్ముగంపిళ్ళై, జె.వి.వి. నాయకులు ఎ.జి. యతిరాజులు, ఎ.పి.టి.యఫ్. నాయకులు వి. జయరామిరెడ్డి, ఎస్.టి.యు. నాయకులు మోహన్, యు.టి.ఎఫ్. జిల్లా ప్రధాన కార్యదర్శి వై. శ్రీనివాసులురెడ్డి, జిల్లా గౌరవాధ్యక్షులు ఎన్. సోమచంద్రారెడ్డి, నాయకులు యస్. వీరాస్వామి, వి. చంద్రారెడ్డి, కె. రామచంద్రారెడ్డి, తదితరులు ప్రసంగిస్తూ ఎ.వి.యస్.కు శ్రద్ధాంజలి ఘటించారు.

## శ్రీకాకుళం జిల్లా

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ శ్రీకాకుళం జిల్లాశాఖ ఆధ్వర్యంలో కా॥ ఎ. వెంకటస్వామి సంతాపసభ జిల్లా అధ్యక్షులు జి. అప్పారావు అధ్యక్షతన జరిగింది. తొలుత రాష్ట్ర కార్యదర్శి బొడ్డేపల్లి మోహన్‌రావు కా॥ ఎ.వి.యస్. చిత్రపటానికి పూలమాలవేసి శ్రద్ధాంజలి ఘటించారు. జిల్లా కార్యదర్శి వర్గ సభ్యులు జి. రామలక్ష్మి ప్రసూనాంబ తదితరులు పాల్గొని దివంగత నేతకు నివాళులర్పించారు.

## మెదక్ జిల్లా

యు.టి.ఎఫ్. మెదక్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 7న సంగారెడ్డిలో కా॥ ఎ.వి.యస్. సంస్మరణ సభ నిర్వహించబడింది. జిల్లా అధ్యక్షులు రియాజ్ అహ్మద్‌ఖాన్ అధ్యక్షత వహించగా, ప్రధాన కార్యదర్శి పి. కృష్ణమూర్తి ఉపాధ్యాయ ఉద్యమానికి కా॥ ఎ.వి.యస్. చేసిన సేవలను వివరించారు. ప్రతి కార్యకర్త ఎ.వి.యస్.ను ఆదర్శంగా తీసుకొని ఆయన చూపిన బాటలో పయనించడమే మనం ఆయన కర్పించే నిజమైన నివాళి అని సభలో ప్రసంగించిన వక్తలు అభిప్రాయపడ్డారు.

ఈ సభలో యు.టి.ఎఫ్. జిల్లా నాయకులు నారాయణరావు, ప్రజాశక్తి బాధ్యులు రుక్మారెడ్డి, గోపాల్ అంజిబాబు, ఎస్.ఎఫ్.ఐ. జిల్లా నాయకులు ప్రసాద్, తదితరులు పాల్గొని ప్రసంగించారు.

## కర్నూలు జిల్లాలో

ఏప్రిల్ 14న కర్నూలు జిల్లా శాఖ ఆధ్వర్యంలో కర్నూలు నగరంలో కామ్రేడ్ ఎ.వి.యస్. సంస్మరణ సభ జిల్లా అధ్యక్షులు ఎన్. నర్సింహులు అధ్యక్షతన జరిగింది. రాష్ట్ర కార్యదర్శి వై. రంగారెడ్డి, జిల్లా సీనియర్ నాయకులు జి. గోవిందరావు, ఎన్. నర్సప్ప, జి. పుల్లయ్య, ఎ. చెన్నకేశవరెడ్డి, యం. రంగస్వామి, తదితరులు ప్రసంగిస్తూ ఉపాధ్యాయ ఉద్యమానికి కామ్రేడ్ ఎ.వి.యస్. చేసిన సేవలను శ్లాఘించారు. వారి మరణం సంఘానికి, సమాజానికి తీరని లోటని అన్నారు. ఇంకా ఈ సభలో సి.ఐ.టి.యు. జిల్లా కార్యదర్శి టి. షడ్రక్, ఎ.పి.యన్.జి.ఓ.ల జిల్లా అధ్యక్షులు ఎస్. ప్రభుదాస్, జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం.ఎ. బేగ్, తదితరులు ప్రసంగిస్తూ అమరజీవికి ఘనంగా నివాళులర్పించారు. చివరగా విచ్చేసిన రాష్ట్ర గౌరవాధ్యక్షులు గత 3 దశాబ్దాలుగా కా॥ ఎ.వి.యస్.తో తనకుగల సహచర్యాన్ని, ఎ.వి.యస్. నిరాడంబరత, ఆశయనిబద్ధత, తదితర విషయాలను స్ఫూర్తిదాయకంగా వివరించి, కా॥ స్వామి ఆశయాలను అవగాహన చేసుకొని యు.టి.ఎఫ్.ను మరింత బలోపేతమైన సంస్థగా తీర్చిదిద్దడమే మనముందున్న కర్తవ్యమని తెలిపినారు.

## భద్రాచలంలో

ఖమ్మం జిల్లా భద్రాచలంలో ఏప్రిల్ 10న అమరజీవి వెంకటస్వామి వర్ధంతి సభ ప్రాంతీయ కార్యాలయం ఆధ్వర్యంలో నిర్వహించబడింది. జిల్లా సహాధ్యక్షుడు ఇరపా జగపతిరావు అధ్యక్షతన జరిగిన ఈ సభలో జిల్లా సీనియర్ నాయకులు వి.ఎల్. నరసింహారావు ప్రధాన వక్తగా ప్రసంగిస్తూ కా॥ ఎ.వి.యస్. ఉద్యమ జీవితాన్ని కళ్ళకు కట్టినట్లుగా వివరించారు.

కామ్రేడ్ ఎ.వి.యస్. క్రమశిక్షణను, త్యాగనిరతిని నిరాడంబర జీవితాన్ని ప్రతి కార్యకర్త అలవరచుకొని ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలని పిలుపునిచ్చారు.

ఈ సభలో జిల్లా కార్యదర్శులు బి. నర్సింహారావు, జి. గోపాలకృష్ణ, సీనియర్ నాయకులు పి. లక్ష్మినారాయణ, యస్.వి. రామిరెడ్డి, బందు వెంకటేశ్వరరావు, కె. మోహనరావు, తదితరులు పాల్గొని ప్రసంగించగా, భద్రాచలం డివిజన్ పరిధిలోని 8 మండలాలు, మరియు బూర్గంపాడు, కుక్కునూరు తదితర మండలాల బాధ్యులు, కార్యకర్తలు 200 మందికి పైగా ఈ కార్యక్రమంలో పాల్గొని ఎ.వి.యస్.కు ఘనంగా నివాళులర్పించారు.

## కనిగిరిలో

ప్రకాశంజిల్లా కనిగిరి యు.టి.ఎఫ్. కార్యాలయంలో, కనిగిరి, పామూరు, పి.సి. పల్లి, హెచ్.ఎం.పాడు, వెలిగండ్ల, సి.యస్.పురం మండలశాఖల ఆధ్వర్యంలో కా॥ ఎ.వి.యస్. సంస్మరణ సభ ఏప్రిల్ 26న యస్. అచ్చిరెడ్డి అధ్యక్షతన జరిగింది.

జిల్లా శాఖ అధ్యక్షులు జి. శేషయ్య ముఖ్య అతిథిగా విచ్చేసి ప్రసంగిస్తూ వెంకటస్వామి గారి త్యాగాలను, సంఘం అభివృద్ధికి వారు చేసిన కృషిని వివరించారు. ఉపాధ్యాయులందరికే కా॥ ఎ.వి.యస్. చిరస్మరణీయుడని ఆయన అన్నారు.

జిల్లా కార్యదర్శులు విలియం, ఓ.వి. వీరారెడ్డి, ఎం. వెంకటేశ్వరరెడ్డి, రాష్ట్ర కౌన్సిలర్ వి. మాలకొండారెడ్డి, డి. లక్ష్మిరెడ్డి, ఎన్.జి.ఓ. అధ్యక్షులు శివరామిరెడ్డి, వెలగండ్ల ప్రధానోపాధ్యాయులు లక్ష్మినారాయణ తదితరులు ప్రసంగిస్తూ సమైక్య ఆంధ్ర కోసం నిలబడి సంఘాన్ని స్థాపించి 25 సం॥ల పాటు ప్రధాన కార్యదర్శిగా, తుది శ్వాస వరకు పత్రిక ప్రధాన సంపాదకునిగా సేవలందించిన ధన్యజీవిగా కొనియాడారు.

డైరీని, జి.ఓ.ల సంపుటాలను, ఎస్.ఎస్.సి. 7వ తరగతి టెస్ట్ పేపర్లను ముద్రించడంలో కూడా కా॥ ఎ.వి.యస్. ముఖ్యభూమిక నిర్వహించారని, వారి ఆశయాల కనుగుణంగా మన సంఘాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలని పేర్కొంటూ ఘనంగా నివాళులర్పించారు.

## పొదలకూరులో

నెల్లూరు జిల్లా పొదలకూరులో రాష్ట్ర యు.టి.ఎఫ్. వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శి స్వర్గీయ ఎ. వెంకటస్వామి సంతాపసభ మండలశాఖ అధ్యక్షుడు ఎ. మణి ఆధ్వర్యంలో యు.టి.ఎఫ్. భవనంలో జరిగింది. వెంకటస్వామి చిత్రపటానికి యు.టి.ఎఫ్. నాయకులు పూలమాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు. ఈ సందర్భంగా యు.టి.ఎఫ్. జిల్లా అధ్యక్షులు బి. రమణయ్య మాట్లాడుతూ, అన్ని సంఘాలను కలుపుకొని ఐక్య ఉద్యమాలను నడపడంలోనూ, ఆర్థిక పారదర్శకత పాటించడంలోనూ వెంకటస్వామి అందరికీ ఆదర్శంగా ఉండేవారని అన్నారు. ఐక్య ఉద్యమాలకు ఆయన లేని లోటు తీరదని పేర్కొన్నారు. జిల్లా కార్యదర్శి రామూర్తి పొదలకూరు రిటైర్డ్ ఎం.ఇ.ఓ. ఐ.జి. నాయుడు,

యు.టి.ఎఫ్. పొదలకూరు కార్యదర్శి చంద్రశేఖర్‌రావు, చేజర్ల మండల ప్రధాన కార్యదర్శి సుబ్బరత్నంతోపాటు సుమారు 50 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## కొత్తపట్నంలో

ప్రకాశంజిల్లా కొత్త పట్నం మండలశాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 9న ఒంగోలు యు.టి.ఎఫ్. కార్యాలయంలో షేక్ గౌస్ భాషా అధ్యక్షతన కామ్రేడ్ ఎ.వి.యస్. సంస్మరణ సభ జరిగింది. జిల్లా కార్యదర్శి కె. వెంకటరావు ఈ సభకు ప్రధాన వక్తగా హాజరై ఎ.వి.యస్. ఉద్యమ జీవితాన్ని చక్కగా వివరించి కార్యకర్తలను ఉత్తేజితుల్ని చేశారు. మండల నాయకులు సి. రామకృష్ణారావు, యన్.వి. ప్రసాదరావు, సత్యసుధాకర్, పి. లక్ష్మి ఖన్నా, విజయలక్ష్మి, సరోజ తదితరులు పాల్గొని దివంగత నేతకు నివాళులర్పించారు.

## చేర్యాలలో

వరంగల్ జిల్లా చేర్యాలలో ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులు అమరజీవి ఎ.వి.యస్. సంస్మరణ సభ ఏప్రిల్ 20న మండల శాఖ అధ్యక్షులు ఎ. కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగింది. జిల్లా కార్యదర్శి కె. రాజిరెడ్డి ఎ.వి.యస్. చిత్రపటానికి పూలమాలవేసి శ్రద్ధాంజలి ఘటించారు. మండల సీనియర్ నాయకులు కె.యాదవరెడ్డి, కె. రాజయ్య లక్ష్మీనారాయణ, బి. సిద్దిరాజయ్య, మండల ప్రధాన కార్యదర్శి, ఎస్‌డి. మొయిద్దీన్, వి. ప్రభాకర్ తదితరులు పాల్గొని ప్రసంగించి కా॥ ఎ.వి.ఎస్. కు నివాళులర్పించారు. ఈ సందర్భంగా స్థానిక యు.టి.ఎఫ్. నాయకులు బి. రాజయ్య మృతికి సంతాపం ప్రకటించారు.

## మిర్యాలగూడలో

ఏప్రిల్ 20న అమరజీవి అప్పారి వెంకటస్వామి గారి సంస్మరణ సభ మిర్యాలగూడలో నిర్వహించబడింది. ఈ సభకు వి. బంగారయ్య యు.టి.ఎఫ్. జిల్లా మాజీ కార్యదర్శి అధ్యక్షత వహించినారు. రాష్ట్ర కోశాధికారి పి. కృష్ణమూర్తి ఈ సభలో పాల్గొని ప్రసంగిస్తూ యు.టి.యఫ్. ఉద్యమమే కా॥ వెంకటస్వామి జీవితమని వారి ఆశయాలను ముందుకు తీసుకొని పోవడమే మన ముందున్న కర్తవ్యమన్నారు. ఐక్య ఉపాధ్యాయ, పత్రిక సంపాదకవర్గ సభ్యురాలు శ్రీమతి ఎం. సంయుక్త మాట్లాడుతూ ప్రభుత్వ విద్యారంగం మరియు ఇతర రంగములు నిర్వీర్యమౌతున్న తీరును వివరిస్తూ ఈ రంగముల రక్షణ కొరకు ఉద్యమాలను నిర్మించడమే ఎ.వి.యస్.గారికి నిజమైన నివాళులని అన్నారు. జాలకంటి రంగారెడ్డి మాజీ శాసనసభ్యులు (సి.ఐ.టి.యు. జిల్లా అధ్యక్షులు) యు.టి.ఎఫ్. జిల్లా అధ్యక్షులు శ్రీ వి. జగదీష్‌బాబు, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. నర్సిరెడ్డి, రాష్ట్ర కౌన్సిలర్ శ్రీ జగదీష్‌చంద్ర జిల్లా కార్యదర్శి పి. లక్‌పతినాయక్ మండల అధ్యక్ష కార్యదర్శులు శ్రీ కె. సురేందర్‌రెడ్డి, శ్రీ డి. వెంకటొరెడ్డి, శ్రీ సత్యనారాయణరావు, శ్రీ మంగ్లా నాయక్, శ్రీ నర్సింహానాయక్, శ్రీ బి. వెంకయ్య, శ్రీ మధుసూదన్‌రెడ్డి, శ్రీ వెంకటేశ్వర్లు జడ్.పి.హెచ్.ఎస్. బకాల్ వాడి ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. అనంతరెడ్డి గార్లు పాల్గొని ప్రసంగించారు.

ఈ సమావేశానికి మిర్యాలగూడ, వేములపల్లి, త్రిపురారం, దామరచర్ల, నిడమనూర్ మండలాల నుండి 200 మంది ఉపాధ్యాయుని ఉపాధ్యాయులు హాజరైనారు.

## డోన్‌లో

కర్నూలు జిల్లా డోన్ మండలశాఖ ఆధ్వర్యంలో కామ్రేడ్ వెంకటస్వామి సంస్మరణ సభ ఏప్రిల్ 22న మండలశాఖ అధ్యక్షులు పి. శంకరయ్య అధ్యక్షతన జరిగింది. జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు ఎన్. నరసింహులు, ఎం.ఎ. బేగ్, జిల్లా కార్యదర్శి ఎం. నాగేంద్రయ్య హాజరై కామ్రేడ్ ఎ.వి.యస్. ఉపాధ్యాయ ఉద్యమానికి చేసిన సేవలను వివరించి నివాళులర్పించారు. తొలుత సీనియర్ కార్యకర్త టి. హరినాథ్‌బాబు ఎ.వి.యస్. చిత్రపటానికి పూలమాల వేసి శ్రద్ధాంజలి ఘటించారు. మండల బాధ్యులతో పాటు వివిధ ప్రజాసంఘాల నాయకులు హాజరై ఎ.వి.యస్. కుటుంబానికి సానుభూతిని ప్రకటించారు.

## దుగ్గిరాలలో

గుంటూరు జిల్లా దుగ్గిరాల మండలశాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 23న దుగ్గిరాల యు.పి.ఎస్. మరియు సౌత్ ప్రాథమిక పాఠశాలల్లో జార్జిథామస్, పి.ఎం. కొండయ్యల అధ్యక్షతన సంతాపసభలు జరిగాయి. సీనియర్ నాయకులు ఈడ్పుగంటి అప్పారావు, మండల అధ్యక్షులు పి. బసవపున్నయ్య, జిల్లా కార్యదర్శి టి.ఎస్.ఎల్.ఎన్. మల్లేశ్వరరావు, తదితరులు పాల్గొని వెంకటస్వామి గారు ఉపాధ్యాయ ఉద్యమానికి అందించిన సేవలను ప్రస్తుతిస్తూ వారికి జోహార్లర్పించారు.

## సత్తుపల్లిలో

ఖమ్మం జిల్లా సతుపల్లిలో దమ్మపేట, సత్తుపల్లి, వేంసూరు మండల శాఖల ఆధ్వర్యంలో కా॥ ఎ.వి.యస్. సంస్మరణ సభ ఏప్రిల్ 10న జరిగింది. యు.టి.ఎఫ్. జిల్లా కార్యదర్శి కె. నాగేశ్వరరావు అధ్యక్షత వహించగా, జిల్లా గౌరవాధ్యక్షులు ఎస్‌డి. జియావుద్దీన్ ప్రధాన వక్తగా హాజరై ఎ.వి.యస్. జీవిత విశేషాలను, ఉపాధ్యాయ ఉద్యమానికి వారు చేసిన త్యాగాలను, స్ఫూర్తిదాయకంగా వివరించారు. ఆర్థిక క్రమశిక్షణ, నాయకునికి ప్రధానమని నాయకులు, కార్యకర్తలు, కా॥ ఎ.వి.యస్. నుండి ఆర్థిక క్రమశిక్షణను నేర్చుకోవాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో దమ్మపేట మండల అధ్యక్షులు ఎ.యస్. ప్రకాశరావు, సీనియర్ నాయకులు చెంచిరెడ్డి, సత్తుపల్లి మండల అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు ఎస్. రమేష్, సిహెచ్. శ్రీనివాసరావు, వేంసూరు బాధ్యులు ఎస్. కేశవరెడ్డి, వి. సత్యనారాయణరెడ్డి, యు.యస్. ప్రకాశరావు, తదితరులు పాల్గొని ఎ.వి.యస్.కు ఘనంగా నివాళులర్పించారు.

## కొత్తగూడెంలో

ఖమ్మం జిల్లా కొత్తగూడెంలో కొత్తగూడెం పట్టణ, మండల శాఖలు, చంద్రుగొండ, జులూరుపాడు శాఖల ఆధ్వర్యంలో ఏప్రిల్ 6న కామ్రేడ్ వెంకటస్వామి సంస్మరణ సభ జరిగింది. జిల్లా గౌరవాధ్యక్షులు యస్.డి. జియావుద్దీన్, రాష్ట్ర సీనియర్ నాయకులు, జి. లక్ష్మయ్య, జిల్లా సీనియర్ నాయకులు ఆర్. శ్రీరాములు, జిల్లా కార్యదర్శులు జి. భిక్షపతి, యం. నర్సింహారావు, చంద్రుగొండ మండల అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు జి.ఎ. జియాకర్, ఎండి. జైనుల్లాబుద్దీన్, కొత్తగూడెం పట్టణ, అధ్యక్ష, కార్యదర్శులు ఎం. శ్రీనివాసరావు, ఆర్. సురేష్‌బాబు, కొత్తగూడెం మండల అధ్యక్ష, కార్యదర్శులు వాలునాయక్, కె. రాంబాబు, జూలూరుపాడు బాధ్యులు రాధాకృష్ణమూర్తి యస్.వి. రమేష్ తదితరులు పాల్గొని అమరజీవికి ఘనంగా శ్రద్ధాంజలి ఘటించారు.

వక్తలంతా ఉపాధ్యాయ ఉద్యమంలో ఎ.వి.యస్. పాత్రను, ఎ.వి.యస్. నిరాడంబర జీవితాన్ని వివరించి నేటితరం కార్యకర్తలంతా సదావారినే ఆదర్శంగా తీసుకోవాలన్నారు.

# ధన్యజీవి వెంకటస్వామి

## - ఖమ్మం సంస్మరణ సభలో వక్తల ఉవాచ

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ వ్యవస్థాపకులు, 25 సంవత్సరాలపాటు ఆ సంఘానికి రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా పనిచేసి ది. 21.3.2001న అనారోగ్యంతో మరణించిన అమరజీవి అప్పారి వెంకటస్వామి తన యావజ్జీవితాన్ని ఉపాధ్యాయ ఉద్యమానికి అంకితం చేసిన త్యాగమూర్తి, ధన్యజీవి అని యు.టి.యఫ్. రాష్ట్ర మాజి ఉపాధ్యక్షుడు, వెంకటస్వామి సహచరుడు జి. లక్ష్మయ్య అన్నారు. స్థానిక యు.టి.యఫ్. భవన్‌లో ఏప్రిల్ 4న సంఘం జిల్లా గౌరవాధ్యక్షులు జియావుద్దీన్ అధ్యక్షతన జరిగిన వెంకటస్వామి సంస్మరణ సభలో ఆయన మాట్లాడుతూ, ఎప్పుడూ చెదరని చిరునవ్వుతో, సౌమ్య భాషణలతో కనిపించే వెంకటస్వామి క్రమశిక్షణ విషయంలో చాలా కఠినంగా వ్యవహరించేవారని, 1974లో కేవలం వందలోపు సభ్యులతో, ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌ను ప్రారంభించి పాతికేళ్ళలో దాదాపు లక్ష సభ్యత్వంతో, రాష్ట్రంలోని ఉపాధ్యాయ సంఘాలన్నిటిలో అతి పెద్ద సంఘంగా తీర్చిదిద్దిన ఘనత వెంకటస్వామికే దక్కుతుందని శ్లాఘించారు. సి.ఐ.టి.యు. జిల్లా ప్రధాన కార్యదర్శి సింగు నరసింహారావు మాట్లాడుతూ ఉద్యోగుల, ఉపాధ్యాయుల ప్రజాస్వామ్య హక్కులను కాలరాస్తూ పాలకవర్గాలు అన్ని ప్రజాతంత్ర ఉద్యమాలపై విచక్షణా రహితంగా దమనకాండకు పూనుకుంటున్న నేటి తరుణంలో వెంకటస్వామి లాంటి పోరాట యోధుణ్ణి కోల్పోవటం యు.టి.యఫ్.కు, రాష్ట్ర ఉపాధ్యాయ ఉద్యమానికే కాక మొత్తం ప్రజాతంత్ర ఉద్యమానికే తీరని లోటన్నారు. రెండు దశాబ్దాలకు పైగా వెంకటస్వామి మార్గదర్శకత్వంలో, రాష్ట్ర, జిల్లా స్థాయిల్లో పనిచేసిన యు.టి.యఫ్. సీనియర్ నాయకులు ఆర్. రాఘవయ్య, వి.యల్. నరసింహారావు, వి. మల్లికార్జునరావు, ఆర్. పురుషోత్తంరావు, పి. సత్యనారాయణ, ఎస్. గోపాలరావు, ఆర్. శ్రీరాముల, డి.రామచంద్రయ్య ప్రభృతులు తమ అనుభవాలను మననం చేసుకుంటూ, వెంకటస్వామిగారి గుణగణాలను, త్యాగశీలతను నిరాడంబరతను ప్రస్తుతించారు. జియావుద్దీన్ తమ అధ్యక్షోపన్యాసంలో, వెంకటస్వామి 1934లో జన్మించిన దగ్గర నుండి 1953లో ఉద్యోగంలో ప్రవేశించినంతవరకు గల 19 సంవత్సరాల కాలమే ఆయన వ్యక్తిగత జీవితమని, మిగిలినదంతా సంఘజీవితమేనని, వెంకటస్వామి జీవితచరిత్రంటే, ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రేనని, ఆయన త్యాగమయ జీవితాన్ని స్ఫూర్తిగా తీసుకొని, నిస్వార్థంగా సమాజ శ్రేయస్సుకై పని చేయటమే ఆయనకు మనమర్పించు నిజమైన నివాళి అన్నారు.

ఈ సభలో జిల్లా అధ్యక్షులు యస్. శ్రీరాం, ప్రధాన కార్యదర్శి రవి, కార్యదర్శులు శ్రీనివాసులు, చిట్టెమ్మ, కోశాధికారి నాగమల్లేశ్వరరావులతోపాటు వివిధ మండలాల కార్యకర్తలు, ఉపాధ్యాయులు 400 మంది పాల్గొన్నారు.

వెంకటస్వామిగారి త్యాగమయ జీవితాన్ని స్మరిస్తూ కె. శ్రీనివాసులు రచించిన గేయాన్ని, సభా ప్రారంభంలో శేషగిరి, రౌతు రవిలు, పాడి, సభికులను ఉత్తేజపరిచారు.

### ఇంకొల్లులో

ప్రకాశం జిల్లా ఇంకొల్లులో ఏప్రిల్ 17న మండలశాఖ అధ్యక్షుడు బి. పురుషోత్తం అధ్యక్షతన కీ॥శే॥ అప్పారి వెంకటస్వామి గారి సంస్మరణ సభ జరిగింది.

జిల్లా కార్యదర్శి కె. వెంకటరావు ప్రధాన వక్తగా హాజరై ఉపాధ్యాయ ఉద్యమానికి కామ్రేడ్ ఎ.వి.ఎస్. చేసిన సేవలను వివరించారు. ఇంకా జిల్లా కార్యదర్శి టి. రామమూర్తి, మండల ప్రధాన కార్యదర్శి చిలుకూరి హనుమంతరావు, కార్యకర్తలు జె. ప్రసాదరావు, యు. ఉదయకుమారి, యు. వెంకటరావు, కె.జె. జయరాజు, జి. రాఘవయ్య, యు. చెంచయ్య, పి. పేరిరెడ్డి, తదితరులు ప్రసంగించి నివాళులర్పించారు. సభకు 50 మంది ఉపాధ్యాయులు హాజరైనారు.

# ఘనంగా జరుపుకున్న మేడే ఉత్సవాలు

### ఖమ్మం జిల్లాలో

ఖమ్మం జిల్లాలో యు.టి.యఫ్. ఆధ్వర్యంలో ఖమ్మం, భద్రాచలం, వైరాలలో మేడే పతాకావిష్కరణలు జరిగాయి. ఖమ్మం యు.టి.యఫ్. భవన్‌పై జిల్లా అధ్యక్షులు శ్రీరామ్ అరుణ పతాకాన్ని ఎగురవేసి మేడే ప్రాధాన్యతను వివరించారు. జిల్లా ప్రధాన కార్యదర్శి సిహెచ్. రవి, కార్యదర్శులు చిట్టెమ్మ, శ్రీనివాసులు, కోశాధికారి నాగమల్లేశ్వరరావు, జిల్లా బాధ్యులు రాజశేఖర్, వీరబాబులతోపాటు పలువురు మండల బాధ్యులు పాల్గొన్నారు.

భద్రాచలం యు.టి.యఫ్. ప్రాంతీయ కార్యాలయం వద్ద జిల్లా సహాధ్యక్షులు ఇర్పా జగపతిరావు పతాకాన్ని ఆవిష్కరించారు. జిల్లా కార్యదర్శి గోపాలకృష్ణ, భద్రాచలం, దుమ్ముగూడెం కార్యకర్తలు పాల్గొన్నారు. వైరా యు.టి.యఫ్. కార్యాలయం వద్ద మేడే పతాకాన్ని ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో తల్లాడ వైరాత మండల బాధ్యులు పి. నాగేశ్వరరావు, ఎన్.ఎస్.వి. ప్రసాద్, మురళీకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

### అమలాపురంలో

తూర్పు గోదావరి జిల్లా అమలాపురం ఎంప్లాయీస్ హోంనందు యు.టి.యఫ్. జిల్లాశాఖ ఆధ్వర్యంలో మే దినోత్సవం నిర్వహించారు. జిల్లా ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వరావు పతాకావిష్కరణ చేశారు. అనంతరం నిర్వహించిన సమావేశంలో మేడే ప్రాధాన్యతను వివరించారు. జగ్గంపేట, గండేపల్లి, రాజమండ్రి, ముమ్మిడివరం, మలికిపురం, ప్రత్తిపాడు, ఆలమూరు కేంద్రాలలో కూడా పతాకాలను ఆవిష్కరించి సమావేశాలు నిర్వహించారు.

### గోకవరంలో

యు.టి.ఎఫ్. గోకవరం మండలశాఖ ఆధ్వర్యంలో ప్రాథమిక పాఠశాల (రాణా స్కూల్) వద్ద మేడే ఉత్సవం నిర్వహించారు. సీనియర్ కార్యకర్త సిహెచ్. కృష్ణారావు యు.టి.యఫ్. పతాకాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా జరిగిన సమావేశానికి జిల్లా కార్యదర్శి జి. ప్రభాకరవర్మ అధ్యక్షత వహించి ప్రసంగిస్తూ రాష్ట్ర ప్రభుత్వ ప్రయివేటీకరణ విధానాలకు వ్యతిరేకంగా ఉపాధ్యాయులు, ఉద్యోగులు, కార్మికులు ఐక్యంగా పోరాడాలన్నారు.

గోదావరి మెటల్ రోలింగ్ మిల్స్

FAC : 473175
475891
Off : 465949
Res : 473487
444898

# GODAVARI METAL ROLLING MILLS

H.O.: Khaji Street, RAJAHMUNDRY-533 101
B.O.: Boppevari Street, AZZARAM
FACTORY : Katheru Road, RAJAHMUNDRY

**Manufacturers of - Sheets, Circles and Utensils of Copper, Brass and Alluminium**

*Managing Partner* : **GRANDI SUBRAHMANYAM**

---

471343
473105

శ్రీ సత్యసాయి
మెటల్ ఇండస్ట్రీస్

# SRI SATYA SAI METAL INDUSTRIES

WHOLESALE & RETAIL DEALERS

9-11-23/A, KHAJI STREET, RAJAHMUNDRY - 533 101

BROSS, COPPER, ALLUMINIUM & STAINLESS STEEL
SHEETS, CIRCLES AND OLD METALS

# విద్యారంగ మౌలిక సమస్యలపై శంఖారావం పూరించిన యు.టి.ఎఫ్ రాష్ట్ర కౌన్సిల్

ఏప్రిల్ 28, 29 తేదీలలో పశ్చిమగోదావరి జిల్లా భీమవరం పట్టణంలో రెండు రోజులపాటు జరిగిన ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యు.టి.ఎఫ్) రాష్ట్ర కౌన్సిలు విద్యారంగ మౌలిక సమస్యల పరిష్కారమే విద్యా ప్రమాణాల పెరుగుదలకు నిరక్షరాస్యత నిర్మూలనకు దోహదపడుతుందని స్పష్టం చేసింది. అందుకోసం అవసరమైన మేరకు, ఉద్యమాల ద్వారా ప్రభుత్వాలపై వత్తిడి తేవడమే కాకుండా సమస్యల పరిష్కారాన్ని ప్రజలు సైతం గుర్తించే విధంగా తన మేధావి వర్గపు కనీస బాధ్యతను యు.టి.ఎఫ్. నిర్వరిస్తుందని స్పష్టం చేసింది.

కౌన్సిల్ సమావేశాలను 28 ఏప్రిల్ 2001 నాడు ఉదయం భీమవరం పట్టణంలోని అమరజీవి ఎ.వి.యస్. నగర్‌లో అఖిల భారత పాఠశాల ఉపాధ్యాయుల సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ డి. రామిరెడ్డి ప్రారంభించారు. ప్రారంభ సమావేశానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన భీమవరం పురపాలక సంఘం ఛైర్‌పర్సన్ శ్రీమతి నారాయణమ్మ ఉపాధ్యాయ ఉద్యమంలో కీలక పాత్ర వహిస్తున్న యు.టి.ఎఫ్. రానున్న కాలంలో మరింత విశేషకృషి చేసి, విద్యారంగ పురోభివృద్ధికి పాటు పడాలని అన్నారు. శ్రీ డి. రామిరెడ్డి ప్రారంభోపన్యాసం చేస్తూ కేంద్ర ప్రభుత్వం విద్యారంగంలో ప్రవేశపెట్ట చూస్తున్న మత తత్వ ధోరణులను ఖండించారు. గతంలో రాష్ట్రాల విద్యామంత్రుల సమావేశంలోనే ఈ రకమైన ధోరణులకు నాంది పలకాలని చూసిన కేంద్రం కొన్ని రాష్ట్రాల నుండి వ్యతిరేకత రావడంతో కొంత తగ్గినట్లే కన్పించినా ఆ ప్రయత్నాల నుండి పూర్తిగా విరమించుకోలేదని యన్.సి.ఇ.ఆర్.టి. రూపొందించిన డాక్యుమెంటులోని ప్రతిపాదనలు ఋజువు చేస్తున్నాయని అన్నారు. ఇంకా ఆ ప్రతిపాదనలు సజావుగా అమలు చేసేందుకు వీలుగా తమకు అనుకూలురైన వ్యక్తులతో యన్.సి.ఇ.ఆర్.టి.ని నింపి వేస్తున్నదని అన్నారు. దేశ విద్యావ్యవస్థను నాశనం చేసే ఈ ధోరణులను అడ్డుకోవాలని యు.టి.ఎఫ్. ప్రతినిధులకు ఆయన పిలుపునిచ్చారు.

కౌన్సిల్ ప్రారంభంలో 25 సంవత్సరాలు యు.టి.ఎఫ్. ప్రధాన కార్యదర్శిగా పనిచేసి సంఘాన్ని రాష్ట్రంలో అగ్రగామిగా నిలిపి 2001 మార్చి 21న అసువులు బాసిన యు.టి.ఎఫ్. అగ్రనేత వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శి ఎ. వెంకటస్వామి గారికి ఘనంగా నివాళులర్పించారు. ఆయన నిర్దేశించిన లక్ష్య సాధన కోసం కృషి చేస్తామని ప్రతినిధులు దీక్షబూనినారు. పశ్చిమగోదావరి జిల్లా ఉద్యమనిర్మాత, యు.టి.ఎఫ్. నిర్మాతల్లో ఒకరైన పాలిశెట్టి సీతారామయ్య గారికి కూడ కౌన్సిల్ నివాళులర్పించింది. అదేవిధంగా గత కౌన్సిల్ అనంతరం మరణించిన ప్రముఖులు ప్రజానాయకులు, ఉపాధ్యాయ ఉద్యమ కార్యకర్తలకు సంతాపం ప్రకటించింది.

**"పాలకులకు ప్రపంచ బ్యాంకు షరతులే తప్ప ప్రజల అవసరాలు కన్పించడం లేదు" :**

సాయంత్రం జరిగిన ఉపాధ్యాయుల మహాప్రదర్శన భీమవరం పట్టణానికి ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. ఆ తదుపరి జరిగిన బహిరంగసభలో ప్రధాన వక్తగా సి.ఐ.టి.యు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. వీరయ్య కేంద్ర, రాష్ట్ర పాలకుల ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక వ్యతిరేక విధానాలను దుయ్యబట్టినారు. ఈ విధానాలు అభివృద్ధి కోసం కాకుండా ప్రజలను కష్టాలలోకి రాష్ట్రాన్ని అప్పులలోకి నెట్టేవిగా ఆయన అభివర్ణించారు. పాలకులకు ప్రపంచ బ్యాంకు షరతులే తప్ప ప్రజల అవసరాలు కన్పించకపోవడం శోచనీయమని అన్నారు. బహిరంగ సభకు శ్రీ కె. జోజయ్య అధ్యక్షత వహించారు. సభలో యస్.టి.ఎఫ్.ఐ. ప్రధాన కార్యదర్శి, శ్రీ డి. రామిరెడ్డి యు.టి.ఎఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, శ్రీ డి. రామిరెడ్డి యు.టి.యఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ, కార్యదర్శి సి. సుభాష్‌చంద్రబోస్ ప్రసంగించారు.,

రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. నారాయణ కార్యదర్శి నివేదికను, పత్రికా నివేదికను శ్రీ కె. జోజయ్య ప్రవేశపెట్టగా నివేదికలపై ప్రతినిధులు మాట్లాడుతూ విద్యారంగాన్ని కాపాడుకోవాలంటే విద్యా, ఉపాధ్యాయ వ్యతిరేక విధానాలను రాష్ట్ర ప్రభుత్వం మానుకోవాలని డిమాండు చేశారు. విద్యరంగంలో ప్రవేశపెడ్తున్న అశాస్త్రీయ విధానాలను తీవ్రంగా దుయ్యబట్టారు.

గుణాత్మక విద్య, నిరక్షరాస్యత నిర్మూలన, భావిపౌరులను తీర్చిదిద్దే క్రమంలో నిరంతరం కృషి చేస్తున్న విద్యారంగం మరింత ఆకర్షణీయంగా ఉండాలి. ఉపాధ్యాయుల వేతనాలు ఆకర్షణీయంగా ఉండాలి. సమాజంలో సామాజికంగా ఆర్థికంగా వారి పరిస్థితి గౌరవ ప్రదంగా ఉండాలి. ఎక్కువమంది ఉన్నత విద్యార్హతలు సాధించిన మేధావులు ఈ రంగంలోకి ఉరకలేస్తూ వచ్చే విధంగా ఉండాలని జాతీయ విద్యా కమీషన్‌లు, నిపుణులు చెప్తున్న మాటలను ప్రక్కన పెట్టి అశాస్త్రీయమైన అప్రెంటిస్ విధానం పేరుతో ఉపాధ్యాయుల శ్రమనుదోపిడి చేయడం అన్యాయమని, పోరాటాల ద్వారా నాలుగేళ్ళ నుండి రెండేళ్ళకు తగ్గించడం పాలకుల చమత్కారానికి నిదర్శనమే తప్ప సమస్య పరిష్కారంలో భాగం కాదు. కాబట్టి తక్షణమే అప్రెంటిస్ విధానాన్ని రద్దుచేసి టైం స్కేలు ఇవ్వాలని కౌన్సిల్ డిమాండ్ చేసింది. ఈ మేరకు ఒక తీర్మానాన్ని కూడా ఏకగ్రీవంగా ఆమోదించింది.

విద్యారంగంలో ప్రైవేటీకరణకు పెద్దపీట వేయడం తగదని, తద్వారా సామాన్యులకు విద్య భారం అవుతుందని కావున విద్యా వ్యాపారాన్ని అరికట్టాలని కౌన్సిల్ డిమాండ్ చేసింది.

పసిపిల్లల దత్తత సంస్థల చోద్యాన్ని కౌన్సిల్ తీవ్రంగా ఖండించింది. పసిపిల్లల అమ్మకాలతో వ్యాపారం చేసే స్థాయికి మానవత్వాన్ని దిగజార్చడానికి కారకులైన వారిని ఎంతటి ఉన్నత స్థాయిలో ఉన్నా సరే కఠినంగా శిక్షించాలని, ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకుండా ప్రభుత్వాలు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలని కౌన్సిల్ డిమాండ్ చేసింది.

విద్యారంగం, ఉపాధ్యాయులకు సంబంధించిన పలు తీర్మానాలు కౌన్సిల్ ఏకగ్రీవంగా ఆమోదించింది.

## జనరల్ కౌన్సిల్ ఆమోదించిన తీర్మానాలు

1. విద్యను ప్రాథమిక హక్కుగా రాజ్యాంగ సవరణ ద్వారా చేర్చాలి.
2. బాలకార్మిక విధానం నిర్మూలన కోసం కట్టుదిట్టమైన చర్యలు తీసికోవాలి. బడి మానేసిన పిల్లలు, బడికి రాకుండా ఉండే పిల్లలు అందుకుగాను కారణాలను విశ్లేషించి తగు చర్యలు తీసికోవాలి. ప్రాథమిక చర్యగా వెంటనే మధ్యాహ్న భోజన పథకం ప్రవేశపెట్టాలి.
3. ప్రభుత్వరంగ ప్రైవేటీకరణను ఆపాలి.
4. కులవివక్షతను నిర్మూలించాలి.
5. చేనేత కార్మికుల దీనావస్థ మానవత్వం ఉన్నవారెవరికైనను

చలించేటట్లు చేస్తుంది. దీనికి కారణలేమైననూ కనీసం ఇప్పుడైనా చేనేత పరిశ్రమ స్థిరపడేందుకు తగు చర్యలు తీసికొని, కష్టాలలో ఉన్న కార్మికులను ఆదుకోవాలి.

6. చట్టసభలలో మహిళలకు 33% రిజర్వేషన్లు కల్పించాలి.
7. వృత్తి విద్యా ఉపాధ్యాయులకు రెగ్యులర్ స్కేలు ఇవ్వాలి.
8. అప్రెంటిస్ విధానం రద్దుచేయాలి. ఇదివరకే పూర్తి చేసిన అప్రెంటిస్ కాలానికి నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలి.
9. 1999 పి.ఆర్.సి. స్కేళ్ళల్లో ఎస్.జి.బి.టి. ఉపాధ్యాయులకు నిర్ణయించిన స్కేలు మినిమంను రూ. 3750 నుంచి రూ. 3950 గా మార్చాలి.
10. ప్రభుత్వం అంగీకరించిన మేరకు 1999 స్కేళ్ళలో కుటుంబ నియంత్రణ మరియు అదనపు విద్యార్హతల ఇంక్రిమెంట్లు పునరుద్ధరించాలి.
11. 1.7.1998 మరియు 1.4.1999 మధ్యకాలంలో పదవీ విరమణ చేసిన ఉపాధ్యాయులకు నూతన పి.ఆర్.సి. ననుసరించి ఫిక్సేషన్ చేసి గ్రాట్యుటీ చెల్లించాలి.
12. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు జి.ఓ. 62 ననుసరించి ట్రెజరీల ద్వారా వేతనాలు చెల్లించే విధానాన్ని వెంటనే అమలు చేయాలి.
13. పంచాయతీరాజ్ ఉపాధ్యాయులకు ట్రెజరీల ద్వారా జీతాలు చెల్లించే విధానాన్ని ప్రభుత్వ టీచర్లకు చెల్లిస్తున్న విధంగా అమలు చేయాలి.
14. పని దినాల ప్రాతిపదికన ఉపాధ్యాయులకు సంపాదిత సెలవును సంవత్సరానికి 20 రోజులకు పెంచాలి.
15. ఎయిడెడ్, మునిసిపల్ ఉపాధ్యాయుల టి.పి.యఫ్.ను జి.పి.యఫ్.గా మార్చాలి.
16. ఉపాధ్యాయులు స్వంత మండలాలలో పనిచేయరాదనే నిబంధన విధించడం విద్యా ప్రమాణాలకు ఏవిధంగానూ దోహదపడే చర్య కాదు. కనుక స్వంత మండలంలో పనిచేసే అవకాశం కల్పించాలి.
17. ఉపాధ్యాయులు పనిచేస్తున్న ప్రాంతాలలో నివాసం ఉండాలనే ఆంక్షలు విధిస్తున్న ప్రభుత్వం ఆ ప్రాంతాలలో వారికి కావలసిన కనీస సౌకర్యాల విషయం ఆలోచించకుండానే నిబంధనలను కఠినంగా అమలు చేస్తాననడం సరైంది కాదు. ఆయా గ్రామలలో నివాసం ఉండటంలేదనే కారణంతో వేతనాలు నిలుపుదల చేయడంలాంటి ఉపాధ్యాయ వ్యతిరేక విధానాలు మాని ముందుగా క్వార్టర్స్ ఏర్పాటు గురించి చర్యలు తీసికోవాలి.
18. గిరిజన సంక్షేమ పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు సర్వీసు రూల్సు ప్రకటించాలి. జూనియర్ లెక్చరర్స్ తదితర ప్రమోషన్‌లకు అవకాశం కల్పించాలి.
19. అర్థజీతపు సెలవులు మంజూరు, జి.పి.ఎఫ్. లోన్లు మంజూరు తదితర అధికారాలు ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు కల్పించాలి.
20. ఓ.బి.బి; గ్రాంట్ ఇన్ ఎయిడ్ పోస్టులను నాన్ ప్లాన్‌గా ప్రకటించి ప్రతినెలా ఒకటవ తేదీన జీతాలు చెల్లించేటట్లు చర్యలు తీసుకోవాలి.
21. అన్ ట్రెయిన్డ్ గిరిజన ఉపాధ్యాయులకు ఆన్ డ్యూటీపై ట్రయినింగ్ సదుపాయం కల్పించాలి.
22. 2000 డి.ఎస్.సి.లో నియమించిన అశిక్షితులైన ఎస్.టి. టీచర్లకు ట్రయినింగ్ కల్పించాలి.
23. గిరిజన విద్యా వికాస కేంద్రాలన్నింటిని గిరిజన ప్రాథమిక పాఠశాలలుగా మార్పు చేయాలి.
24. రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ ఉత్తర్వులు యధాతథంగా సింగరేణి ఉపాధ్యాయులకు వర్తింపజేయాలి.
25. గిరిజన, ఎయిడెడ్, మున్సిపల్ పాఠశాలలకు గ్రేడ్ - 2 ఫిజికల్ డైరెక్టర్ పోస్టులను కేటాయించాలి.
26. జె.సి.టి.ఎ. మరియు జె.ఎ.సి. ఒప్పందాల మేరకు ఉత్తర్వులను వెంటనే ఇవ్వాలి.

పై సమస్యలన్నింటి పరిష్కారానికి రానున్న సంవత్సరానికి భవిష్యత్ కార్యక్రమాన్ని రూపొందించి అమలు చేయడానికి కౌన్సిల్ నూతనంగా ఎన్నికైన రాష్ట్ర కమిటీకి అధికారాన్నిచ్చింది.

ఎన్నికైన సీనియర్ నాయకులు శ్రీ టి. కొండాచారి ఎన్నికల అధికారిగా శ్రీ కె. ఆదినారాయణ సహాయ ఎన్నికల అధికారిగా నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది కమిటీలు ఏకగ్రీవంగా ఎన్నికైనవి.

## రాష్ట్ర కార్యదర్శి వర్గం

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ పి. కృష్ణమూర్తి |
| అధ్యక్షులు | : | శ్రీ కె. జోజయ్య |
| సహాధ్యక్షులు | : | శ్రీ యన్. రమణయ్య శాస్త్రి |
| ప్రధాన కార్యదర్శి | : | శ్రీ ఎన్. నారాయణ |
| కోశాధికారి | : | శ్రీమతి ఎం. సంయుక్త |
| కార్యదర్శులు | : | శ్రీ ఎం.ఎ.కె. దత్తు |
| | | శ్రీ యస్. ఆనందనాయుడు |
| | | శ్రీ యస్. విజయకుమార్ |
| | | శ్రీ సిహెచ్. సుభాష్‌చంద్రబోస్ |
| | | శ్రీ బి. మోహనరావు |
| | | శ్రీమతి సి. కమలకుమారి |
| | | శ్రీ పి. మాణిక్‌రెడ్డి |
| | | శ్రీ పి. పుల్లయ్య |
| | | శ్రీ పి. వెంకటేశ్వరరావు |
| | | శ్రీ వై. రంగారెడ్డి |
| | | శ్రీ కె. వెంకట్రావు |

## ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గము

| | | |
|---|---|---|
| ప్రధాన సంపాదకులు | : | శ్రీ డి. రామిరెడ్డి |
| సభ్యులు | : | శ్రీ కె. జోజయ్య |
| | | శ్రీ ఎన్. నారాయణ |
| | | శ్రీ యస్. ఆనందనాయుడు |
| | | శ్రీ సిహెచ్. రవి |

## ఆడిట్ కమిటీ

| | | |
|---|---|---|
| కన్వీనర్ | : | శ్రీ యస్.డి. జియాఉద్దీన్ |
| సభ్యులు | : | శ్రీ ఎ. ఇజ్రాయిల్ రాజు |
| | | శ్రీ కె. అప్పాజి |

# ఉపాధ్యాయుడు సామాజిక దృక్పథంతో పనిచేయాలి

## - చిత్తూరు జిల్లా కౌన్సిల్‌లో వక్తల ఉద్ఘాటన

ఉపాధ్యాయులు సామాజిక దృక్పథంతో నేటి పరిణామాలను విశ్లేషించినప్పుడే తనకు, సమాజానికి న్యాయం చేసిన వారవుతారని చిత్తూరు జిల్లా పలమనేరులో మార్చి 17న జరిగిన విద్యాగోష్ఠిలో ప్రసంగించిన వక్తలు పేర్కొన్నారు.

చిత్తూరు జిల్లా 27వ జనరల్ కౌన్సిల్ సమావేశాలు మార్చి 17, 18 తేదీలలో పలమనేరులో జరిగాయి. ఈ సందర్భంగా జరిగిన విద్యాగోష్టిలో ఎస్.టి.ఎఫ్.ఐ. ప్రధాన కార్యదర్శి డి. రామిరెడ్డి, తమిళనాడు ప్రైమరీ టీచర్స్ ఫెడరేషన్ కార్యదర్శి యల్. మణి యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి యస్. ఆనందనాయుడు, జె.వి.వి. నాయకులు డా॥ యన్. వేణుగోపాలరావు, టి. కొండాచారి తదితరులు పాల్గొన్నారు. అనంతరం యం. సోమచంద్రా రెడ్డి అధ్యక్షతన జరిగిన కౌన్సిల్ సమావేశంలో ప్రధాన కార్యదర్శి జయరాం నాయుడు కార్యదర్శి నివేదికను, వి. చంద్రారెడ్డి సంక్షేమ పథకం నివేదికను సమర్పించగా ప్రతినిధులు చర్చించి ఆమోదించారు. అనంతరం 2001-2002 సంవత్సరానికి ఈ క్రింది జిల్లా కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికైనది.

గౌరవాధ్యక్షులు : ఎన్. సోమచంద్రారెడ్డి; అధ్యక్షులు : ఎం. జయరాంనాయుడు; అసోసియేట్ అధ్యక్షులు : జి. శ్రీరామమూర్తి; ప్రధాన కార్యదర్శి : వై. శ్రీనివాసులు రెడ్డి; కోశాధికారి : శ్రీమతి డి. నిర్మల; కార్యదర్శులు : వి. చంద్రారెడ్డి, టి. కోదండరెడ్డి, ఎ. చంద్రశేఖరయ్య, పి. మోహనమూర్తి, కె. రవి, డి. కృష్ణయ్య, ఎస్.పి. జయశీలన్, ఎన్. హరగోపాల్‌రెడ్డి, జి. గోవిందరాజన్, ఎ. వెంకటరమణారెడ్డి, కె.యన్. కందస్వామి, ఎస్.హెచ్. రహమాన్; రాష్ట్ర కౌన్సిలర్లు : కె. రామచంద్రారెడ్డి, జి. చంగ్రాయ మందడి, యస్. సాబీర్ భాషా, సి. సర్వసతి, ఎం. కృష్ణమనాయుడు, ఎం. పరంధామనాయుడు, ఎం. గోపాల్, కె. వెంకటరాఘవరెడ్డి; ఆడిట్ కమిటీ : ఎ. జయచంద్రారెడ్డి; కన్వీనరు : ఎం. సురేష్‌బాబు, ఎన్. సుబ్రహ్మణ్యనాయుడు, కె. సురేంద్ర, ఇ. భాస్కరన్, ఎం. రఘుపతి.

### కాట్రేనికోన MDO తో యు.టి.ఎఫ్. చర్చలు

ది. 19-3-2001 తేదీన యు.టి.ఎఫ్. మండల శాఖ ప్రతినిధి వర్గం ఎం.డి.ఓ. శ్రీ ఎం. భానుప్రకాష్ గారితో సమావేశమైన మండలంలో అత్యవసరంగా పరిష్కరింపవలసిన సమస్యలను గూర్చి చర్చించిరి.

పి.ఎఫ్. ఖాతాలకు జమ చేయవలసిన కరువు భత్యము మొత్తములను ఆయా ఉపాధ్యాయుల పి.ఎఫ్. ఖాతాలకు వెంటనే జమ చేయింతునని, 98 పేనల్ ఉపాధ్యాయల సర్వీస్ రెగ్యులరైజేషన్, G.I.S. నామినీలు, SRలలో నమోదు చేయించుట, ఉపాధ్యాయుల సెలవు ఖాతాలను నవరింపజేయుట, పెన్సన్ రిజర్వుడు ఉపాధ్యాయులకు ఎరండ్ లీవ్ మంజూరు, ప్రధానోపాధ్యాయునిగా పనిచేయుచున్న అప్రంటీస్ ఉపాధ్యాయులకు హెచ్.ఎమ్. డ్యూటీ అలవెన్సు ఇచ్చుట మొదలగు నమస్యలను వెంటనే పరిష్కరింపజేయుదునని హామీ యిచ్చిరి. చర్చలలో అధ్యక్షులు శ్రీ ఎన్. పద్మనాభన్, ప్రధాన కార్యదర్శి వై.వి. రమణమూర్తి సహాధ్యక్షులు వై. సాయిబాబు, కార్యదర్శి ఎం.కె. పేరిశెట్టి పాల్గొనిరి.

### తుని పట్టణములో మధ్యతరగతి ఉద్యోగుల సదస్సు

ది. 19.3.2001 న తుని పట్టణ, మండల శాఖలు సంయుక్తంగా ఏర్పాటు చేసిన "మధ్యతరగతి ఉద్యోగుల సదస్సు"కు పట్టణములోని వివిధ ఉపాధ్యాయ ఉద్యోగ సంఘాల నాయకులు హాజరయ్యారు.

ఈ సమావేశానికి పట్టణ శాఖ అధ్యక్షులు శ్రీ బి. వెంకటరావు గారు అధ్యక్షత వహించగా, "బడ్జెట్టులు - మధ్యతరగతి ఉద్యోగులపై వాటి ప్రభావం" అనే అంశంపై వివిధ ఉద్యోగ సంఘాల నాయకులు ప్రసంగించారు. కేంద్ర, రాష్ట్ర బడ్జెట్టులో 20%గా ఉన్న ఉన్నత వర్గాలకు వారు ఉపయోగించే వస్తువులపై రాయితీలు కల్పించిన మిగిలిన 80% సామాన్య ప్రజలపైన వారు ఉపయోగించే వస్తువులపైన భారం మోపారని దీని ప్రభావం ఉద్యోగులపై అధికంగా ఉందని వక్తలు ప్రసంగించారు. తూర్పుగోదావరి జిల్లా సి.ఐ.టి.యు. ప్రధాన కార్యదర్శి శ్రీ డి. వేషు బాబ్జి మాట్లాడుతూ కేంద్ర బడ్జెట్టులతో పి.ఎఫ్.పై వడ్డీ తగ్గించడం, ప్రతి సంవత్సరం 2% ఉద్యోగాలు కోత విధించడం, పెన్షన్‌పై సమీక్ష జరుపుతామనడం, మొదలైన అంశాలు ఉద్యోగులపై తీవ్ర ప్రభావాన్ని చూపుతాయని వివరించారు. ఆర్.టి.సి. నుండి శ్రీ మూర్తిగారు ఎస్.టి.యు. పక్షాన శ్రీ కె. సత్యనారాయణ ప్రసంగించారు.

### ఆత్మకూరులో యు.టి.ఎఫ్. ప్రాంతీయ కార్యాలయ ప్రారంభం

కర్నూలు జిల్లా ఆత్మకూరులో ఫిబ్రవరి 4న యు.టి.ఎఫ్. ప్రాంతీయ కార్యాలయాన్ని పట్టణ ప్రముఖులు శ్రీ కె. పాండు ప్రారంభించారు. ఈ కార్యాలయం ఆత్మకూరు, పాములపాడు, కొత్తపల్లి, వెలుగోడు మండలాలకు కేంద్రంగా ఉండి ఉపాధ్యాయ సమస్యల పరిష్కారానికి కృషి చేస్తుందని ప్రారంభ సభలో ప్రసంగించిన పలువురు వక్తలు ఆశాభావం వెలిబుచ్చారు. ఈ కార్యక్రమంలో జిల్లా నాయకులు ఎ. చెన్నకేశవరెడ్డి, ఎం.ఎ. బేగ్, రంగస్వామి, పి. శంకరయ్య, నరసింహులు, బాబు, పాములపాడు, ఆత్మకూరు, కొత్తపల్లి ఎం.ఇ.ఓ.లు శ్రీ సుబ్బారెడ్డి శ్రీ రహ్మతుల్లా, శ్రీ వెంగళరెడ్డి, ఉపాధ్యాయులు బి.ఆర్. తిక్కయ్య తదితరులు పాల్గొన్నారు.

### పాల్వంచలో 'మహిళా చైతన్య సదస్సు'

ఆధునిక నాగరికతా ప్రపంచంలో మహిళల పట్ల వివక్షత తగ్గాల్సింది పోయి, పెరుగుతున్నాయని, యిది ఆందోళనకు సమయమని యు.టి.ఎఫ్. రాష్ట్ర కార్యవర్గ సభ్యురాలు శ్రీమతి సిహెచ్. చిట్టెమ్మ అభిప్రాయపడినారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకొని, మార్చి 8న యు.టి.ఎఫ్. పాల్వంచ మండలశాఖ ఏర్పాటు చేసిన 'మహిళా చైతన్య సదస్సు' నందు గౌరవ అతిధిగా పాల్గొని ప్రసంగించారు.

వివిధ మతాలకు నిలయమైన మన దేశంలో స్త్రీలకు సముచిత స్థానం లభించడం లేదు. ఇతిహాసాలు తెలియజేస్తున్న ప్రకారం స్త్రీలు పూజింపబడినచోట అభివృద్ధి సాధ్యపడుతుంది. స్త్రీలలో అక్షరాస్యతా శాతం మరింత ఎక్కువ కావాలని, దీనికి మహిళలుగా మనం మరింత కృషి చేయాలన్నారు. అన్ని రంగాలలో మహిళల ప్రాతినిధ్యం పెరగటానికి తగిన చట్టాలు రూపొందించాలన్నారు.

జన విజ్ఞాన వేదిక, 'సమత' విభాగం జిల్లా అధ్యక్షురాలు శ్రీమతి కస్తూరి మాట్లాడుతూ - సమాజంలో మహిళల పట్ల జరుగుతున్న వివక్షతలకు అందరూ బాధ్యులే. ఈ వివక్షత వందల సంవత్సరాల నుండి వేళ్ళూనుకొని వుంది. దీనిని సమూలంగా నిర్మూలించాలంటే అందరి సహకారం అవసరమని స్త్రీల సమస్యలలో పురుషులు కూడా పాల్గొని వారిని ముందుకు నడిపించాలన్నారు.

మండల పరిషత్ అభివృద్ధి అధికారి శ్రీమతి విద్యాలత, మహిళా సంఘ నాయకురాలు శ్రీమతి జ్యోతి, ఎస్.ఎఫ్.ఐ. నాయకురాలు సత్యవతి తదితరులు ప్రసంగించారు. అనంతరం స్త్రీలపై తాలిబన్ల అణచివేత చర్యలను ఖండించాలి. (1) మహిళలకు చట్టసభలలో 3వ వంతు అవకాశం కల్పించాలనీ (2) పాఠశాలల్లో టాయిలెట్ సౌకర్యాలు కల్పించాలనీ (3) మహిళా ఉద్యోగులకు 5 ప్రత్యేక సెలవులు మంజూరు చేయాలనీ (4) మహిళలపై అత్యాచారాలు చేసిన వారిని కఠినంగా శిక్షించాలని తీర్మానించారు.

శ్రీమతి విజయలక్ష్మి అధ్యక్షతన జరిగిన సమావేశంలో జిగీష, శ్రీదేవి, మాధవి, లూసీరాణి, తదితరులు పాల్గొన్నారు.

## రూపాయి విలువ పతనంతో అధికమవుతున్న విదేశీ రుణభారం

ప్రతి ఏడాది సమర్పిస్తున్న 'బడ్జెట్'లో రూపాయి విలువ ఇంతకింతకు పతనమవుతుండడం వల్ల దేశీయ ఆర్థిక రంగాన్ని తీవ్ర సంక్షోభంలోకి నెట్టి వేస్తున్నదని ఉస్మానియా యూనివర్సిటీ ఆర్థిక శాస్త్ర నిపుణులు ప్రొఫెసర్ డాక్టర్ కె. నాగేశ్వర్ ఆందోళన వ్యక్తం చేశారు. యు.టి.ఎఫ్. రంగారెడ్డి జిల్లాశాఖ ఆధ్వర్యంలో వికారాబాద్ రవీంద్ర మండపంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ బడ్జెట్ విశ్లేషణ అనే అంశంపై ఏర్పాటు చేసిన చర్చాగోష్టిలో ఆయన ముఖ్యవక్తగా ప్రసంగించారు. ఈ ఏడాది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెట్ కేటాయింపులు పరిశీలిస్తే సామాన్యుడికి పన్నుల భారం - సంపన్నునికి రాయితీల హారం అనే చందంగా ఉందని ఆయన ఎద్దేవా చేశారు. ఫలితంగా మెజారిటీ ప్రజల సంక్షేమానికి విఘాతం కలుగుతోందని ఆయన స్పష్టం చేశారు.

## విద్యారంగ పరిరక్షణకు ఉద్యమించాలి

ప్రకాశం జిల్లా రామాయపట్నంలో మార్చి 6న యు.టి.ఎఫ్. గుడ్లూరు, ఉలవపాడు మండలశాఖల పక్షాన విద్యాసదస్సు నిర్వహించారు. జాతీయ పతాకాన్ని ఎం.ఇ.ఓ. శ్రీ వై. రాగోపాలరావు, యు.టి.ఎఫ్. పతాకాన్ని రాష్ట్ర కౌన్సిలరు మక్కెన కోటయ్య ఆవిష్కరించారు. ఎస్.టి.ఎఫ్.ఐ. ప్రధాన కార్యదర్శి, శ్రీ డి. రామిరెడ్డి ముఖ్యఅతిథిగా ప్రసంగిస్తూ పాలకుల నిర్లక్ష్యం వలన విద్యారంగ రక్షణకు ఉపాధ్యాయులంతా ఉద్యమించాలని, ఉపాధ్యాయులు గ్రామీణ ప్రాంతాలలో నివాసం ఉండి పనిచేస్తే మంచి ఆదరణ లభిస్తుందని పేర్కొన్నారు. తాను పనిచేసిన రామాయపట్నంలో గ్రామప్రజలందరు కదిలి పాఠశాల భవన నిర్మాణాలకు పూర్తి సహకారం అందించిన తీరును, అనాటి పరిస్థితులను వివరించారు. రాష్ట్ర కార్యదర్శి శ్రీ ఎస్. ఆనందనాయుడుగారు మాట్లాడుతూ నూతన విద్యా విధానం దుష్ఫలితాలను వివరించారు. సి.ఐ.టి.యు. జిల్లా కార్యదర్శి శ్రీ ఎన్. ప్రభుదాస్ మాట్లాడుతూ ఉపాధ్యాయ, కార్మిక, ఉద్యోగులందరూ తమ న్యాయమైన కోర్కెలకై సమిష్టిగా పోరాడాలని పిలుపునిచ్చారు. జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఆదినారాయణ, జిల్లా ఉద్యమాన్ని గూర్చి వివరించారు. ఈ సదస్సుకు 600 మంది పైగా ఉపాధ్యాయులు హాజరైనారు. సదస్సుకు ముప్పన మల్యాద్రి స్వాగతం పలుకగా శ్రీ కె. కొండయ్య వందన సమర్పణ చేశారు. కార్యక్రమంలో చాపల రమణయ్య, ఎన్. అనసూయ ఎం.ఇ.ఓ.లు ఎం.పి.డి.ఓ. అనేకులు పాల్గొని అమూల్య సందేశాలనిచ్చారు.

## వత్సవాయి సూర్యనారాయణరాజు 8వ వర్ధంతి సభ

అమరజీవి వి. సూర్యనారాయణరాజు 8వ వర్ధంతి జిల్లాశాఖ ఆధ్వర్యంలో జిల్లా కార్యదర్శి శ్రీ ఆర్. వీరాస్వామి అధ్యక్షతన అమలాపురం ఎంప్లాయీస్ హోమ్ నందు ది. 26.3.2001 న జరిగింది. తొలుత రాజు చిత్రపటానికి పూలమాలను వేసి శ్రద్ధాంజలి ఘటిస్తూ ఆర్. వీరాస్వామి మాట్లాడుతూ జిల్లా అధ్యక్షునిగా, ప్రధాన కార్యదర్శిగా రాష్ట్ర కార్యదర్శి రెండు దశాబ్దాలకు పైగా పలు పోరాటాలకు నాయకత్వం వహించి ఉపాధ్యాయులకు అనేక హక్కులు రాయితీలు సాధనకు జీవితం త్యాగం చేసిన మహనీయుడని పేర్కొన్నారు. జిల్లా సెక్రటరీ పి. కృష్ణంరాజు, జిల్లాలో రాజు నాయకత్వంలో జరిగిన అనేక పోరాట ఘట్టాలను వివరిస్తూ అన్యాయానికి, అవినీతికి వ్యతిరేకంగా కొదమసింహంగా పోరాడిన యోధుడని అన్నారు. జిల్లా ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు మాట్లాడుతూ, ఎంప్లాయీస్ హోమ్ నిర్మాణంలోను కాకినాడ, టీచర్స్ హోమ్ నిర్మాణంలోను ఆరోగ్యాన్ని పణంగా పెట్టి కృషి చేశారని, వాయిస్ ఆఫ్ టీచర్స్ ఒక పోరాట ఆయుధంగా నడిపారని అన్నారు. అమలాపురం మాజీ సమితి మాజీ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. నాగభూషణం అమలాపురం మండల అధ్యక్షులు శ్రీ డి. శ్రీరామమూర్తి, ఎల్. వెంకటరాజు తదితరులు రాజు మిలిటెంట్ పోరాటాలను వివరిస్తూ ఆయన నిర్మించిన బాటలో ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్ళాల్సిన కర్తవ్యం మనపై యున్నదని అన్నారు. రెవెన్యూ డివిజన్ స్థాయిలో మండల శాఖల నాయకులు, కార్యకర్తలు, హాజరై శ్రద్ధాంజలి ఘటించారు.

## ఉత్తేజమిచ్చిన ఒంగోలు చైతన్య సదస్సు

ప్రకాశం జిల్లా 28న జనరల్ కౌన్సిల్ సమావేశాలు ఒంగోలు డి.ఆర్.ఆర్.ఎం. మున్సిపల్ హైస్కూల్‌లో మార్చి 10, 11 తేదీలలో నిర్వహించబడినాయి.

10వ తేది ఉదయం జిల్లా అధ్యక్షులు కె. వెంకటరావు ఉద్యమ పతాకాన్ని ఆవిష్కరించారు. అనంతరం ఆయన అధ్యక్షతన జరిగిన ప్రారంభసభలో యు.టి.ఎఫ్. రాష్ట్ర గౌరవాధ్యక్షులు డి. రామిరెడ్డి, రాష్ట్ర అధ్యక్షులు కె. జోజయ్య, సీనియర్ నాయకులు వై.యల్. నారాయణ ప్రసంగించారు.

సి.ఐ.టి.యు. జిల్లా కార్యదర్శి ఎన్. ప్రభుదాన్, ప్రధానోపాధ్యాయుల సంఘం జిల్లా కార్యదర్శి డి.ఎం. హనుమంతరావులు సౌహార్ధ సందేశాలు ఇచ్చారు.

అదే రోజు మధ్యాహ్నం 3 గం॥లకు రాష్ట్ర కార్యదర్శి కె. ఆదినారాయణ అధ్యక్షతన జరిగిన చైతన్య సదస్సులో "ఎనాలిసిస్" పత్రిక గౌరవ సంపాదకులు డా॥ కె. నాగేశ్వర్ ప్రధాన వక్తగా ప్రసంగిస్తూ రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న తిరోగమన ఆర్థిక విధానాలను నిశితంగా విమర్శించారు.

ప్రభుత్వం రోగానికి కారణాలు వెతక్కుండా, రోగాన్ని పెంచే మందునే మళ్ళీ మింగడం తప్ప ప్రత్యామ్నాయం లేదని చెబుతున్నదన్నారు. ఒకవైపు సంస్కరణలు విజయవంతం కాలేదని చెబుతూనే, మరొకవైపు రాష్ట్ర ప్రభుత్వం తిరిగి సంస్కరణలే శరణ్యమంటుందన్నారు. ఒక్క ఏడాదికే తాను ఎంచుకున్న లక్ష్యాలను సాధించలేని యీ రాష్ట్ర ప్రభుత్వం 20 సంవత్సరాలకు నిచ్చనలు

వేయటం హాస్యాస్పదమన్నారు. ఒకప్పుడు ప్రభుత్వం అప్పులపై తీసుకొన్న వడ్డీ 8 నుండి 9 శాతం మధ్య వుండగా, అది యీనాడు 13.6 శాతానికి పెరగిందన్నారు. ప్రత్యామ్నాయ వనరుల సమీకరణపై దృష్టి పెట్టకుండా, ప్రజలపై భారాలు మోపుతూ తిరిగి అప్పులపైనే ఆధారపడటం అవివేకమన్నారు.

ప్రభుత్వాలు తమ బాధ్యతల నుండి తప్పుకుంటూ, ప్రజలపై భారాలు మోపుతున్నాయన్నారు. ఉపాధ్యాయులు విద్యార్థులను ఆలోచనాపరులుగా ఆలోచించేవారిగా తయారు చేయాలని కోరారు. ఇప్పుడు దేశంలో ప్రజలకు కావలసిన వస్తువులు తయారు గావించడం గాకుండా, వస్తువులకు కావలసిన మనుష్యులను తయారుచేయడంలో పాలకవర్గం నిమగ్నమవుతుందన్నారు.

రాష్ట్ర సంఘ గౌరవాధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డిగారు విద్యాసమస్యలు, ప్రభుత్వ పెడవైఖరులు, ప్రవేటీకరణ దుష్ఫలితాలు, పాఠ్యపుస్తకాలలో మతతత్వ ధోరణులను ప్రవేశపెట్టే యత్నాలను, హిందూ సంస్కృతి ఎప్పటి నుండి వచ్చిందన్న అంశంపై వున్న వాస్తవాలు, అపోహలు, లౌకిక వాద ఆవశ్యకత మొదలగు అనేక అంశాలపై ఉపన్యసించిరి.

జనవిజ్ఞాన వేదిక జిల్లా నాయకులు శ్రీ డా॥ కె. నాగేశ్వరరావు గారు తమ ప్రసంగంలో ఒక మనిషిని అతనికి జబ్బులేనంత మాత్రాన ఆరోగ్యవంతుడని అనకూడదని, అతను మానసికంగా కూడ పరిపూర్ణత చెందితేనే అతనిని ఆరోగ్యవంతునిగా పరిగణించాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ ఆర్గనైజర్ మెహ్లర్ అన్నది వాస్తవమన్నారు. ప్రభుత్వం ప్రజలకు పౌష్టికాహారం మంచినీరు, ఉపాధి, చదువు సౌకర్యాల కల్పనకు కృషి చేయాలన్నారు.

## ప్రకాశం జిల్లా 28వ నూతన కౌన్సిల్

సాయంత్రం గం. 6-30 లకు జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ కె. వెంకటరావు అధ్యక్షతన నూతన కౌన్సిల్ సమావేశము ప్రారంభమయినది. జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఆదినారాయణ కార్యదర్శి నివేదికను, జిల్లాశాఖ కోశాధికారి శ్రీ ఆర్.వి. నారాయణ, ఆర్థిక, భవన నివేదికలను, ప్రకాశం జిల్లా యు.టి.యఫ్. వార్తల ప్రధాన సంపాదకులు శ్రీ యం. పానకాలరావు పత్రికా నివేదికను, రాష్ట్ర కౌన్సిలర్ శ్రీ యస్‌కె. గౌస్ భాషా ప్రచురణ విభాగ నివేదికను సభకు సమర్పించిరి.

తేది 11-3-2001 ఉదయం గం. 9-00 లకు మరల నూతన కౌన్సిల్ సమావేశమై ఎనిమిది గ్రూపులుగా శాఖల వారీ విభజింపబడి నివేదికలపై చర్చలు జరిగినవి. తగు సమాధానము లివ్వబడినవి.

అనంతరం ఎన్నికల అధికారిగా రాష్ట్ర గౌరవాధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డిగారు సహాయకులుగా రాష్ట్ర నాయకులు శ్రీ టి. కొండాచారి గారు వ్యవహరించి నిర్వహించిన ఎన్నికలలో నూతన కార్యదర్శివర్గం, రాష్ట్ర కౌన్సిలర్లు, ఆడిట్ కమిటీ తదితర కమిటీలు ఏకగ్రీవంగా ఎన్నికైనవి.

**జిల్లా కార్యదర్శి వర్గము :**

గౌరవాధ్యక్షులు : ఎ. సుబ్బారెడ్డి; అధ్యక్షులు : జి. శేషయ్య; సహాధ్యక్షులు : షేక్ షంషుద్దీన్; ప్రధాన కార్యదర్శి : కె. ఆదినారాయణ; కోశాధికారి : ఆర్.వి. నారాయణ; కార్యదర్శులు : కె. వెంకటరావు, టి. రామమూర్తి, షేక్ మస్తాన్, జి. రవీంద్రనాథరెడ్డి, యం. వెంకటేశ్వర్‌రెడ్డి, ఎస్. అంజిరెడ్డి, ఓ.వి. వీరారెడ్డి, బి.వి. రత్నం, షేక్ గౌస్ భాషా, టి. నారాయణరావు, ఎస్.డి. కరుణ కుమారి, పి. జాన్ విలియం.

**రాష్ట్ర కౌన్సిలర్లు :**

డి. లక్ష్మిరెడ్డి, కె. వెంకటరావు, పి. నాగేశ్వరరావు, జి. శేషయ్య, యం. కోటయ్య, వి. మాలకొండారెడ్డి, ఎ. తిరుమలేష్, ఎ. విజయరాజు, కె. కృష్ణారెడ్డి, యం.వి. భాస్కరరెడ్డి, పి. కమలాకరరావు, యం.సి.హెచ్. రామిరెడ్డి, జి. ఓబులురెడ్డి, యస్. శారదమ్మ.

**ఆడిట్ కమిటీ :**

కన్వీనర్ : వి.పి. వెంకట సుబ్బయ్య; సభ్యులు : ఎన్. భగవద్గీతాదేవి, కె. చంద్రశేఖరరావు, ఆర్. వెంకటరెడ్డి, పి. జయరావు

**వార్తలు సంపాదక వర్గం**

ప్రధాన సంపాదకులు : యం. పానకాలరావు; సభ్యులు : కె. ఆదినారాయణ, జి. శేషయ్య, కె. వెంకటరావు, జి. పురుషోత్తం.

## ఖమ్మం D.E.O. కార్యాలయంలో సమస్యల పరిష్కారం "విజయవంతమైన యు.టి.యఫ్. రిలే నిరశన"

ఖమ్మం జిల్లాలో ఉపాధ్యాయ సమస్యలనేకం డి.ఇ.ఓ. కార్యాలయంలో దీర్ఘకాలంగా అపరిష్కృతంగా ఉన్న సందర్భంలో, యు.టి.ఎఫ్. జిల్లాశాఖ నిర్వహించిన అనేక ప్రాతినిధ్యాలు సత్ఫలితాలనీయక పోయినందున ఫిబ్రవరి 10, 11 తేదీలలో జరిగిన జిల్లా కౌన్సిల్ నిర్ణయం మేరకు ఆ కార్యాలయం ఎదుట ప్రత్యక్ష చర్యకు పూనుకోవాలని నిర్ణయించనైనది. ఆ మేరకు ముందుగా ఫిబ్రవరి 23న 100 మంది ఉపాధ్యాయులతో వినూత్న తరహాలో సామూహిక ప్రాతినిధ్యం జరిపి మెమోరాండమ్ సమర్పించడం జరిగింది. ఐనప్పటికీ సర్వీసు రెగ్యులరైజేషన్లు, ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కేళ్ళు, తదితర కొన్ని సమస్యలు మినహా ప్రధానమైన సమస్యలేవీ పరిష్కారం కానందున ఏప్రిల్ 16 నుండి 30 వరకు 15 రోజులపాటు డి.ఇ.ఓ. కార్యాలయం ఎదుట రిలే నిరాహారదీక్షలు విజయవంతంగా నిర్వహించింది. నిరాహారదీక్షలకు మద్దతుగా ఫిబ్రవరి 21న ఖమ్మం పట్టణంలో ఉపాధ్యాయుల భారీ ప్రదర్శనను కూడా నిర్వహించారు.

జిల్లా ఉపాధ్యాయ ఉద్యమచరిత్రలోనే ప్రప్రథమంగా పక్షం రోజులు నిర్వహించబడిన నిరాహారదీక్షలలో మండుటెండలను సైతం లెక్కచేయక వివిధ మండలాల నుండి 81 మంది కార్యకర్తలు అత్యంత క్రమశిక్షణతో పాల్గొనగా సుమారు 14 వందల మంది శిబిరాన్ని సందర్శించి మద్దతు తెలిపారు. చివరి పనిదినమైన ఏప్రిల్ 23న కూడా రిటైర్డ్ ఉపాధ్యాయులతో శిబిరం కొనసాగించడం విశేషం.

డి.ఇ.ఓ. 3 దఫాలుగా జిల్లాశాఖ ప్రతినిధులను ఆహ్వానించి సుదీర్ఘంగా చర్చలు జరిపి పోరాటం విరమించాలని కోరగా సమస్యలు పరిష్కరిస్తూ స్పష్టమైన ఉత్తర్వులు ఇస్తే తప్ప విరమించేది లేదని బాధ్యులు స్పష్టం చేశారు. భద్రాచలం శాసనసభ్యులు సున్నం రాజయ్య, సి.ఐ.టి.యు., జె.ఎ.సి., తదితర ఉద్యోగ, కార్మిక సంఘాల నాయకులు, శిబిరాన్ని సందర్శించి మద్దతు నివ్వటంతోపాటు, సమస్యలు పరిష్కరించాలని డి.ఇ.ఓ.కు లేఖలు వ్రాశారు. యు.టి.ఎఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ, వరంగల్ స్కూల్ ఎడ్యుకేషన్ రీజినల్ జాయింట్ డైరెక్టర్ ఇ.ఆర్. అప్పారావు జోక్యం చేసుకొని డి.ఇ.ఓ.పై తెచ్చిన వత్తిడి ఫలితంగా ప్రధానమైన 15 సమస్యలపై ఉత్తర్వుల నివ్వడంతోపాటు మరొక 3 ముఖ్య సమస్యలు పరిష్కారానికి స్పష్టమైన హామీ నివ్వడంతో ఏప్రిల్ 30 రాత్రి 9.00 గం॥లకు దీక్షలు విరమించడం జరిగింది. D.E.O. బి. సుధాకర్, P.E.O. బెనహర్‌బాబు Dy.E.O. జాషువా, ప్రభుత్వ పరీక్షల సహాయ కమిషనర్ సాయిలు,

Dy.I.O.S. అంబా ప్రసాదరావు, కార్యాలయ సిబ్బంది శిబిరానికి హాజరై పరిష్కరించిన సమస్యలు, పరిష్కారానికి హామీ యిచ్చిన సమస్యలను వివరించి దీక్షలో పాల్గొన్న కార్యకర్తలకు చెరకురసం ఇచ్చి దీక్షా శిబిరాన్ని విరమింపజేశారు.

## U.T.F. ఖమ్మం జిల్లాశాఖపై A.P.T.F. జిల్లాశాఖ దుష్ప్రచారానికి ఖండన

జిల్లాలో అన్నీ యాజమాన్యాలలోను సభ్యత్వం కలిగి అగ్రగామి సంఘంగా ఉన్న యు.టి.ఎఫ్. ఆయా యాజమాన్యాలలోని సమస్యల పరిష్కారానికి సందర్భోచితంగా ఉద్యమాలు నిర్వహించి విజయం సాధించింది. అదే క్రమంలో కామన్ సర్వీస్ రూల్స్ అమలు జరిగిన తర్వాత పెరిగిన బాధ్యతల కనుగుణంగా D.E.O. కార్యాలయం తన పనివిధానాన్ని మార్చుకోకుండా సమస్యల పరిష్కారంలో తాత్సారం చేస్తూ వుంటే, యు.టి.యఫ్. తనదైన శైలీలో దశలవారీగా ప్రాతినిధ్యాలు, చర్చలు, ఆందోళన, పోరాట కార్యక్రమాలను ఎంచుకొని నిర్వహిస్తూ, ఉపాధ్యాయుల ఆదరాభిమానాలు పొందుతుంటే చూసి ఓర్వలేని A.P.T.F. ఖమ్మం జిల్లా కమిటీ U.T.F. జిల్లాశాఖపై నిందలు వేస్తూ ఏప్రిల్ "ఉపాధ్యాయ" పత్రిక ద్వారా తన అక్కసు వెళ్ళగక్కుతూ దుష్ప్రచారానికి పూనుకున్నదని యు.టి.యఫ్. ఖమ్మం జిల్లాశాఖ ఒక ప్రకటనలో పేర్కొంది.

ఫిబ్రవరి 10, 11 తేదీలలో జరిగిన జిల్లా కౌన్సిల్ నిర్ణయం మేరకు, ఫిబ్రవరి 23న సాయంత్రం 100 మంది ఉపాధ్యాయులతో సామూహిక ప్రాతినిధ్యం నిర్వహించుటకై D.E.O. కార్యాలయానికి వెళ్ళడం జరిగింది. ఆ సందర్భంగా D.E.O. అప్పటికప్పుడే G.A.O., సూపరింటెండెంట్స్‌ను పిలిపించి ఉపాధ్యాయులందరి సమక్షంలో 2 1/2 గంటలపాటు చర్చలు జరిపి మార్చి మొదటి వారంలోపు సమస్యలన్నీ పరిష్కరిస్తానని హామీ యిచ్చారు. A.P.T.F. వారు ఫిబ్రవరి 27న ధర్నా చేస్తామని (ధర్నా చేయలేదనుకోండి) నోటీస్ యిచ్చారట, డి.ఇ.ఓ. 24న వారిని చర్చలకు పిలిచారట, కనుక వారి చర్చలకంటే ముందుగా మరెవరూ ఏ పోరాట కార్యక్రమమూ చేపట్టకూడదట. ఈ విషయమై ఆ సంఘం రాష్ట్ర నాయకుడు పత్రికలలో ప్రకటనలివ్వగా, వారి ప్రకటనను ఖండిస్తూ యు.టి.యఫ్. సమాధానం ఇచ్చింది. ఐనా అదే వ్రాతలను వారి పత్రికలో వ్రాసుకున్నారు.

ఆ వ్రాతలలో మరో సంఘటనను కూడా ప్రస్తావించారు. అదేమంటే ఎయిడెడ్ పి.ఆర్.సి. బకాయిల చెల్లింపుకై యు.టి.యఫ్. చేసిన కృషి మేరకు నవంబరు నెలాఖరుకుబిల్లులన్ని మంజూరు చేయబడినవి. ఈ విషయాన్ని సర్క్యులర్ ద్వారా, పత్రికా ప్రకటన ద్వారా ఉపాధ్యాయులకు తెలియజేయడం జరిగింది. ఈ వాస్తవాన్ని జీర్ణించుకోలేని A.P.T.F. జిల్లా నాయకత్వం తాము చేసిన కృషిని ప్రచారం చేసుకోవలసింది పోయి యు.టి.యఫ్. స్వామిభక్తిని ప్రదర్శించిందంటూ, పడికట్టు పదజాలంతో బురద జల్లే కార్యక్రమాన్ని చేపట్టింది. ధర్నాలకు నోటీసులివ్వటం, చర్చలు జరపటం, విరమించుకోవటం వారి పేటెంట్ హక్కైనట్లు, ఆ కాలంలో మరెవరు ఏ ప్రాతినిధ్యం గాని, ఉద్యమంగాని నిర్వహించరాదని భావించటం వారి అవివేకానికి నిదర్శనం.

ఎమర్జెన్సీ కాలంలో 20 పాయింట్ల ఫార్ములాను వేనోళ్ళ కీర్తించిన నాయకులకు, ఎయిడెడ్ టీచర్ల డైరెక్టు పేమెంటు విషయంలో అవమానకర షరతులతో కూడిన అగ్రిమెంటుపై సంతకం పెట్టాలన్న నాయకులకు వారసులైనవారు, ప్రయివేటీకరణకు మరో రూపమైన గిరిజన పాఠశాలల సొసైటీని నిస్సిగ్గుగా సమర్పించిన వారికంటే స్వామిభక్తి పరాయణు లెవరుంటారో వారే సెలవివ్వాలి.

ఎమర్జెన్సీలో పుట్టి, పుట్టిన నాటి నుండి పాలకవర్గాల ఉపాధ్యాయ వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా రాజీలేని పోరు చేస్తున్న యు.టి.యఫ్.కు గల పోరాట పటిమను చరిత్ర మరుగుపరచగలదా ?

ఈ సందర్భంగా స్పష్టం చేయదలచుకున్నదేమంటే, ఒక సంఘం సమస్యలపై ఆందోళన చేస్తుంటే మరో సంఘం సమస్యలే లేవని ప్రకటిస్తే ఉద్యమానికి ద్రోహం చేసినట్లౌతుంది, కాని ఒక సమరశీల సంస్థగా యు.టి.యఫ్. తనదైన శైలీలో ప్రాతినిధ్యాలను, పోరాటాలను నిర్వహించడాన్ని ఐక్య ఉద్యమాలకు ద్రోహం చేయడంగా అభివర్ణించడం సమంజసమేనా ? ఐక్య ఉద్యమాల పట్ల ఎవరికెంత చిత్తశుద్ధి వుందో, తామే నాయకత్వం వహించి నడిపిన జిల్లా జె.సి.టి.ఎ. ఉద్యమాల సమీకరణలో స్పష్టమైంది కదా!

పోరాట రూపాల విషయంలో యు.టి.యఫ్.కు స్పష్టమైన అవగాహన ఉన్నది. ఆందోళనా పద్ధతుల గురించి A.P.T.F. వారితో పాఠాలు చెప్పించుకొనే స్థితిలో యు.టి.యఫ్. లేదని వారు గమనిస్తే మంచిది.

## దుగ్గిరాల మండలశాఖ ఆందోళన ఫలప్రదం

గుంటూరు జిల్లా దుగ్గిరాల మండల విద్యాశాఖాధికారి కార్యాలయం అవినీతికి నిలయంగా మారింది. M.E.O. సమస్యలు పరిష్కరించకుండా ఉపాధ్యాయులను వేధింపులకు గురిచేస్తూ, ప్రశ్నించిన యు.టి.యఫ్. బాధ్యులను అసభ్య పదజాలంతో దుర్భాషలాడటంతోపాటు అనవసర మెమోలు ఇచ్చి కక్ష సాధింపు చర్యలకు పూనుకున్న సందర్భంలో యు.టి.యఫ్. మండలశాఖ మార్చి 14న మండల పరిషత్ కార్యాలయం ఎదుట ధర్నా నిర్వహించాలని నిర్ణయించింది.

మాజీ మండలాధ్యక్షులు వెనిగండ్ల కృష్ణప్రసాద్, ప్రత్యేక అధికారి పి. పుల్లారావు జోక్యం చేసుకొని మార్చి 13న యు.టి.యఫ్. బాధ్యులను ఆహ్వానించి చర్చలు జరిపారు. M.E.O. తన తప్పిదాలను అంగీకరిస్తూ క్షమాపణ పత్రాన్ని వ్రాసి ఇచ్చి, సమస్యలన్నీ సత్వరమే పరిష్కరిస్తానని, కక్ష సాధింపు చర్యలను మానుకుంటానని వ్రాతపూర్వక హామీ ఇచ్చినందున ధర్నా యోచన విరమించుకున్నారు. చర్చలలో యు.టి.యఫ్. నాయకులు ఎం.వి. సీతారామయ్య, ఇ. అప్పారావు, జగపతిరావు, టి.ఎస్.ఎన్. మల్లేశ్వరరావు, మండల బాధ్యులు పి. బసవపున్నయ్య, యు. రమేష్, కె. పోతులూరయ్య, పి.ఎం. కొండయ్య తదితరులు పాల్గొన్నారు.

## దుగ్గిరాల మండలశాఖ కార్యాలయం ప్రారంభం

దుగ్గిరాలలో యు.టి.యఫ్. మండలశాఖ కార్యాలయాన్ని యు.టి.యఫ్. సీనియర్ నాయకులు ఇ. అప్పారావు మార్చి 31న ప్రారంభించారు. ఈ సందర్భంగా పి. బసవపున్నయ్య అధ్యక్షతన జరిగిన సభలో జిల్లా నాయకులు ఎం.వి. సీతారామయ్య, టి.ఎస్.ఎన్. మల్లేశ్వరరావు, ఎ. కుమారరాజు, మండల నాయకులు కె. పోతులూరయ్య, బి. శ్రీనివాస్, కె. కోటేశ్వరరావు, ఎం. శ్రీనివాసరావు, విశ్వప్రసాద్, యు. రమేష్ తదితరులు ప్రసంగించారు.

సీనియర్ ఉపాధ్యాయులు పి. ఉమామహేశ్వరరావు కార్యాలయ నిర్వహణకు రూ. 1000 లు విరాళం ప్రకటించారు. ఇంకా ప్రతినెల తనవంతుగా రూ. 100 లు ఇస్తానని వాగ్దానం చేశారు. మండలశాఖ వారికి ధన్యవాదాలు తెలిపింది.

## దేవరకొండలో చలివేంద్రం

సంఘం ఆశయాల కనుగుణంగా సామాజిక స్పృహలో భాగంగా యు.టి.యఫ్. డిండి, దేవరకొండ, చందంపేట, మండలశాఖల ఆధ్వర్యంలో దేవరకొండ ఆర్.టి.సి. బస్టాండ్ నందు ఏర్పాటు చేసిన చలివేంద్రమును యు.టి.యఫ్. నల్లగొండ జిల్లా శాఖ అధ్యక్షులు వి. జగదీష్‌బాబు ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో జిల్లా ప్రధాన కార్యదర్శి ఎ. నర్సిరెడ్డి, జిల్లా కార్యదర్శి రాజశేఖర్‌రెడ్డి సీనియర్ నాయకులు కేశవరెడ్డి, స్థానిక సర్పంచ్ హన్మంతుచంద్రయ్య, డాక్టర్ సజ్జాద్ జహీర్, డిండి M.E.O. Sd. ఖలీలుద్దీన్, యు.టి.యఫ్. డిండి, దేవరకొండ, చందంపేట మండల అధ్యక్ష, కార్యదర్శులు పాల్గొన్నారు. ప్రతిరోజు ఇరువురు ఉపాధ్యాయులు డ్యూటీలు వేసుకొని చలివేంద్రాన్ని ఉ॥ 9 గం॥ల నుండి రాత్రి 8 గం॥ల వరకు నిర్వహిస్తుండగా, 4 వేల మంది ప్రజలు వినియోగించుకుంటున్నారు. యు.టి.యఫ్. కార్యకర్తల సామాజిక సేవను పలువురు ప్రశంసిస్తున్నారు.

## ముప్పాళ్ళలో ఉపాధ్యాయుల ధర్నా

గుంటూరు జిల్లా ముప్పాళ్ళ మండల పరిషత్ యాజమాన్యం ఉపాధ్యాయ సమస్యలు పరిష్కరించకుండా మొండివైఖరి నవలంబిస్తుండటాన్ని నిరసిస్తూ యు.టి.యఫ్. మండలశాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 27న మండల పరిషత్ కార్యాలయం ఎదుట 54 మంది ఉపాధ్యాయులు ధర్నా నిర్వహించారు. ధర్నా శిబిరాన్ని జిల్లా సీనియర్ నాయకులు వి. విశ్వనాథం ప్రారంభించి ప్రసంగిస్తూ M.P.D.O., M.E.O. ల మొండివైఖరిని విడనాడాలని, విద్యావలంటీర్ల వేతనాలు చెల్లించాలని, మండల విద్యాకమిటీలో కోఆప్షన్ సభ్యత్వాన్ని యు.టి.యఫ్.కు కల్పించాలని డిమాండ్ చేశారు. ఈ శిబిరంలో జిల్లా ప్రధాన కార్యదర్శి యన్. రామారావు, జిల్లా నాయకులు యం. రాయన్న, వి. పాములరెడ్డి, జి. మురహరిరావు, కె. కోటేశ్వరరావు, పి. హనుమంతరావులు పాల్గొని ప్రసంగించారు.

మే 2న M.P.D.O., M.E.O.లు తమ మొండివైఖరి విడనాడి, యు.టి.యఫ్. ప్రతినిధులను ఆహ్వానించి చర్చలు జరిపారు. సమస్యలన్నీ పరిష్కరించడానికి అంగీకరించారు. చర్చలలో జిల్లా గౌరవాధ్యక్షులు M.A.K. దత్తు, నాయకులు Ch.V. బ్రహ్మం తదితరులు మరియు మండలబాధ్యులు పాల్గొన్నారు.

## విచారణలో నెల్లూరు D.E.O. అక్రమాలు

## బట్టబయలు ! అక్రమ బదిలీల రద్దు !! - DEO బదిలీ !!!

నెల్లూరు జిల్లాపరిషత్ మాజీ చైర్మన్ నాగభూషణమ్మ జరిపిన అక్రమ బదిలీల పర్వం జిల్లా ఉపాధ్యాయులు పూర్తిగా మరువకముందే మరో బదిలీల బకాసురుడు జిల్లాలో DEO రూపంలో ఉద్భవించాడు.

రూల్స్, రెగ్యులేషన్స్ - జి.ఓ.లు ఏమి అక్కరలేదు డబ్బుంటే చాలు బదిలీలు డిప్యుటేషన్ల పండగే ! ఒకటా రెండా దగ్గిర దగ్గిర 80 పైగా జరిగాయి. DEO గారికి వంతపాడుతూ ఇతర ఉపాధ్యాయ సంఘాలు సరేసరి ! దళారీలకు అడ్డే లేకపోయింది.

J.A.C. పక్షాన అక్రమ బదిలీలపై విచారణ జరుపాలని కోరుతూ పోరాటం ప్రారంభమైంది. ఫిబ్రవరి 6న సుమారు 1500 మందితో కలెక్టరు కార్యాలయం ఎదుట ధర్నా - ప్రదర్శన జరిగింది. జాయింట్ కలెక్టర్ గారు, డిప్యూటీ డైరెక్టరుగారు విడివిడిగా విచారణలు జరిపి ప్రభుత్వానికి నివేదికలు పంపారు. మన రాష్ట్ర నాయకులు విద్యాశాఖ మంత్రి గారిని, విద్యాశాఖ కార్యదర్శిని - డైరెక్టర్ గార్ని కలిసి విషయ తీవ్రతను వివరించారు. ఫలితం ! అక్రమాలన్ని రుజువైనాయి. తప్పు చెయ్యలేదని బుకాయిస్తున్న DEO గారు అదిలాబాద్ జిల్లాకు బదిలీ అయ్యారు అక్రమ బదిలీలన్నీ రద్దయినాయి.

DEO గారు ఏ తప్పు చెయ్యలేదని కితాబులిచ్చి చిందులు తొక్కిన సోదర సంఘాలు చతికిలబడ్డాయి. అటు ఉపాధ్యాయులకు - ఇటు అధికారులకు మొహం చూపలేక బిక్కచచ్చిపోయాయి. మోసపోయిన ఉపాధ్యాయులు దళారీల చొక్కా పట్టుకొని నిలవెయ్యాలని చూస్తున్నారు. ఇది అక్రమ బదిలీల కోసం వెంపర్లాడే ఉపాధ్యాయులకు గుణపాఠం. దళారీలకు కోలుకోలేని చావుదెబ్బ. యు.టి.యఫ్. కంఠంలో మరో మణిహారం !!!

## సింగరేణి ఉపాధ్యాయుల బదిలీలలో ప్రభుత్వ నిబంధనలు పాటించాలి

సింగరేణి యాజమాన్యంలోని పాఠశాలల్లో పనిచేయుచున్న ఉపాధ్యాయుల బదిలీలకు ప్రభుత్వ ఉత్తర్వులలోని మార్గదర్శక సూత్రాల ననుసరించి కౌన్సిలింగ్ నిర్వహించాలని యు.టి.యఫ్. ఆదిలాబాద్ జిల్లా సింగరేణి సెక్టార్ శాఖ డిమాండ్ చేసింది. మే 4న మందమర్రిలో సెక్టార్ అత్యవసర సమావేశం జి. లక్ష్మీనారాయణ అధ్యక్షతన జరిగింది. సొసైటీ బూచిని చూపి టీచర్లను ఇష్టం వచ్చినట్లు ఎయిడెడ్ నుండి అన్ ఎయిడెడ్ పోస్టులలోనికి బదిలీలు నిర్వహించాలని నిర్ణయించి ఉపాధ్యాయులను బలవంతంగా ఒప్పించే ప్రయత్నాలను యాజమాన్యం మానుకోవాలని, ఉపాధ్యాయుల సర్వీసుకు నష్టం కలుగకుండా నివారించాలని ఆ సమావేశం యాజమాన్యానికి విజ్ఞప్తి చేసింది. ఈ సమావేశంలో సెక్టార్ ప్రధాన కార్యదర్శి డి. వీరస్వామి పాల్గొన్నారు.

## నెల్లూరు జిల్లా నూతన కౌన్సిల్ సమావేశాలు

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ నెల్లూరు జిల్లా 28వ జనరల్ కౌన్సిల్ సమావేశాలు మార్చి 9, 10 తేదీలలో కావలిలో అమరజీవి ఆకాశం వీరయ్య నగర్‌లో నిర్వహింపబడినాయి. జిల్లా అధ్యక్షులు బి. రమణయ్య అధ్యక్షతన జరిగిన ప్రారంభ సభలో రాష్ట్ర గౌరవాధ్యక్షులు డి. రామిరెడ్డి, కావలిసి మున్సిపల్ చైర్మన్ గ్రంధి యానాది శెట్టి, ఇంజనీరింగ్ కళాశాల ప్రిన్సిపల్ కె. రాజారెడ్డి తదితరులు ప్రసంగించారు. అనంతరం జరిగిన విద్యాగోష్ఠికి జిల్లా కార్యదర్శి పి. జానకిరాం అధ్యక్షత వహించగా ఎనాలిసిస్ గౌరవ సంపాదకులు డా॥ కె. నాగేశ్వర్, ప్రజాశక్తి సంపాదకులు వి. వెంకటేశ్వర్లు, ఎస్.వి. యూనివర్శిటీ ప్రొఫెసర్ డి. వెంకటేశ్వర్లు, కావలి పి.జి. సెంటర్ స్పెషలాఫీసర్ ప్రొ॥ జి. చంద్రశేఖర్‌రావులు విలువైన ప్రసంగాలు చేశారు.

సాయంత్రం కావలి పట్టణ వీధులలో 1000 మంది ఉపాధ్యాయులతో మహాప్రదర్శన అనంతరం మండల పరిషత్ కార్యాలయం ఆవరణలో బహిరంగసభ నిర్వహింపబడినవి.

10వ తేది ఉదయం బి. రమణయ్య అధ్యక్షతన కౌన్సిల్ సమావేశంలో రాష్ట్ర అధ్యక్షులు కె. జోజయ్య పాల్గొన్నారు. పి. బాబురెడ్డి కార్యదర్శి నివేదికను, యల్. గుణశేఖర్‌రెడ్డి ఆర్థిక నివేదికను, డి. భాస్కరరావు సంక్షేమ పథకం నివేదికను ప్రవేశపెట్టారు.

సాయంత్రం కె. జోజయ్య ఎన్నికల అధికారిగా వ్యవహరించి నిర్వహించిన ఎన్నికలలో నూతన కమిటీ ఏకగ్రీవంగా ఎన్నుకోబడింది.

**గౌరవాధ్యక్షులు :** టి. కొండాచారి; **అధ్యక్షులు :** బి. రమణయ్య; **ఉ. అధ్యక్షులు :** జె. వెంకటయ్య; **ప్ర.కార్యదర్శి :** పి. బాబురెడ్డి; **కోశాధికారి :** ఎల్. గుణశేఖరరెడ్డి; **కార్యదర్శులు :** పి. జానకిరామ్, కె. పరంధామయ్య, సి. చంద్రశేఖర్, డి. భాస్కర్, జి. రామిరెడ్డి, ఎస్‌కె. ఖాజారసూల్,

పి. రామ్మూర్తి, జి.పి. నరసింహం, ఎస్. రాధాకృష్ణమూర్తి, వై. రాజశేఖర్‌రెడ్డి, పి. శేషమ్మ కె. ఉదయకుమార్; రాష్ట్ర కౌన్సిలర్లు : వి. బాలసుబ్రమణ్యం, టి.వి.పి. కన్యాకుమారి, ఇ.వి. నారాయణ, పి.వి. సుబ్రహ్మణ్యం, సిహెచ్. శ్రీహరి, సిహెచ్. రఘునాథ్, డి. మధు, ఎన్. జయచంద్ర, జి. వెంకటేశ్వర్లు నాయుడు, జి. మోహన్‌రావు; **ఆడిట్ కమిటీ :** ఎన్.వి. సుబ్బారావు; (**కన్వీనర్** ) పి. జనార్ధనం, ఎం. అచ్చయ్య

## మండల పట్టణ శాఖల నిర్మాణం

### రంగారెడ్డి జిల్లా

**రాజేంద్రనగర్ (మం) :** అ : డి. మల్లారెడ్డి; అ.అ : డి. రాంకిషన్‌రావు; ప్ర.కా. : ఆర్. శ్రీధర్‌శర్మ; కో.అ : ఎ. శివకుమార్; కా : పి. క్రిష్ణయ్య, బి. టెలీశ్వరయ్య, సిహెచ్. దేవి సీతాకుమారి, జి. రాంచంద్రారెడ్డి, ఎం. అంజయ్య, యన్. సుదర్శన్, బాలకృష్ణ

### విజయనగరం జిల్లా

**శృంగవరపు కోట (మం :** అ : సిహెచ్. సూర్యారావు; అ.అ : కన్నాజి; ప్ర.కా. : ఎం. సుబ్బరాజు; కో.అ : కె. సత్యారావు; కా : జి. శ్రీనివాస్‌రావు, వి.ఇ. సత్యనారాయణ,. బి. మహేశ్వరరావు, కె. బంగారు నాయుడు, సిహెచ్. సుజాత, ఎం. కొండలరావు; జి.కౌ : రాయవరపు సత్యం, జి.వి. సూర్యనారాయణ, పి. గంగయ్యమ్మ, జి. వెంకటరావు, జి.వి. రమణ.

**విజయనగరం (మం) :** అ : పి. పైడినాయుడు; అ.అ : కె.యు.డి. అప్పారావు; ప్ర.కా : వి. భాస్కరరావు; కో.అ : కె. శ్రీనివాసరావు; కా : ఎం. ప్రసాద్, బి.జె. ప్రకాష్, ఎ. నారాయణస్వామి, పి. సుశీల, డి. కామేశ్వరరావు; జి.కౌ : ఎస్. అప్పలరాజు, బి.యస్.యన్. పైడిరాజు, వి. కృష్ణారావు, జి. సన్యాసినాయుడు.

**బొబ్బిలి (మం) :** అ : రెడ్డి వేణు; అ.అ : ఎ. శ్రీనివాసరావు; ప్ర.కా : పి. సత్యంనాయుడు; కో.అ : కె. విజయగౌరి; కా : వి. అప్పారావు, పి. ఈశ్వరరావు, ఎ.కృష్ణమూర్తినాయుడు, పి. సింహాద్రినాయుడు, యస్. అప్పారావు.

**పార్వతీపురం (పట్టణం) :** అ : ఆర్.ఎన్. చౌదరి; అ.అ : కె. భాస్కరరావు; ప్ర.కా : ఎ. భాస్కరరావు; కో.అ : రెడ్డి రమేష్; కా : ఎన్. లలితమ్మ.

**జియమ్మ వలస (మం) :** అ : డి. నాగభూషణరావునాయుడు; అ.అ : కర్రె నరసింగరావు; ప్ర.కా : షేక్ అన్వర్ భాషా; కో : లచ్చిరెడ్డి మోహనరావు; కా : ఎం. రాగోపాలరావునాయుడు, ఎల్. సత్యన్నారాయణ, వి.టి. శారదాకుమారి, కె. సూరి; జి.కౌ : డి. వెంకటరమణ, జె. సతీశ్వరరావు

**కురుపాం (మం) :** అ : ఆర్ వాసుదేవరావు; అ.అ : ఎస్. సింహాచలం; ప్ర.కా : యస్. మధుసూదనరావు నాయుడు; కో.అ : జి. చళీలాల్; కా : ఎన్. గీత, కె. నారాయణ, కె. కృష్ణారావు, కె. అక్కెన, కె. సూర్యనారాయణ; జి.కౌ : బి. చిన్నం నాయుడు, కె. వీరయ్య, వి. నాగమణి.

**పార్వతీపురం (మం) :** అ : పి. వెంకటరమణ; అ.అ : బి. ధనుంజయరావు; ప్ర.కా : యస్. మురళీమోహన్; కో.అ : వై. రామకృష్ణ; కా : పి.పి. శ్రీనివాస్, టి. రామన్న దొర, డి. రామకృష్ణ, బి.వి.యల్. రమణి; జి.కౌ : కె. చిన్నంనాయుడు, సిహెచ్. నారాయణ

**గుర్ల (మం) :** అ : ఎ. సత్యానందం; అ.అ : కె. శ్రీనివాసరావు; ప్ర.కా : కె. శ్రీనివాసరావు; కో.అ : ఎం. ప్రసాద్; కా : పి. రామనాయుడు, డి.వి. ప్రశాంతకుమార్, వై. నారాయణరావు; జి.కౌ : సిహెచ్. రమణమూర్తి

**పాచిపెంట (మం) :** అ : వై. సుందరరావు; అ.అ : ఎ. సురేష్; ప్ర.కా : ఆర్. సింహాచలం; కో.అ : పి. నాగేశ్వరరావు; కా : ఎం.యస్.యస్. శ్రీనివాసరావు, కె. సింహాద్రి, పి. లక్ష్మణరావు, జి. సూర్యనారాయణ; జి.కౌ : ఐ. గున్నరాజు, ఎ.వి. రామారావు

**సాలూరు (మం) :** అ : పి.యస్. ప్రసాదరావు; అ.అ : ఆర్. అప్పారావు; ప్ర.కా : కె. సూర్యనారాయణ; కో.అ : ఎల్. నాగరాజు; కా : సిహెచ్. సుగుణ, బి. గెల్లయ్య, కె. జానకీరావు; జి.కౌ : కె. బాలకృష్ణ.

**పెంకొడ (మం) :** అ : ఆర్. సత్యం; అ.అ : ఎ. పైడిరాజు; ప్ర.కా : రమేష్‌బాబు; కో.అ : ఎం.వి. బాలాజీరావు; కా : జి. సన్యాసినాయుడు, కె.వి. సుబ్బారావు, కె. ఆదినారాయణ, ఎం. దక్షిణామూర్తి, జి. కృష్ణమూర్తి; జి.కౌ : కె. శ్రీనివాసరావు, కె.బి. ప్రకాశరావు, కెవి.డి.యస్. లక్ష్మి

**కొత్తవలస (మం) :** అ : బి. అప్పారావు; అ.అ : పి. సన్యాసిరావు; ప్ర.కా : ఐ.యస్.ఇ. శర్మ; కో.అ : వి. అరుణ్‌కుమార్, కా : ఇ.యస్. రాజు, కె. వెంకటేశ్వరరావు; యస్. అప్పన్న, డి. శోభారాణి; జి.కౌ : జి. మధుసూదనరావు

### కర్నూలు జిల్లా

**ఆథోని :** అ : ఎం. జంబులింగయ్య; అ.అ : కె. దస్తగిరి బాష; ప్ర.కా : జి. హనుమన్న; కో.అ : డి. శేకన్న

**ఆత్మకూరు :** అ : ఎ.యం.డి. రఫీక్; అ.అ : ఎన్. భాస్కర్; ప్ర.కా : డి. జవహర్‌లాల్ నాయక్; కో.అ : డి. పోలయ్య

**బేతంచర్ల :** అ : డి.యన్. కాసయ్య; అ.అ : వై. మనోహర్; ప్ర.కా : ఎం. యాగంటయ్య; కో.అ : జె.వి. మల్లకార్జునస్వామి

**సిబెళగళ్ :** అ : జి. రాముడు; అ.అ : వెంకటేశ్వరగౌడ్; ప్ర.కా : పి. అక్కన్న; కో.అ : కె. భాస్కరబాబు

**డోన్ :** అ : పి. శంకరయ్య; అ.అ : వి. భూకాంతరెడ్డి; ప్ర.కా : కె. లక్ష్మయ్య; కో.అ : కె. శ్రీనివాసులు


ఉభయ గోదావరి జిల్లాల్లోనే
అతి పెద్ద వెండి బంగారు నగల
మెగా ఎ.సి. షోరూమ్
చెరుకూరి స్వర్ణాంజలి
కంబాల చెరువు, రాజమండ్రి
0883-469366, 475602
ఆర్డర్‌పై కూడా ఆభరణములు
తయారుచేయబడును
శుక్రవారము మాత్రమే శెలవు
ఆదివారం కూడా షోరూం తెరచి ఉంచబడును

## ప్రభుత్వ ఉత్తర్వులు

క్రొత్తగా 7351 ప్రాథమిక పాఠశాలల స్థాపన - పోస్టుల మంజూరు

GOVERNMENT OF ANDHRA PRADESH

ABSTRACT

Elementary Education-Establishment 7351 New Primary Schools in School less habitations in the Backward Mandals in the State during 2001-2002- Orders- Issued.

---

EDUCATION (MC) DEPARTMENT

**G.O.Ms.No. 62** **Dated : 26-05-2001**

ORDER :

The Government have decided to expand access to good quality primary education to all the School age children in the State as part of the Education for All Mission.

2) In order to achieve the goal of Universalisaiton of Elementary Education and also in order to fulfill the Constitutional obligation to provide educational facilities to all the children in the age group of 6-14 years, the Government accord sanction for establishment of 7351 New Primary Schools in School-less habitations in the State during 2001-2002.

3) The Director of School Education is requested to establish the above newly sanctioned Primary Schools in the areas in all the School-less habitations and villages having no Government/local body Schools during 2001-2002.

4) The Government accord sanction for creation of 13,673 posts of teachers for the newly established 7351 primary schools. However, initially only 7351 teacher posts shall be filled up during 2001-2002.

5) The teachers shall be paid salaries as per the orders in force. The posts sanctioned shall not be diverted to any other village.

6) The Government order that the construction of the Primary School buildings shall be taken up under DPEP, XI Finance Commission and other Schemes.

7) The expenditure toward salaries for the teachers shall be debited to the following Head of Account.

**General**

" 2202-General Education-01 Elementary Education MH 800 -Other Expenditure Schemes included in the Plan- SH(25) Universalisation of Primary Educaiton " Andarki Vidya" -090/092 OGIA - 340/342 Other Expenditure"

**Tribal Sector :**

"2202- General Education -01 Elementary Education - M.H. 796 Tribal Areas Sub plan Schemes included in the Plan - SH (31) Universalisation of Primary Education " Andariki Vidya" -090/092 OGIA - 340/342 Other Expenditure "

8) Necessary orders releasing the budget have been issued by the Finance & planning Department vide GO.Ms.No. 225, Finance (EBS-VI) Department dt. 26-5-2001.

9) The expenditure shal be met in relaxation of treasury control order pending provision of funds by way of re-appropriation from over all savings of Education Department to cover the actural expenditure incurred.

10) This order issues with the Concurrence of Finance & Planning (Finance Wing : EBVI) Department vide their U.O.No. 1249/436/EBS-6/2001, dt. 26-5-2001.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF ANDHRA PRADESH)

*I.V. SUBBARAO,*
Secretary to Government.

4352 ప్రాథమిక పాఠశాలలు ప్రాథమికోన్నత పాఠశాలలుగా అప్ గ్రేడేషన్ - పోస్టుల మంజూరు

GOVERNMENT OF ANDHRA PRADESH

ABSTRACT

Elementary Education- Upgradation of 4352 Primary Schools into Upper Primary Schools in the State during 2001-2002-Orders -Issued.

---

EDUCATION(MC) DEPARTMENT

**G.O.Ms.No. 63** **Dated : 26-05-2001**

Read

From the Director of School Education Lr.No. 1021/ B4-1/2000 dated : 14-05-2001.

★★★★

ORDER :

Recognizing that a large number of children are droping out of School system because there are inadequate number of Upper primary Schools. Government have decided to upgrade all Primary Schools into Upper Primary Schools in a phased Manner. Initially, Government have decided to upgrade 4,352 Government Primary Schools into Upper primary Schools in the State by opening VI Class in each of the UPS during the current financial year 2001-2002 and hereby issue orders accordingly.

2) Government also accord sanction for creation of 17,408 posts as follows :

1. School Assistant (Maths/Science) : 4352
2. School Assistant (Social Studies ) : 4352
3. Telugu Pandit Grade-II : 4352
4. Hindi Pandit Grade-II : 4352

3) Since only one class will be added during the current financial year 2001-2002, only two posts i.e., one post of School Assistant and one post of Language Pandit will be filled up during this year and balance two posts will be filled in 2002-2003.

4) The post of School Asst. Sanctioned in para (2 &3 above) for the upgraded Upper Primary Schools shall be filled up by way of direct recruitment as per the orders in force.

5) The expenditure towards salaries to the posts sanctioned above shall be debited to the following Head of Account. :

" 2202 - General Education-01 Elementary Education MH 800- Other Expenditure Schemes included in the plan -SH (25) universalisation of primary Education "Andariki Vidya" - 090/092 OGIA 340/342 other Expenditure ".

6) The expenditure shall be met in relaxation of treasury control order pending provision of funds by way of re-appropriation from over all savings of Education Department.

7) Necessary orders releasing the budget have been issued by the Finance Department vide G.O.Ms.No. 225, Finance (EBS-6) Department, dt. 26-5-2001.

8) Government order that the construction of the Class Rooms to the new Upgraded Upper primary Schools

shall be taken up under DPEP, XI finance Commission an dother schemes of State and Central Government.

9) The Director of School Education is requested to take necessary action accordingly and also issue necessary guidelines in the matter.

10) This order issues with the concurrence of Finance and Planning (Finance wing vide their U.O.No. 1249/436/EBS-6/2001, dt. 26-5-2001).

(BY ORDER AND IN THE NAME OF
THE GOVERNOR OF ANDHRA PRADESH)

*I.V. SUBBA RAO,*
SECRETARY TO GOVERNMENT.

1130 అప్ గ్రేడెడ్ హైస్కూల్స్‌కు పోస్టులు మంజూరు

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Public Services-Direct Recruitment for the posts of Teachers by the District selection Committees - Permission to take up general recruitment to the vacancies meant for Direct recruitment under the purview of the D.S.C. - Orders-Issued.

---

EDUCATION (SER.VI) DEPARTMENT

**G.O.Ms.No. 64** **Dated : 26-05-2001**

Read the following :

1. G.O.Ms.No. 71 Education Department, dated 30-6-2000
2. G.O.Ms.No. 224, GA(SPF-A) Department, dt. 30-6-2000.
3. G.O.Ms.No. 226 GA(SPF-A) Department, dt. 1-7-2000.
4. G.O.ms.No. 72 Educaiton (Ser.VI) Department, dt. 3-7-2000.
5. G.O.Ms.No. 73 Education (Ser.VI) Department dt. 3-7-2000
6. G.O.Ms.No. 74 Education (Ser.VI) Department dt. 3-7-2000
7. G.O.Ms.No. 139 Education dt. 23-10-2000.
8. From the Director of School Education, Hyderabad Lr.No. 3200/C2-4/2001 dated 16-05-2001.
9. G.O.Ms.No. 62, Education (MC) Department dt. 26-05-2001.
10. G.O.Ms.No.63, Education (MC) Department dt. 26-05-2001.

ORDER :

In order to accelerate the progress towards providing quality education for all children, the State Government have decided to set up Primary Schools in all habitations and upgrade existing Primary Schools into Upper Primary Schools in a Phased manner. In order to improve quality at High School stage, the Government have decided to provide additional teachers to augment existing teaching staff.

2. Accordingly, following new posts have been created in G.Os 9th and 10th read above.
   (i) Sanction of 13,673 teachers posts for the 7351 Primary Schools in the State during 2001-2002.
   (ii) Sanction of 17,408 (4352 School Assistant posts and 4352 Language Pandit Posts) for 4352 Upper Primary Schools in the State during 2001-2002.

3. In addition, Government accord creation of 5650 Posts in 1130 upgraded high Schools @ 5 teachers in each high School.

4. The Director of School Education in the reference eighth read above has requested the Government for permission to fill up the vacant posts after issuing notification through D.S.C. 2001.

5. The Government after careful consideration hereby permit the Director of School Education to initiate process of recruitment to the following number of posts of teahcers out of the total sanctioned posts.

| | | |
|---|---|---|
| Primary Schools | : | 7,351 |
| Upper Primary Schools | : | 8,704 |
| High Schools | : | 5,650 |
| Existing vacancies, including backlog | : | 10,424 |
| **Total :** | | **32,129** |

6. The Government have framed, in the G.O.fourth read above, the Rules, i.e., Andhra Pradesh Direct Recruitment of teachers (Scheme of Selection) Rules, 2000.

7. All the Conditions prescribed in the G.Os referred at first, fourth, fift, Sixth and seventh read above shall apply mutatis-mutandis to this process of general recruitment of teachers.

8. The Director of School Education is requested to notify the number of vacancies District- wise separately

9. A detailed schedule relating to the issue of notification and calling for applications and conduct of examination shall be notified by the Director of School Education, Hyderabad

10. The Director of School Education and the Chairman District Selection Committees shall scrupulously adhere to the terms of the schedule.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF ANDHRA PRADESH)

*I.V. SUBBA RAO,*
SECRETARY TO GOVERNMENT

జి.ఓ. 64లో డైరెక్టు రిక్రూట్‌మెంట్ ద్వారా అనే పదాలను తొలగించుట

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Elementary Education-Upgradation of 4352 Primary schools into upper primay schools in the State durintg 2001-2002- Orders - Issued-Amendement -Issued.

EDUCATION (M.C. ) DEPARTMENT

**G.O.Ms.No. 66** **Dated : 29-5-2001**

Read the following :

G.O.Ms.Bo. 63 Edn., (MC)Dept., dt. 26-5-2001

★★★★

ORDER :

The following amendment is issued to G.O.Ms.No. 63, Edn., (MC) Dept., dt. 26-5-2001.

AMENDEMENT

The words Viz. 'by way of direct recruitment' occuring in para 4 of the said G.O. Shall be deleted.

2. This order does not require the concurrence of the finance & Planning Department.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF ANDHRA PRADESH)

*I.V. SUBBA RAO*
Secretary to Government

జి.ఓ. 64 ద్వారా మంజూరైన పోస్టుల వివరములు

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Public Services-Direct recruitment of Teachers Posts by the DSC,. - Permission to take general recruitment to the

